

# జన్మ నక్షత్ర పాద శివ లింగాలు

## (108 నక్షత్ర పాద శివాలయాలు)



**కె.కె.మంగపతి,** సెల్: 9110582156, కాకినాడ-3

Written By: K K Mangapathi, Yatra -Telugu (Facebook Page), Youtube Channel

Website : www.srirajarajeswaripeetham.com

Website & Ebook By : www.amruthasrisaidurga.com




# భీమమండలం లోని 108 పాద శివాలయాలు (భీమసభ)

కోనసీమ జిల్లా, రామచంద్రపురం మండలానికి చెందిన ద్రాక్షరామ క్షేత్రం అనాదిగా గొప్ప శైవ క్షేత్రం. క్షేత్రం నందలి సప్త గోదావరులు (కొలను) ఒడ్డున స్వయంభూవుగా వెలసిన శ్రీ భీమేశ్వర స్వామి మరియు అష్టాదశ శక్తి పీఠాలల్లో ఒకటి అయిన శ్రీ మాణిక్యాంబ అమ్మవారి దర్శనం లభ్యమవుతుంది. శ్రీ భీమేశ్వర లింగమును సూర్య భగవానుడు ప్రతిష్ఠించినాడు. భీమేశ్వర లింగము యొక్క ఊష్మము (తాపము) నివారించుటకు, చంద్రభగవానుడు శ్రీ భీమేశ్వర లింగమునకు ఎనిమిది దిక్కుల యందు మరో ఎనిమిది శివాలింగాలును ప్రతిష్ఠించినట్లు స్థల పురాణం తెల్పుతుంది. వీటిని అష్ట సోమేశ్వర ఆలయాలు అంటారు. వీటితో పాటు **ద్రాక్షరామ క్షేత్రంనకు ఎనిమిది దిక్కుల యందు 108 పాద శివలింగాలను** కూడ దర్శించగలము. వీటిని **జన్మ నక్షత్ర పాద శివ లింగాలు**గా పేర్కొనారు. ఈ **108 పాద శివలింగాలలో అష్ట సోమేశ్వర ఆలయాలు** ఒక భాగం.

శ్రీనాథ మహాకవి రచించిన **"భీమఖండం"** అను కావ్యం ద్రాక్షారామానికి సంబంధించినది. ఈ కావ్యాం నందు భీమమండలం ప్రాశస్త్యం, ఫలశృతి మొదలగునవి ఉంటాయి. భీమమండలములో గల 108 పాద శివ క్షేత్రాలు అంతరిక్షము నుంచి చూసిన ఒక పద్మాకారములో ఇమిడిపోయి దర్శనమిస్తాయి అని చెప్పబడింది.

**ఖగోళ శాస్త్రం ప్రకారము 27 నక్షత్రములు ఉన్నాయి. ఒక్కొక నక్షత్రము నకు 4 పాదములు ఉంటాయి. (27 నక్షత్రములు x 4 పాదములు = 108 పాదములు) 108 పాదములును 12 రాశులుగా పేర్కొంటారు. ఒక్కొక రాశిలో 9 పాదములు ఉంటాయి. (108 పాదములు ÷ 12 రాశులు = 9 పాదములు) మన పూర్వీకులు 108 జన్మ నక్షత్ర పాద శివలింగాలను భీమమండలములో ప్రతిష్ఠించారు.**

శిశువు జన్మించిన సమయంను బట్టి నక్షత్రం, పాదం, రాశి తెలుస్తుంది. వీటి వలన శిశువు జన్మించిన నక్షత్ర పాదం యొక్క దోషములు తెలుస్తాయి. ఆ దోషములు నివారించుటకు శాంతులు జరుపుతారు. జన్మించిన శిశువు యొక్క నక్షత్ర దోషములు నివారించుటకు భీమమండలములోని 108 జన్మ నక్షత్ర పాద శివలింగాలున్నాయి. ఆ శిశువు జన్మ నక్షత్ర పాదముకు సంబంధించిన లింగ ప్రతిష్ఠను దర్శించుట అవసరం. స్వామి దర్శనం తో వీరికి కొంత ఉపశమనం (ఊరట) దొరుకుతుంది. ఏ శాంతులు లేని వారు కూడ దర్శించుట మంచిది. ఆయా నక్షత్ర పాద లింగ ప్రతిష్ఠ నుంచి వారు ఆశ్వీరచనాలు పొందగలము.

108 జన్మ నక్షత్ర పాద శివలింగాల "నమూనా" ను ద్రాక్షారామ క్షేత్రం నందలి శ్రీ భీమేశ్వర స్వామి ఆలయములో చూడగలము. మొదటి ప్రాకారములో శ్రీ భీమేశ్వర స్వామి వారి ఆలయం రెండు అంతస్తులుగా ఉంటుంది. పై అంతస్తులో శ్రీ భీమేశ్వర లింగము నకు అభిషేకాలు, అర్చనలు జరుగుతాయి.

క్రింద భాగములో మూల విరాట్టు కొలువై ఉంటాడు. దీనిని "చీకటి కోణం" అంటారు. చీకటి కోణం యొక్క ప్రవేశ ద్వారము నకు కుడి వైపున **"భీమసభ"** ఉంటుంది. భీమసభ నందు 108 జన్మ నక్షత్ర పాద శివలింగాల **"నమూనా"** ను చూడగలము. ఒక శిల యందు సూక్ష్మరూపములో 108 పాద లింగాలు దర్శనమిస్తాయి.

శ్రీ భీమేశ్వర సందర్శనం అను పుస్తకమును శ్రీ రాజరాజేశ్వరి పీఠం, ద్రాక్షారామ వారు ముద్రించినారు. పుస్తకము నందు "నక్షత్రాల రీత్యా శివలింగాలు" అను ఒక శీర్షిక నందు 108 నక్షత్ర పాద శివలింగాలు గురించి వివరించారు. శ్రీ శివ బాల యోగి వారి ఆశీస్సులతో శ్రీ గుంపుల సోమేశ్వర రావు మరియు శ్రీ తాళ్ళ సాంబశివరావు గారి అన్వేషణ ఫలితముగా 108 నక్షత్ర పాద శివలింగాల సమాచారం లభ్యమైంది. ఆ శివ పుంగువులుకు నా నమస్కారములు.






రాశులలో ఇది మొదటిది.

సూర్యుడు మేషం సంచరించే కాలం మేషరాశిగా వ్యవహరిస్తారు.

ఈ నక్షత్ర సమూహం మేక ఆకారంలో ఉంటుంది.

మేకను మేషంగా పిలుస్తారు, కనుక ఇది మేషరాశి అయింది.

మేషరాశికి అధిపతి **కుజుడు**

మేషరాశిలో 9 ఆలయాలు ఉంటాయి.

**అశ్వని నక్షత్రంలోని 4 పాదాలు**

**భరణి నక్షత్రంలోని 4 పాదాలు**

**మరియు కృత్తిక నక్షత్రంలోని 1 పాదం**

9 ఆలయాలు కలిసి వృషభరాశి గా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి

మేషరాశి, అశ్వని నక్షత్రం (1 వ పాదం)

బ్రహ్మపురి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొండూరి విశ్వేశ్వర శర్మ, సెల్ నెం. 91105 07705, 97045 28300




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 17 kms. దూరాన, పావన గౌతమీ నదీ (గోదావరి) తీరాన బ్రహ్మపురి (Brahmapuri) అను గ్రామం ఉంది. క్షేత్రం నందు శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి ఆలయం కలదు.

**ఆలయం:** శ్రీ విశ్వేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాల్లో ఒకటిగా ప్రతీతి. శ్రీ విశ్వేశ్వరాలయం నందలి శివలింగము స్వత సిద్ధంగా మూడు విభూతి రేఖలను మరియు మూడవ కన్నును కలిగియుండుట విశేషం. శ్రీ విశ్వేశ్వర లింగమును అర్చించిన వారికి సకల శుభములు కలుగును అని భక్తుల విశ్వాసం. ఆలయ ప్రాంగణములో శ్రీ విశ్వేశ్వరాలయం మరియు శ్రీ కేశవ స్వామి ఆలయం ఉంటాయి. శ్రీ విశ్వేశ్వర ఆలయముకు గాలి గోపురం, ధ్వజస్తంభం, ముఖ మండపం, అంతరాలయం,గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ విశ్వేశ్వర లింగము దర్శనమిస్తుంది. అంతరాలయం నందు గణపతి, సుబ్రహ్మణ్యడు, వీరభద్రుడు, అన్నపూర్ణా దేవి కొలువై ఉంటారు. ప్రతి నిత్యం శ్రీ విశ్వేశ్వర స్వామికి అర్చనలు, అభిషేకాలు, నిర్వహించుతారు. అశ్వని నక్షత్రం (1 వ పాదం) నందు జన్మించిన శిశువకు అభిషేకాలు నిర్వహించుతారు. యాత్రికులు ముందుగా అర్చక స్వామిని సంప్రదించగలరు. మన పురాణం ప్రకారం బ్రహ్మకు అయిదు తలలు ఉండేవి. పూర్ణవల్లీ కథలో బ్రహ్మదేవుని ఐదవ తలను శివుడు ఖండించినట్లుగా ఉంది. ఒక రోజు బ్రహ్మదేవుడు, శివ రూపంలో కైలాసాన్ని సందర్శించడం జరిగింది. ఆ శివ రూపానికి పార్వతీ దేవి పాద పూజ చేయనారంభించింది. బ్రహ్మ కపటం రూపం గ్రహించిన శివుడు, బ్రహ్మ తలను ఖండించుతాడు. ఆ చర్య వలన శివునికి బ్రహ్మ హత్యాపాతకం ప్రాప్తి అయింది. బ్రహ్మ పుర్రె పట్టుకొని శివుడు పన్నెండు సంవత్సరాల పాటు బిక్షాటన చేసాడు. బ్రహ్మ హత్యాపాతకం నుంచి విముక్తి పొందుటకు శివుడు సకల పుణ్య తీర్ధాలలో స్నానం ఆచారించాడు. గౌతమీ నదీ పుణ్య ఫలంతో బ్రహ్మ హత్యాపాతకం నుంచి శివునికి విముక్తి కలిగింది. శివుని చేతిలోని బ్రహ్మ పుర్రె నదిలోకి జారింది. ఆ కారణముగా ఈ గౌతమీ నది తీర ప్రాంతమునకు "బ్రహ్మపుర్రె" అనే పేరు వచ్చింది. కాలక్రమేన పేరు మార్పుచెంది, బ్రహ్మపురిగా స్థిర పడింది.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు సుమారు 21 kms. దూరాన యానాం అను పట్టణం ఉంది. రాజమండ్రి నుంచి యానాం పోవు బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కోలంక, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. కోలంక మరియు ఇంజరం నుంచి బ్రహ్మపురి గ్రామం నకు రోడ్డు మార్గములున్నాయి. యానాం నుంచి బ్రహ్మపురి గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 8 kms. యానాం బైపాస్ రోడ్ (Sri Ravi Junior & Degree College, Near Yanam Bi Pass road, Sunkarapalem, Andhra Pradesh) నుంచి బ్రహ్మపురి గ్రామం నకు గోదావరి గట్టు మీదగా ఆటోలు ఉంటాయి. ఆటో రాను - పోను ఏర్పాట్లు చేసుకోవాలి.

* బ్రహ్మపురి గ్రామం నకు బస్ సర్వీసులు ద్రాక్షారామం నుంచి ఉంటయి. బస్సులు పరిమితంగా ఉంటాయి.

శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత శ్రీ భవానీ శంకర స్వామి

మేషరాశి, అశ్వని నక్షత్రం (2 వ పాదం)

ఉప్పుమిల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ చంద్రమౌళి వెంకట చంద్రశేఖర శర్మ సెల్ నెం. 96523 21135




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 10 kms. దూరాన, ఉప్పుమిల్లి (Uppumilli) గ్రామం కలదు. ఉప్పుమిల్లి బస్ స్టాప్ కు సుమారు 750 మీటర్లు లోపలకి శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత శ్రీ భవానీ శంకర స్వామి ఆలయం ఉంది. బస్ స్టాప్ నుంచి ఆలయం కు రవాణా సౌకర్యములు చాల తక్కువుగా ఉంటాయి.

**ఆలయం:** గౌతమీ నది (గోదావరి) తీరములో అనేక పుణ్య క్షేత్రాలు వెలిసాయి. వీటిలో ఉప్పుమిల్లి క్షేత్రం ఒకటి. అత్రి నది తీరములో శ్రీ భవానీ శంకర ఆలయం కలదు. భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. అత్రి మహాముని తీసుకు వచ్చిన నదిని "ఆత్రేయ గోదావరి" గా పిలుస్తారు. అత్రి పాయ (కాలువ) ప్రవాహం కోరింగి గ్రామం దాటిన తర్వాత సాగరములో (లవణ సముద్రం) కలుస్తుంది. అత్రి కాలువను "బ్యాక్ వాటర్ కాలువ" అని కూడ పిలుస్తారు. లవణ సముద్రం ఆటు పోటులను బట్టి బ్యాక్ వాటర్ నీరు ఉప్పుగా మారుతుంది. అత్రి కాలువ (టేకి డ్రైన్ రివర్) ఒడ్డున ఉప్పుమిల్లి గ్రామం ఉంటుంది. లవణ సముద్రం కాలువ తీరములో ఉన్న కారణంగా ఈ గ్రామమునకు ఉప్పుమిల్లి అనే పేరువచ్చింది.

పూర్వం ఈ ప్రాంతమంతా మహారణ్యం. త్రేతాయగములో శ్రీ రామచంద్రుడు అరణ్యవాసం సందర్భముగా సీతా లక్ష్మణుల సమేతంగా కొంత కాలము నివాసాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఇక్కడ ఒక శివలింగాన్ని ప్రతిష్టించి నిత్యం ఆరాధించేవాడు. భక్త శంకరుడయిన పరమేశ్వర లింగాన్ని భక్తులు, ఋషులు, తపోనిష్టలు, శివరాధకులు కొలచేవారు. వీరిలో భవానీ అను ఒక మహాభక్తురాలు నిత్యమూ శంకరుడును స్మరిస్తూ జీవితం గడిపేది. ఆమె వృద్ధాప్యములో శివదర్శనం కోసం తపించేది. ఒక రోజున జగన్మాత బాలా త్రిపురసుందరీ దేవి, ఒక బాలిక రూపములో భవాని వద్దకు వచ్చి, భక్తురాల అభిష్టం గ్రహించింది. ఆమె కోరికను మన్నించి, శంకరుని సమేతంగా బాలా త్రిపురసుందరీ దేవి దర్శనమిచ్చి, మోక్షం ప్రసాదించింది. ఆ భక్తురుల అభిష్టం మేరకు స్వామి శ్రీ బాలా త్రిపురసుందరీ దేవి సమేత భవానీ శంకరుడు గా ఖ్యాతి పొందినాడు. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయంతో పాటు నవగ్రహ మండపం, శ్రీ లక్ష్మీనారాయణ సన్నిధి మొదలగునవి కలవు. ఆలయం నందు ఒక నియమం ఉంది. గర్భాలయం నందలి శ్రీ బాలా త్రిపురసుందరీ దేవి సమేత భవానీ శంకర స్వామి దర్శించిన పిమ్మట శ్రీ నందీశ్వరుని దర్శించుకోవాలి. భవానీ శంకర స్వామి కృపతో సుఖ, సంతోష, ఆయురోగ్య, విజయ, ఐశ్వర్య, భోగ భాగ్యములు కలుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, కుయ్యేరు, ఉప్పుమిల్లి బస్ స్టాప్, కోలంక, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

*ఉప్పుమిల్లి బస్ స్టాప్ వద్ద వినాయక ఆలయం ఉంటుంది. గుడి ప్రక్క నుంచి ఉప్పుమిల్లి గ్రామం నకు రోడ్డు మార్గం కలదు.

శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి

మేషరాశి, అశ్వని నక్షత్రం (3 వ పాదం)

కుయ్యేరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ దొంతికుర్తి రామకృష్ణ శర్మ, సెల్ నెం. 99494 22425



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 9 kms. దూరాన, కుయ్యేరు గ్రామం (Kuyyeru) గ్రామం కలదు. కుయ్యేరు బస్ స్టాప్ కు సుమారు 200 మీటర్లు లోపలకి శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** త్రేతాయుగం నందు శ్రీ రామచంద్రమూర్తి అరణ్యవాసం నందు ఒక కుటీరం నిర్మించుకుని, సీతా లక్ష్మణుల సమేతంగా కొంత కాలము నివాసాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఆ సమయంలో రావణ బ్రహ్మ, సీతాదేవిని అపహరించుటకు మారిచుడు అను రాక్షవీరుడును పంపుతాడు. ఆ మారిచుడు ఒక బంగారు లేడి రూపాంలో సీతాదేవి కంటిచూపులో పడ్డాడు. సీతాదేవి ఆశ పడి శ్రీ రాముడుని కోరుతుంది. భార్య కోరికను మన్నించిన శ్రీ రాముడు బంగారు లేడి కోసం బయిలుదేరుతాడు. బంగారు లేడి (మారిచుడు) తన వెంట రాముడు అనుసరింప జేయుటకు, ఒక ప్రదేశములో కుయో! అని శబ్దం చేయడం జరిగింది. నాటి నుంచి ఆ ప్రదేశము "కుయో" గా పిలువబడేది. కాలక్రమేన ఆ ప్రదేశము "కుయ్యేరు" గా మార్పుచెందింది అని స్థల పురాణం చెప్పుతుంది. కుయ్యేరు గ్రామం లోని శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత శ్రీ మల్లేశ్వరాలయం చాల ప్రాచీనమైనది. ఆలయం క్రమ క్రమంగా జీర్ణమైనది. గ్రామస్థుల సహాకారముతో పునః నిర్మాణం జరిగింది. కాశీ క్షేత్రం నుంచి తెచ్చిన ఒక శివలింగమును ప్రతిష్టించారు. ఆలయ ప్రాంగణములో బలి పీఠం, ధ్వజ స్థంబం, ముఖ మండపం, ద్వారపాలకులు, నంది, చండీశ్వరుడు, మహా గణపతి, శ్రీ బాలా త్రిపుర సుందరీ దేవి, శ్రీ వల్లిదేవాసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి, నవగ్రహాలు మొదలగు మూర్తులు దర్శనమిస్తాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, కుయ్యేరు బస్ స్టాప్, ఉప్పుమిల్లి , కోలంక, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నుంచి కుయ్యేరు కు ఆటోలు కూడ దొరుకుతాయి.

* కుయ్యేరు బస్ స్టాప్ కు సుమారు 200 మీటర్లు లోపలకి శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం ఉంది.



శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వరస్వామి

మేషరాశి, అశ్వని నక్షత్రం (4 వ పాదం)

దుగ్గుదూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పూజ్యం నాగేశ్వర శర్మ, సెల్ నెం. 9949290986



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 12 kms. దూరాన, దుగ్గుదుర్రు (Dugguduru) గ్రామం కలదు. కుయ్యేరు - గొల్లపాలెం బ్రాంచి రోడ్డు మార్గంలో దుగ్గుదూరు జంక్షన్ కలదు. జంక్షన్ కు కొంత లోపలకి దుగ్గుదూరు గ్రామం ఉంటుంది. దుగ్గుదూరు గ్రామం నందు శ్రీ వేణుగోపాల స్వామి (వైష్ణావాలయం) మరియు శ్రీ మల్లేశ్వర స్వామి (శివాలయం) ఒకే ప్రాంతములో ఉంటాయి. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** పూర్వం నుంచి దుగ్గుదూరు గ్రామం పాలు ఉత్పత్తికి కేంద్రం. అప్పుడు దుగ్గుదూరు గ్రామమును " దుగ్ధలూరు" గా పిలిచేవారు. దుగ్ధ అనగా పాలు అని అర్ధం. ఆ కారణముగా గ్రామం దుగ్ధలూరు గా ప్రసిద్ధి చెందింది. ఇది కాలక్రమేన దుగ్గుదూరు గా మారింది. మండల కేంద్రమైన కాజులూరు బస్ స్టాపుకు నైఋతి దిశగా సుమారు మూడు Kms. దూరంలో దుగ్గుదూరు గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి ఆలయం కలదు. ప్రాచీన ఆలయం శిథిలం కావడంతో నూతనముగా పునర్నిర్మాణము చేసారు. విశాలమైన ప్రాంగణములో శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం ధ్వజ స్థంభం, ముఖ మండపం, అంతరాళయం, గర్భాలయంతో బహు సుందరముగా ఉంటుంది. ముఖ మండపంలో దేవేరి పార్వతీ దేవికి సన్నిధి కలదు. కామ్య గణపతి సర్వ సిద్ధిదాయకుడుగా కీర్తీ గావించాడు. గర్భాలయం నందలి శ్రీ మల్లేశ్వర లింగము స్వతగుణ స్వరాపుడు. స్వామిని సేవించిన వారికి భోగ భాగ్యములు ప్రసాదించుతాడు. ఆలయ అర్చక స్వామి బ్రహ్మశ్రీ నాగేశ్వర శర్మగారు శైవాగమ పద్ధతిలో అర్చనలు, ఉపచారాలు, శాంతులు మొదలగునవి జరుపించుతారు. చుట్టు ప్రక్కల గ్రామాలలో ఆలయ ప్రతిష్టలు, యజ్ఞాలు, పూజలు మొదలగునవి నిర్వహించుచుంటారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు సుమారు 9 kms. దూరాన కుయ్యేరు బస్ స్టాప్ ఉంది. ద్రాక్షారామం - యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, కుయ్యేరు బస్ స్టాప్, ఉప్పుమిల్లి , కోలంక, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కుయ్యేరు నుంచి దుగ్గుదూరు, కాజులూరు మీదగా గొల్లపాలెం నకు రోడ్డు మార్గం & ఆటోలు ఉంటాయి. కుయ్యేరు బస్ స్టాప్ - దుగ్గుదుర్రు మధ్య దూరం సుమారు 4 Kms గా ఉంటుంది. దుగ్గుదూరు గ్రామంలో శ్రీ పార్వతి సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం ను దర్శించగలము. దుగ్గుదూరు జంక్షన్ నుంచి దుగ్గుదుర్రు శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయ దూరం సుమారు 400 meters.



శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి

మేషరాశి, భరణి నక్షత్రం (1 వ పాదం)

కోలంక గ్రామం, కాజులూరు మండలం

అష్ట సోమేశ్వరాలయాలు (తూర్పు క్షేత్రం)

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక వీరవెంకట సుబ్రహ్మణ్య శర్మ సెల్ నెం.9959459663 & 9100864659




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి తూర్పు - ఆగ్నేయం దిశగా, సుమారు 13 kms. దూరాన, కోలంక (Kolanka) గ్రామం కలదు. కోలంక బస్ స్టాప్ కు నైఋతి దిశగా, సుమారు 600 మీటర్లు దూరంలో ( కోలంక - పెదలంక రోడ్డు) శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. కోలంక బస్ స్టాప్ నుంచి ఆలయం కు ఆటోలు చాల తక్కువుగా ఉంటాయి. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** దక్షిణ కాశీగా పిలువబడే ద్రాక్షారామ క్షేత్రం నందలి శ్రీ భీమేశ్వర లింగము సూర్య ప్రతిష్ఠ. ఆ రుద్రమూర్తిని శాంతపరచేందుకు ద్రాక్షారామ క్షేత్రం చుట్టూ ఎనిమిది సోమేశ్వర ఆలయాలను చంద్రుడు ప్రతిష్ఠించాడు. చంద్రుడిని సోముడు అని పిలుస్తారు. సోముడు ప్రతిష్ఠించిన శివాలయాలను అష్టసోమేశ్వరాలయాలు అంటారు. ఇవి ద్రాక్షారామం పరిసరాల్లోనే ఉంటాయి. ద్రాక్షారామ క్షేత్రం నకు తూర్పు - ఆగ్నేయ దిశలో కోలంక గ్రామం ఉంది. ఇచ్చట శ్రీ సోమేశ్వరాలయం దర్శించగలము.

కోలంక గ్రామంలో శ్రీ సోమేశ్వరాలయం మరియు శ్రీ కేశవ స్వామి ఆలయం ఒకే ప్రాంగణములో ఉంటాయి. శివకేశవులకు మూడు అంతస్థుల గాలిగోపురం కలదు. గాలిగోపురం క్రింద నుంచి ఆలయ ప్రవేశం జరుగుతుంది. రెండు ఆలయాలకు ముఖ మండపం విశాలముగా ఒకటి గానే ఉంటుంది. ధ్వజస్థంభాలు వేరు వేరుగా ఉంటాయి. అంతరాళయం, గర్భాలయం కూడ వేరు వేరుగా ఉంటాయి. గర్భాలయం కు ముందు భాగంలో గణపతి, నంది, నవగ్రహాలు ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ సోమేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామికి ఎడమ భాగంలో శ్రీ ఉమాదేవి కొలువుదీరింది. శ్రీ ఉమా సమేత సోమేశ్వర లింగమును అర్చించిన వారికి సకల శుభములు కలుగును అని భక్తుల విశ్వాసం.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు సుమారు 13 kms. దూరాన కోలంక బస్ స్టాప్ ఉంది. ద్రాక్షారామం - యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, కుయ్యేరు, ఉప్పుమిల్లి , కోలంక, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కోలంక బస్ స్టాప్ కు నైఋతి దిశగా, సుమారు 600 Mtrs. దూరంలో సోమేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. కోలంక బస్ స్టాప్ నుంచి ఆటోలు చాల తక్కువుగా ఉంటాయి.



శ్రీ ఉమాదేవి సమేత శ్రీ కృపేశ్వర స్వామి

మేషరాశి, భరణి నక్షత్రం (2 వ పాదం)

ఇంజరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కందుకూరి వెంకట సూర్య సుబ్బారావు, సెల్ నెం. 99129 77166




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 15 kms. దూరాన, ఇంజరం (Injaram) గ్రామం కలదు. ఇచ్చట శివాలయం వీధిలో శ్రీ ఉమా సమేత శ్రీ కృపేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. శ్రీ ఉమాకృపేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైది. కాల క్రమములో గ్రామస్తులు, స్థానిక తెలుగు పండితల సహాయంతో శివాలయం పునర్నార్మించారు. శివాలయం నందు పాత శివలింగాన్ని పునః ప్రతిష్ట చేసారు. ఆ శివలింగాన్ని శ్రీ కృపేశ్వర లింగముగా కొలుస్తారు. స్వామికి ఎడమ భాగములో శ్రీ ఉమాదేవి కొలువుదీరింది. శివాలయం నందు గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, చండీశ్వరుడు, నాగ బంధం మొదలగునవి దర్శించగలము. ఆలయ ప్రాంగణములో నవగ్రహ మండపం, రామ పంచాయతన మందిరం, ఆంజనేయ స్వామి దర్శనమిస్తారు. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం జ్యేష్టా శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. సంక్రాంతి, దీపావళీ మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా ఉంటాయి. ప్రాచీన ఆలయంను 17 వ శతాబ్దం నాటి అక్కన్న, మాదన్నలు నిర్మించినట్లుగా చెప్పుచుంటారు. వీరు గోల్కొండ సంస్థానం నకు చెందిన తానీషా చక్రవర్తి పాలనలో మంత్రులుగా పనిచేసిన అన్నదమ్ములు. శివాలయం కు దక్షిణ దిశగా సుమారు 01 Km. దూరంలో గోదావరి నది ప్రవాహం ఉంటుంది. బ్రిటీషు పాలనలో ఇంజరం వాణిజ్యకేంద్రంగా అభివృద్ధి చెందింది. 1708 లో బ్రిటీషువారు ఇంజరంలో ఒక ఫ్యాక్టరీని నెలకొల్పారు. ఇంజరంలో దేశంలోనే నాణ్యమైన బట్టలను నేసేవారు. 1827 లో ఫ్యాక్టరీ మూతపడింది. ఆ తరువాత ఇంజరం వాణిజ్య కేంద్రంగా ప్రాముఖ్యత కోల్పోయింది. ఇంజరం పండితులకు నిలయం. ఓలేటి సూర్యనారాయణ శాస్త్రి గారు, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు ముఖ్యులు. ఇంజరం జమీందారు నందికోళ్ల గోపాలరావు గారు గొప్ప చిత్రకారుడు. వీరు గ్రామం లోని ఆలయాలకు ఆర్ధిక సహాయం అందిచేవారు. పూర్వం ఇంజరం గ్రామానికి అనేక వరదలు, ఉప్పెనలు వచ్చు చుండేవి. ఆ కారణంగా ఇంజరం రెండుగా విడిపోయింది. గోదావరి గట్టుకు ఉత్తరం భాగం నందు ఇంజరం మరియు దక్షిణ గట్టున పాత ఇంజరం ఉంటుంది.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం - యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, కుయ్యేరు, ఉప్పుమిల్లి , కోలంక, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* ఇంజరం Bank Centre (శివాలయం బస్ స్టాప్) లేదా ఇంజరం బస్ స్టాండ్ కు సుమారు 200 Mtrs. దూరంలో శ్రీ ఉమాకృపేశ్వర స్వామి ఆలయం ఉంటుంది.

శ్రీ గంగా పార్వతీ సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి

మేషరాశి, భరణి నక్షత్రం (3 వ పాదం)

పల్లిపాలెం గ్రామం, కాజులూరు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక వీరభద్ర ప్రసాద్ సెల్ నెం. 98497 54014




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 18 kms. దూరాన పల్లిపాలెం (Pallipalem) గ్రామం ఉంది. ఇచ్చట శ్రీ గంగా పార్వతీ సమేత శ్రీ వ్యాసేశ్వర స్వామి ఆలయం కలదు. పల్లిపాలెం పోస్ట్ ఆఫీస్ కు సమీపంలో శ్రీ గంగా పార్వతీ సమేత శ్రీ వ్యాసేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. శ్రీ వ్యాసేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** అత్రి మహాముని తీసుకు వచ్చిన నదిని 'ఆత్రేయ గోదావరి' గా పిలుస్తారు. ఆత్రేయ గోదావరికి దక్షిణ తీరములో పల్లిపాలెం గ్రామం ఉంది. ఇది కాజులూరు మండలం పరిధి లోనికి వస్తుంది. పల్లిపాలెం గ్రామం నందు శ్రీ గంగా పార్వతీ సమేత శ్రీ వ్యాసేశ్వర స్వామి ఆలయం దర్శించగలము. ఆలయం ప్రాచీనమైనది. కొంత మంది దాతల సహకారం తో ఆలయం నందు ముఖమండపం, కళ్యాణ మండపం మొదలగు అభివృది నిర్మాణాలు జరిగినాయి. గర్భాలయం నందు ఆది దంపతులు దర్శనమిస్తారు. అంతరాలయం నందు గణపతి, సుబ్రహ్మణ్య స్వామి కలరు. చండ - ప్రచండ ద్వారపాలకులు, చండీశ్వరుడు, నాగ బంధం, నవగ్రహ మండపం, ఆంజనేయ స్వామి, దత్తాత్రేయుడు మొదలగు మూర్తులు కొలువై ఉన్నారు. ఆలయం నకు ఉత్తరముగా అత్రి నది, ఈశాన్యంగా పుష్కరిణి, దక్షిణం దిశలో ఔదుంబర వృక్షం ఉంటాయి. శ్రీ వ్యాసేశ్వర స్వామిని సేవించిన వారికి సంతాన ఫలం కలుగును అని గట్టి విశ్వాసం భక్తులలో ఉంది. శ్రీ గంగా పార్వతీ సమేత శ్రీ వ్యాసేశ్వర స్వామి కళ్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఔదుంబర వృక్షం (మేడి చెట్టు) భూలోక కల్పవృక్షము. ఇది గురు దత్తాత్రేయులవారికి అత్యంత ప్రీతికరమైన వృక్షం. దత్తాత్రేయుల వారు ఎల్లప్పుడు సుక్ష్మరూపంలో సుప్రతిష్ఠితులై ఈవృక్ష మూలమునందు సర్వదా ఉంటారని పైంగ్య బ్రాహ్మణము నందు వివరించబడినది. శ్రీపాదుల వారి సందేశ ప్రకారం ఔదుంబర వృక్షం నుండి ప్రాణశక్తి వెలువడును. ఔదుంబర మూలమున చేసిన జపఫలము కోటి రెట్లవుతుంది. గొడ్రాళ్ళను కూడా సంతాన వంతులను చేసే మహత్తుగల వృక్షమిది. మహావిష్ణువు అంశగా ఆషాఢ పౌర్ణమినాడు జన్మించి సకల కళానిధియై వేదములను విభజించిన విద్యావేత్త సద్గురువు వేదవ్యాసుడు. వేదవ్యాసుడు మేరునగముపై శివుని గూర్చి తపస్సు చేసి రాగాతీతుడైన పుత్రుని పొందాడు. అతడే శుకమహర్షి. వ్యాసుడు కాశీ పురములో నివసించు చున్నప్పుడు ఒకసారి కాశీలో ఏ ఇంట నుంచి భిక్ష లభించక పోవుటచే, వ్యాసుడు కాశీను శపించబోగా అన్నపూర్ణా దేవి అడుపడి, అతని కుద్బాధ(ఆకాలి) తీర్చి, కాశీ బహిష్కరణ గావించింది. శివుని ఆదేశముతో దక్షిణ కాశి అయిన ద్రాక్షారామ క్షేత్రం చేరుకొంటాడు. అగస్త్యుడు సలహ అనుసరించి ద్రాక్షారామ పరిసర ప్రాంతములను సందర్శించి, పలు చోట్ల శివలింగాలు ప్రతిష్టించాడు.

**రవాణా సమాచారం:** రాజమండ్రి - యానాం బస్సులు (Via) ద్రాక్షారామం, కుయ్యేరు, పల్లిపాలెం బస్ స్టాప్, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కాకినాడ - పల్లిపాలెం బస్సు (Via) గొల్లపాలెం, కాజులూరు మీదగా ఉండేది. ప్రస్తుతం పల్లిపాలెం బస్ సర్వీసు రద్దు చేసారు.

* కాకినాడ నుంచి యానాం కు బస్సులు (Via) తాళ్ళరేవు, నీలపల్లి మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* యానాం బైపాస్ రోడ్ (Sri Ravi Junior & Degree College, Near Yanam Bi Pass Sunkarapalem, Andhra Pradesh) నుంచి పల్లిపాలెం గ్రామం నకు ఎక్కువుగా ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 5 kms. వీటిని (ఆటో) రాను - పోను ఏర్పాట్లు చేసుకోవాలి. ఇది సౌక్యముగా ఉంటుంది.





## శ్రీ పార్వతీ సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి

## మేషరాశి, భరణి నక్షత్రం (4 వ పాదం)

## ఉప్పంగల గ్రామం, తాళ్ళరేవు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొండూరి పార్వతీశ్వర రావు సెల్ నెం. 9247889345




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 17 Kms. దూరన ఉప్పంగల (Uppangala ) గ్రామం ఉంటుంది. ఉప్పంగల గ్రామం నుంచి కాపులపాలెం వైపు పోవు రోడ్డు మార్గములో శ్రీ పార్వతీ సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** పల్లిపాలెం గ్రామం నకు ఆగ్నేయం దిశగా సుమారు రెండు Kms. దూరంలో ఉప్పంగల గ్రామం ఉంది. ఇది శ్రీ రామచంద్రుడు నడయాడిన ప్రదేశంగా ప్రతీతి. త్రేతాయగములో శ్రీరాముడు అరణ్యవాసం సందర్భముగా కొన్ని సంవత్సరాలు దండకారణ్యంలో గడిపాడు. గోదావరి నది పరిసర ప్రాంతంలో సీతా లక్ష్మణుల సమేతంగా కొంత కాలము రామచంద్రుడు నివాసాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఒకనాడు రావణ బ్రహ్మ సహోదరి అయిన శూర్పణఖ రాముణ్ని చూసి ఇష్టపడింది. ఆ శూర్పణఖ పెళ్లి చేసుకోమనీ రాముడుని అడుగుతుంది. అప్పుడు రాముడు ఆమెను లక్ష్మణుడు వద్దకు పంపుతాడు. లక్ష్మణుడు కత్తితో శూర్పణఖ చెవులూ, ముక్కూ కోస్తాడు. ఆ చుప్పనాతి (శూర్పణఖ) శరీర అంగములు పడిన ప్రాంతము " చుప్పంగల " అనె పేరుతో పిలువబడింది. కాలక్రమేణా చుప్పంగల ప్రాంతము " ఉప్పంగల " గా మారింది. లక్ష్మణుడు వినియోగించిన కత్తిని, సమీపంలో గల చెరువులో కడిగినాడు. ఇప్పటికి ఆ చెరువు నీరు కొద్దిగా ఎర్రజీరతో కనిపిస్తుంది. శ్రీరాముడు దండకారణ్యంలో పాదచారై సంచరించు సమయంలో స్థానిక చెరువులో సంధ్యావందనం గావించి, ఒక సైకత లింగ ప్రతిష్ట గావించినట్లు స్థల పురాణం చెప్పుతుంది.

ఆలయ ప్రాంగణం విశాలముగా ఉంటుంది. ప్రవేశ ద్వారం దాటగానే ధ్వజస్తంభం, ముఖ మండపం, ద్వారపాలకులు, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ రామలింగేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామికి ఎడమ భాగమున పార్వతీ దేవి కొలువై ఉన్నాది. స్వామి వారికి నిత్య అభిషేకాలు, అర్చనలుతో పాటు నక్షత్ర దోషములకు అభిషేక శాంతులు నిర్వహించుతారు. అంతరాలయం నందు గణపతి, సుబ్రహ్మణ్య స్వామి, పార్వతీ దేవి విగ్రహములున్నాయి. నంది మండపం నందలి నంది విగ్రహమును చర (తిప్పుడు) నంది అని సంభోదించుతారు. గ్రామము లోని స్త్రీలు ప్రసవ సమయములో బిడ్డ అడ్డం తిరిగి, కాన్పు కష్టమయినప్పుడు ఆమె భర్త ఆలయం నందలి చర నందిని తన ఇంటి ముఖంగా తిప్పుతాడు. చర (తిప్పుడు) నంది చల్లని చూపుతో అతని భార్యకు సుఖ ప్రసవం జరుగుతుంది అని నమ్మకం.

**రవాణా సమాచారం:** రాజమండ్రి - యానాం బస్సులు (Via) ద్రాక్షారామం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* ఇంజరం Union bank (Andhra Bank) కు ఈశాన్యం దిశగా సుమారు 3 kms. దూరాన ఉప్పంగల గ్రామం ఉంటుంది.

* కాకినాడ నుంచి యానాం కు బస్సులు (Via) తాళ్ళరేవు, నీలపల్లి మీదగా ప్రతి గంటకు ఉంటాయి. యానాం పట్టణంలో యాత్రికులకు మంచి వసతులు దొరుకుతాయి. యానాం పాండిచ్చేరి కేంద్ర పాలిత ప్రాంతము లోనికి వస్తుంది. యానాం బస్ స్టాండ్ నుంచి యానాం బైపాస్ రోడ్ కు ఆటోలు ఉంటాయి.

* యానాం బైపాస్ రోడ్ (Sri Ravi Junior & Degree College, Near Yanam Bi Pass Sunkarapalem, Andhra Pradesh) నుంచి ఉప్పంగల గ్రామం నకు ఆటోలు ఎక్కువుగా దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 2 kms. వీటిని (ఆటో) రాను - పోను ఏర్పాట్లు చేసుకోవాలి. ఇది సౌక్యముగా ఉంటుంది.

మాకు సహకరించిన ఉప్పంగల అర్చక స్వామి అయిన శ్రీ కొండూరి పార్వతీశ్వర రావు, సెల్ నెం. 9247889345 గార్కి నా నమసుమాంజలి.





## శ్రీ మీనాక్షీదేవి సమేత శ్రీ నీలకంఠేశ్వర స్వామి

## మేషరాశి, కృత్తిక నక్షత్రం (1 వ పాదం)

## నీలపల్లి గ్రామం, తాళ్ళరేవు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కంఠం భీమేశ్వర రావు సెల్ నెం. 8885368933 & శ్రీ కంఠం సత్యనారాయణ సెల్: 96187 41362




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 21 kms. దూరాన యానాం అను పట్టణం కలదు. యానాం కు ఈశాన్యం దిశగా, సుమారు రెండు kms. దూరంలో నీలపల్లి గ్రామం ఉంటుంది. నీలపల్లి ఊరులో శ్రీ మీనాక్షీ దేవి సమేత శ్రీ నీలకంఠేశ్వర స్వామి ఆలయం కలదు. శ్రీ నీలకంఠేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ నీలకంఠేశ్వర స్వామి పాత ఆలయం 15 వ శతాబ్దం నాటిది. పాత ఆలయం శిథిలమవటంతో, నూతన ఆలయం బహు సుందరంగా నిర్మించారు. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ప్రధానాలయం నకు తూర్పు వైపున నంది మండపం, ధ్వజస్తంభం ఉంటాయి. విశాలమైన ముఖ మండపం నందు శ్రీ మీనాక్షి అమ్మ వారి సన్నిధి దక్షిణాభి ముఖంగా నిర్మాణం జరిగింది. శ్రీ నీలకంఠేశ్వర స్వామి కోసం అంతరాలయం, గర్భాలయం తూర్పు అభిముఖంగా నిర్మాణం చేసారు. ఆలయ ప్రాంగణములో ఈశాన్యం మూల నవగ్రహమండపం, ఆగ్నేయం నందు అయ్యప్ప సన్నిధి, నైఋతి ప్రక్కన గణపతి సన్నిధి మరియు వాయువ్యం వైపున శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి వారి సన్నిధి ఉంటాయి. ఉత్తరం వైపున చండీశ్వర స్వామి సన్నిధి ఉంటుంది. నీలకంఠేశ్వర స్వామికి నిత్య పూజలతో పాటు మాఘ శుద్ధ ఏకాదశికి కళ్యాణం జరుగుతుంది. శివరాత్రి, కార్తీక మాసంలో విశేష పూజలు నిర్వహించితారు. గణపతి నవరాత్రులు, దేవి నవరాత్రులు వైభవంగా జరుగుతాయి. FR నీలపల్లి (Neelapalli) గ్రామం నకు నైఋతి దిశగా, సుమారు రెండు Kms. దూరం లో యానాం అను పట్టణం కలదు. ఇది పాండిచ్చేరి కేంద్రపాలిత ప్రాంతం పరిధి లోనికి వస్తుంది. యానాం ప్రధాన కేంద్రం పాండిచ్చేరి. పూర్వం పాండిచేరి (Pandichery) అని పిలిచేవారు. తమిళనాడు రాష్ట్రం లోని పాండిచ్చేరి (Puducherry), కరైకళ్ (Karaikal) మరియు ఆంధ్రప్రదేశ్ లోని యానాం (Yanam) కలసి పుదుచ్చేరి భారత కేంద్ర భూభాగంగా (Indian Union Territory) పిలుస్తారు. యానాం ప్రాంతము 1954 లో ఫ్రాన్స్ నుండి భారతదేశానికి ఇవ్వబడినా ఫ్రెంచి యానాం గా గుర్తింపు ఉంది. యానాం ప్రాంతము 1723 లో ఫ్రెంచి పాలనలోకి వెళ్ళింది. మొగలు సామ్రాజ్యాధిపతులు వద్ద నుండి ఫ్రెంచి వారు ఒక ఫర్మానా అధికారాన్ని పొందారు. ఫ్రెంచి వారు తమ అంగీకారమును ఇనాంల రూపంలో తెలిపారు. ఆ ఇనాం కాస్తా ఫ్రెంచివారి చేతులలో యానాంగా మారిపోయింది. యానాం ప్రాంతముకు ఉత్తర దిశగా నీలపల్లి గ్రామం ఉంది. భారత స్వాతంత్ర్యం ముందు నీలపల్లి గ్రామం ఆంగ్లేయుల పాలనలో ఉండేది. 18 వ శతాబ్దంలో అడపాదడపా ఆంగ్లేయుల పాలనలోకి యానాం ప్రాంతము వెళ్ళేది. 1750 లో హైదరాబాదు నిజాము నవాబు ముసాఫర్ జంగ్, ఫ్రెంచి వారి వాదనలను అంగీకరిస్తూ ఆంగ్లేయుల ఈ ప్రదేశమును (యానాం) ఫ్రెంచి వారికి అప్పగించారు. అప్పటి నుంచి 1954 వరకు ఫ్రెంచి వారి ఆధీనంలో యానాం ప్రాంతము ఉండేది. భారత స్వాతంత్ర్యం తరువాత నీలపల్లి గ్రామం ఆంధ్రప్రదేశ్ లోని ఒక భాగం అయింది. పాండిచ్చేరి కేంద్రపాలిత ప్రాంతం అయిన యానాం ప్రాంతము కు మూడు దిక్కుల యందు ఆంధ్రప్రదేశ్ భూభాగం మరియు తూర్పు దిక్కున బంగాళాఖాతం ఉంటుంది. యానాం ప్రాంతములో నివసించే జనాభాలో చాలామంది తెలుగు మాట్లాడతారు. Google Map లో నీలపల్లి గ్రామంను పాండిచ్చేరి భూభాగంగా చూపుతోంది.

**రవాణా సమాచారం:** రాజమండ్రి - యానాం బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* యానాం బస్ స్టాండ్ నుంచి నీలపల్లి శివాలయం కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 2 Kms. గా ఉంటుంది.

* యానాం బస్ స్టాండ్ నుంచి యానాం - కాకినాడ (పల్లె వెలుగు) బస్ సర్వీసులు నీలపల్లి మీదగా ఉంటాయి. నీలపల్లి బస్ స్టాప్ స్టాప్ (Jammi Chettu Center Stop) నుంచి శ్రీ నీలకంఠేశ్వరాలయంకు ఆటో లేదా నడక ద్వార చేరగలము. వీటి మధ్య దూరం కేవలం 850 meters మాత్రమే.

* యానాం పట్టణంలో మంచి వసతులు దొరుకుతాయి. యానాం పాండిచ్చేరి కేంద్ర పాలిత ప్రాంతము. నీలపల్లి - యానాం మధ్య దూరం సుమారు 2 Kms. గా ఉంటుంది.

మాకు సహకరించిన నీలపల్లి అర్చక స్వామి శ్రీ కంఠం భీమేశ్వర రావు, సెల్ నెం. 8885368933 గార్కి నా నమసుమాంజలి.








వృషభరాశి రాశులలో ఇది రెండవది.

సూర్యుడు వృషభం సంచరించే కాలం **వృషభరాశి** గా వ్యవహరిస్తారు.

వృషభం అనగా ఎద్దు.

వృషభరాశికి **అధిపతి శుక్రుడు.**

వృషభరాశి 9 ఆలయాలు ఉంటాయి.

కృత్తికా నక్షత్రంలోని 2,3,4 పాదాలు

రోహిణీ నక్షత్రంలోని నాలుగు పాదాలు

**మరియు** మృగశిరా నక్షత్రంలోని 1,2 పాదాలు

9 ఆలయాలు కలిసి **వృషభరాశి** గా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

## శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి

## వృషభరాశి, కృత్తిక నక్షత్రం (2 వ పాదం)

## అద్దంపల్లి గ్రామం, కే. గంగవరం మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ ఉండి ఉమామహేశ్వర వీరభద్రరావు సెల్ నెం. 96669 24683




**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 6 kms. దూరాన, అద్దంపల్లి గ్రామం (Ardampalli) కలదు. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ప్రాచీన ఆలయం చోళుల కాలం నాటిది. ప్రాచీన ఆలయం జీర్ణమైనది. దేవాదాయ శాఖ మరియు గ్రామస్థుల సహాకారముతో పునః నిర్మాణం జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి కొలువై యున్నాడు. అంతరాలయం నందు గణపతి, నాగ బంధం దర్శనమిస్తాయి. ముఖ మండపం నందు నంది విగ్రహం మరియు ద్వారపాలకులు ఉంటారు. ఆలయ ప్రాంగణములో చండీశ్వరుడు గలడు. ఆలయం నందు వివాహ సమస్యలు, ఆరోగ్య సమస్యలు, చర్మ వ్యాధులతో బాధ పడే వారికి శాంతులు జరిపించుతారు. పార్వతీ అమ్మ వారు మహిమల గల శక్తి స్వరూపిణి గా భక్తులు నమ్ముతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 4 Kms. దూరంలో ఎర్ర పోతవరం బస్ స్టాప్ ఉంటుంది. ఎర్ర పోతవరం నుంచి అండ్రంగి గ్రామం కు రోడ్డు మార్గము కలదు. అండ్రంగి రోడ్డు లో అద్దంపల్లి గ్రామం ఉంటుంది.

* ఎర్ర పోతవరం బ్రిడ్జి దిగువ నుంచి అద్దంపల్లి కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 2 Kms. ఎర్ర పోతవరం నుంచి అద్దంపల్లి వైపు పోవు ఆటోలు చాల తక్కువగా ఉంటాయి. కాబట్టి ద్రాక్షారామం నుంచి అద్దంపల్లి కి రాను - పోను ఆటో ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యముగా ఉంటుంది.

మాకు సహకరించిన అద్దంపల్లి అర్చక స్వామి, శ్రీ ఉండి ఉమామహేశ్వర వీరభద్రరావు, సెల్ నెం. 9666924683 గార్కి నా నమసుమాంజలి.



శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి

వృషభరాశి, కృత్తిక నక్షత్రం (3 వ పాదం)

వట్రపూడి గ్రామం, కే. గంగవరం మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ ఉండి సురేష్ బాబు & శ్రీ ఉండి ఉమామహేశ్వర వీరభద్రరావు, సెల్ నెం. 9666924683




**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 7 kms. దూరాన, వట్రపూడి గ్రామం (Vatrapudi) కలదు. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. శ్రీ సోమేశ్వర లింగము కృత్తిక నక్షత్రం (3 వ పాదం) చెందినది. కృత్తిక నక్షత్రములో 3 వ పాదము లో జన్మంచిన స్త్రీ వలన తల్లికి, పురుషుడు వలన తండ్రికి దోషం కలుగును. వాటిని నివారించుటకు ఆలయం నందు అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**ఆలయం:** ప్రాచీన ఆలయం జీర్ణమైనది. గ్రామస్థుల సహాకారముతో పునః నిర్మాణం జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి కొలువై యున్నాడు. అంతరాలయం నందు గణపతి, నాగ బంధం దర్శనమిస్తాయి. ముఖ మండపం నందు నంది విగ్రహం, ఆలయ ప్రాంగణములో చండీశ్వరుడు గలరు. ఆలయం నందు నిత్యం అర్చనలు, అభిషేకాలు జరుగుతాయి. వీటితో పాటు గ్రహ శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 4 Kms. దూరంలో ఎర్ర పోతవరం బస్ స్టాప్ ఉంటుంది. ఎర్ర పోతవరం - అంద్రంగి రోడ్డు మార్గములో అద్దంపల్లి గ్రామం ఉంటుంది. అద్దంపల్లి కి ఉత్తరం దిశ లో వట్రపూడి గ్రామం కలదు. అద్దంపల్లి - వట్రపూడి మధ్య రోడ్డు దూరం సుమారు ఒక Km. గా ఉంటుంది. నడక దారి కేవలం 100 meters only.

* ఎర్ర పోతవరం బ్రిడ్జి దిగువ నుంచి వట్రపూడి కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 3 Kms. ఎర్ర పోతవరం నుంచి వట్రపూడి వైపు పోవు ఆటోలు చాల తక్కువగా ఉంటాయి. కాబట్టి ద్రాక్షారామం నుంచి వట్రపూడి కి రాను - పోను ఆటో ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యముగా ఉంటుంది.

మాకు సహకరించిన అద్దంపల్లి అర్చక స్వామి శ్రీ ఉండి ఉమామహేశ్వర వీరభద్రరావు, సెల్ నెం. 9666924683 గార్కి నా నమసుమాంజలి. వీరు వట్రపూడి - శ్రీ సోమేశ్వర లింగము నకు అర్చనలు మరియు శాంతులు నిర్వహించుతారు. వట్రపూడి ఆలయం సమాచారం కూడ అందించగలరు.



**శ్రీ ఉమా సమేత శ్రీ మార్కండేయ స్వామి**

**వృషభరాశి, కృత్తిక నక్షత్రం (4 వ పాదం)**

**ఉండూరు గ్రామం, రామచంద్రపురం మండలం**

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక బాల సుబ్రహ్మణ్య శాస్త్రి, సెల్ నెం. 9248387435.




**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 5 kms. దూరాన, ఉండూరు గ్రామం (Unduru) కలదు. ఇచ్చట శ్రీ ఉమా సమేత శ్రీ మార్కండేయ స్వామి ఆలయం ఉంది. కృత్తిక నక్షత్రములో 4 వ పాదములలో జన్మంచిన వారి వలన తల్లికి దోషము కలుగను. వాటిని నివారించుటకు ఆలయం నందు అభిషేక శాంతులు నిర్వహించుతారు. శ్రీ మార్కండేయ లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. ద్రాక్షారామం - కాకినాడ రోడ్డు మార్గంలో ఉండూరు ఉంటుంది. బస్ సర్వీసులు ఉంటాయి.

**ఆలయం:** ఆలయంనకు పునర్నిర్మాణమం, పునః ప్రతిష్ఠ అవసరం ఉంది. గ్రామస్థులు మరియు దాతలు ధన సహాకారములు అందించి, ఆలయ అభివృద్ధికి కృషి చేయాలి. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ ఉమా సమేత శ్రీ మార్కండేయ స్వామి కొలువై యున్నాడు. అంతరాలయం నందు ఉత్సవ మూర్తులు, గణపతి, నంది దర్శనమిస్తాయి. ముఖ మండపం విశాలముగా ఉంటుంది. సుబ్రహ్మణ్యస్వామి మరియ ఆంజనేయ స్వామి మూర్తులు ఉంటారు. ఇచ్చట స్వామి వారి కళ్యాణోత్సవం, విశేష పూజలు మొదలగునవి జరుగుతుంటాయి. ఆలయం నందు నిత్యం అర్చనలు, అభిషేకాలు జరుగుతాయి. వీటితో పాటు అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** కోటిపల్లి నుంచి కాకినాడ పోవు బస్సులు (Via) ద్రాక్షారామం, తోటపేట, హసన్ బాద, ఉండూరు, గొల్లపాలెం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 5 Kms. దూరంలో ఉండూరు గ్రామం ఉంటుంది. యాత్రికులు ఉండూరు లోని శివాలయం బస్ స్టేజి దిగాలి. ద్రాక్షారామం నుంచి ఉండూరు నకు షేరింగ్ ఆటోలు కూడ దొరుకుతాయి.

మాకు సహకరించిన ఉండూరు అర్చక స్వామి శ్రీ కొత్తలంక బాల సుబ్రహ్మణ్య శాస్త్రి, సెల్ నెం. 9248387435 గార్కి నా నమసుమాంజలి.



## శ్రీ పార్వతీ సమేత శ్రీ నీలకంఠేశ్వర స్వామి
## వృషభరాశి, రోహిణి నక్షత్రం (1 వ పాదం)
## తనుమళ్ళ గ్రామం, కాజులూరు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక వెంకట రత్న ప్రసాద్ శాస్త్రీ, సెల్ నెం. 9704435121 గార్కి మరియు శ్రీ కొత్తలంక రామరావు, హైదరాబాద్ గార్కి నా నమసుమాంజలి.




**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 11 kms. దూరాన, తనుమళ్ళ గ్రామం (Tanumalla) కలదు. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత శ్రీ నీలకంఠేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ నీలకంఠేశ్వర లింగము, రోహిణి నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ నీలకంఠేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ప్రాచీన ఆలయం గ్రామస్థుల సహకారముతో పునర్నిర్మించబడింది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ పార్వతీ సమేత శ్రీ నీలకంఠేశ్వర స్వామి కొలువై యున్నాడు. అంతరాలయం నందు ఉత్సవ మూర్తులు, గణపతి దర్శనమిస్తాయి. ముఖ మండపం నందు నందీశ్వరుడు, శృంగి - బృంగి ద్వారపాలకులు మరియు సుబ్రహ్మణ్యడు, వీరభద్రుడు ఉంటారు. శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి విగ్రహం స్థానిక గ్రామస్థుని ఆర్థిక సహాయంతో ప్రతిష్టించబడినది. అతడు ప్రతి సంవత్సరం మార్గశిర శుద్ధ పంచమి నాడు సుబ్రహ్మణ్య స్వామి వారి కళ్యాణం నిర్వహించుతారు. గ్రామ అర్చకస్వాముల ఆర్థిక సహాయంతో శ్రీ వీరభద్రుడు స్వామి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. వీరు శ్రీ భద్రకాళీ సమేత వీరభద్రుడు స్వామి స్వామి వారి కళ్యాణం జ్యేష్టా శుద్ధ పాఢ్యమి నాడు నిర్వహించుతారు. శ్రీ పార్వతీ సమేత శ్రీ నీలకంఠేశ్వర స్వామి వారి కళ్యాణం జ్యేష్టా శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు జరుగుతాయి. వీటితో పాటు గ్రహ అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** కోటిపల్లి నుంచి కాకినాడ పోవు బస్సులు (Via) ద్రాక్షారామం, హసన్ బాద, ఉండూరు, జగన్నాధగిరి, గొల్లపాలెం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* జగన్నాధగిరి గ్రామం నకు ఆగ్నేయం దిశగా సుమారు 4 Kms. దూరం లో తనుమళ్ళ గ్రామం ఉంటుంది. జగన్నాధగిరి గ్రామం నుంచి తనుమళ్ళ గ్రామం నకు (via) పెనుమళ్ళ మీదగా ఆటోలు దొరుకుతాయి. ఆటో రాను - పోను ఏర్పాట్లు చేసుకోవాలి. జగన్నాధగిరి లో ఆటోలు చాల తక్కువుగా దొరుకుతాయి.
* ద్రాక్షారామం నుంచి తనుమళ్ళ గ్రామం నకు ఆటో రాను - పోను ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యం. ద్రాక్షారామం నుంచి బయలు దేరిన ఆటోలు (via) ఉండూరు, ఉండూరు బ్రిడ్జి నుంచి కాలువ గట్టు మీదగా పెనుమళ్ళ చేరుకొంటాయి. పెనుమళ్ళ నుంచి తనుమళ్ళ గ్రామంకు మార్గం ఉంది. ద్రాక్షారామం నుంచి తనుమళ్ళ మధ్య దూరం 9 Kms. గా ఉండును.
* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, జగన్నాధగిరి, ఉండూరు, ద్రాక్షారామం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. కాకినాడ నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు కూడ దొరుకుతాయి. కాకినాడ పాత బస్ స్టాండ్ మరియు కాకినాడ జగన్నాధపురం బ్రిడ్జి నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు బయలుదేరుతాయి.
* గొల్లపాలెం చిరు పట్టణం నందు ఆటో స్టాండ్ ఉంది. గొల్లపాలెం (కాజులూరు సెంటర్) నుంచి తనుమళ్ళ గ్రామం నకు ఆటో ప్రయాణం (via) జగన్నాధగిరి, పెనుమళ్ళ మీదగా ఉంటుంది. వీటి మధ్య దూరం 10Kms. గా ఉండును. ఈ ప్రయాణం సౌకర్యం.

శ్రీ సర్వమంగళా సమేత శ్రీ అగస్త్యేశ్వర స్వామి

వృషభరాశి, రోహిణి నక్షత్రం (2 వ పాదం)

కాజులూరు గ్రామం, కాజులూరు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ దొంతికుర్తి విశ్వేశ్వర శర్మ, సెల్ నెం. 96766 79774




**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి తూర్పు దిశగా, సుమారు 16 kms. దూరాన, కాజులూరు గ్రామం (Kajuluru) కలదు. ఇచ్చట శ్రీ సర్వమంగళా సమేత శ్రీ అగస్త్యేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ అగస్త్యేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్తంభం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందలి శివ లింగము స్వయంభూ మూర్తిగా చెప్పుచుంటారు. అగస్త్య మహాముని ప్రథమ ఆరాధకుడు. స్వయంభూ మూర్తి, శ్రీ అగస్త్యేశ్వరడుగా కీర్తించబడ్డాడు. స్వయంభూ మూర్తి సుమారు 1 1/2 అడుగులు భూమి లోపల మరియు 1 1/2 అడుగులు భూమికి పైన ఉంటుంది. శివ లింగము నకు పాన వట్టం ఉండదు. ఆలయం నందు శ్రీ సర్వమంగళా దేవికి ప్రత్యేక స్థానం లేదు. సర్వ మంగళ దేవి స్వామి వారిలో అంతర్లీనం అని అర్చకులు చెప్పుచుంటారు. ఆలయం నకు పశ్చిమ వైపున గల చెరువు గర్భంలో శ్రీ సర్వమంగళా దేవి కొలువై ఉంటుంది అని భక్తుల విశ్వాసం. అంతరాలయం నందు గణపతి మూర్తి దర్శనమిస్తాడు. కొంత మంది భక్తులు సుబ్రహ్మణేశ్వరాలయంగా పిలుస్తారు. శ్రీ అగస్త్యేశ్వర లింగము ఒక వాల్మీకం (పుట్ట) నుంచి స్వయంభూ లింగముగా ఉద్భవించింది అని చెప్పుచుంటారు. ఇచ్చట సుబ్రహ్మణేశ్వర స్వామికి విశేష పూజలు నిర్వహించుతారు. గొడ్రాళ్ళ సంతానం కోసం మరియు యువతి, యువకులు వివాహం కోసం స్వామిని ఆరాధించుతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) కుయ్యేరు మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 9 Kms. దూరంలో కుయ్యేరు ఉంటుంది.

* కుయ్యేరు నకు ఈశాన్యంగా సుమారు 7 Kms. దూరంలో కాజులూరు ఉంటుంది.

* కుయ్యేరు నుంచి గొల్లపాలెం కు (Via) దుగ్గుదూరు, కాజులూరు, చేదువాడ బ్రిడ్జి మీదగా రోడ్డు మార్గం కలదు. కుయ్యేరు నుంచి కాజులూరు కు ఆటోలు చాల తక్కువుగా దొరుకుతాయి. ద్రాక్షారామం నుంచి కాజులూరు కి రాను - పోను ఆటో ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యముగా ఉంటుంది.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కాకినాడ - కోటిపల్లి రోడ్డు మార్గములో గొల్లపాలెం ఉంటుంది. గొల్లపాలెం మార్కెట్ బస్ స్టాప్ దాటగానే గొల్లపాలెం (కాజులూరు సెంటర్) బస్ స్టాప్ వస్తుంది. ఇక్కడ నుంచి కుయ్యేరు రోడ్డు ప్రారంభమవుతుంది.

* గొల్లపాలెం (కాజులూరు సెంటర్) నుంచి కుయ్యేరు కు (Via) చేదువాడ బ్రిడ్జి, కాజులూరు, దుగ్గుదూరు మీదగా బ్రాంచి రోడ్డు మార్గం కలదు. గొల్లపాలెం ( కాజులూరు సెంటర్) నుంచి కాజులూరు గ్రామం కు షేరింగ్ ఆటోలు (Via) చేదువాడ బ్రిడ్జి మీదగా దొరుకుతాయి. గొల్లపాలెం నుంచి కాజులూరు కి రాను - పోను ఆటో ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యముగా ఉంటుంది. వీటి మధ్య దూరం సుమారు 7 kms.

* కాకినాడ - పల్లిపాలెం, కాకినాడ - దుగ్గుదూరు, కాకినాడ - కాజులూరు బస్సులు (via) గొల్లపాలెం మీదగా ఉండేవి. కాజులూరు బస్ స్టాప్ కు సుమారు 100 meters గ్రామం లోపలకి శ్రీ అగస్త్యేశ్వరాలయం ఉంటుంది. ప్రస్తుతం బస్ సర్వీసులు కాజులూరు కు లేవు.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన కాజులూరు - శ్రీ అగస్త్యేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ దొంతికుర్తి విశ్వేశ్వర శర్మ, సెల్ నెం. 9676679774 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి

వృషభరాశి, రోహిణి నక్షత్రం (3 వ పాదం)

అయితపూడి గ్రామం, కాజులూరు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక ప్రతాప్, సెల్ నెం. 90007 82819




**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి తూర్పు దిశగా, సుమారు 16 kms. దూరాన, అయితపూడి గ్రామం (Aithapudi) కలదు. ఇచ్చట శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** త్రేతాయుగం నందు శ్రీ రామచంద్రమూర్తి అరణ్యవాసం నందు ఒక కుటీరం నిర్మించుకుని, సీతా లక్ష్మణుల సమేతంగా కొంత కాలము నివాసాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఆ సమయంలో రావణ బ్రహ్మ, సీతాదేవిని అపహరించుటకు మారీచుడు అను రాక్షవీరుడును పంపుతాడు. ఆ మారీచుడు ఒక బంగారు లేడి రూపాంలో సీతాదేవి కంటిచూపులో పడ్డాడు. సీతాదేవి ఆశ పడి శ్రీ రాముడుని కోరుతుంది. భార్య కోరికను మన్నించిన శ్రీ రాముడు బంగారు లేడి కోసం బయులు దేరుతాడు. బంగారు లేడిని పట్టుకొనుటకు ప్రయత్నించి, చివరికి విఫలం చెంది ధనస్సు సంధించుతాడు. రామబాణం మాయ లేడికి తగిలి, దాని శరీర అవయవాలు అయిదు ప్రాంతాలల్లో పడ్డాయి. మారీచుని సంహరించిన పాప పరిహారార్ధం, శ్రీ రాముడు ఆ అయిదు ప్రాంతాలల్లో అయిదు శివ లింగాలను ప్రతిష్టించి, ఆరాధించాడు. తూరంగి - శ్రీ తూరంగేశ్వర స్వామి, పాత కోరంగి - శ్రీ కురంగేశ్వర సామి, కాజులూరు - శ్రీ రామలింగేశ్వర స్వామి, అయితపూడి - శ్రీ రామలింగేశ్వర స్వామి, ఐలెండు పోలవరం - శ్రీ బాణేశ్వర స్వామి (మురమళ్ళ కు సూమారు ఏడు కీలోమిటారు దూరం లో ఐలెండు పోలవరం ఉంటుంది) ఇవి శ్రీ రాముడు ప్రతిష్టించిన లింగాలుగా ఖ్యాతి పొందినాయి. అయితపూడి గ్రామం లో శ్రీ అన్నపూర్ణా సమేత రామలింగేశ్వర స్వామి ఆలయం ఉంది. ప్రాచీన ఆలయం జీర్ణమైనది. గ్రామస్థుల సహాకారముతో పునః నిర్మాణం జరిగింది. కాశీ క్షేత్రం నుంచి తెచ్చిన ఒక శివలింగమును ప్రతిష్టించారు. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్ధంబం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ అన్నపూర్ణా సమేత రామలింగేశ్వర స్వామి తూర్పు అభిముఖంగా కొలువై యున్నాడు. అంతరాలయం నందు గణపతి, సుబ్రహ్మణ్య స్వామి దర్శనమిస్తారు. ముఖ మండపం నందు నంది విగ్రహం మరియు శ్రీ అన్నపూర్ణా దేవి మందిరం ఉంటాయి. అమ్మ వారు దక్షిణాభి ముఖంగా కొలువుదీరింది. ఆలయ ప్రాంగణములో చండేశ్వరుడు గలడు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి అయితపూడి గ్రామం నకు ఆటో రాను - పోను ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యం. ఆటోలు (via) ఉండూరు, ఉండూరు బ్రిడ్జి, అయితపూడి. ఉండూరు బ్రిడ్జి నుంచి కాలువ గట్టు మీదగా నంది బొమ్మ సెంటర్ కు (ఆంజనేయ స్వామి) ఆటోలు చేరుకొంటాయి. నంది బొమ్మ సెంటర్ నుంచి అయితపూడి గ్రామంకు దారి ఉంటుంది. ద్రాక్షారామం - అయితపూడి మధ్య దూరం 13 Kms. గా ఉండును. ఈ మార్గం బాగుటుంది.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. గొల్లపాలెం మార్కెట్ బస్ స్టాప్ దాటగానే గొల్లపాలెం (కాజులూరు సెంటర్) బస్ స్టాప్ వస్తుంది. ఇక్కడ నుంచి కుయ్యేరు రోడ్డు ప్రారంభమవుతుంది.

* గొల్లపాలెం (కాజులూరు సెంటర్) నుంచి అయితపూడి కు ఆటోలు (Via) చేదువాడ బ్రిడ్జి, తిప్పరాజు పాలెం మీదగా దొరుకుతాయి. చేదువాడ బ్రిడ్జి దాటగానే కుడి వైపు కు పోవు మార్గములో నంది బొమ్మ సెంటర్ (హనుమాన్ గుడి) ఉంటుంది. అక్కడ నుంచి అయితపూడి కి రోడ్డు ఉంటుంది. గొల్లపాలెం నుంచి అయితపూడి కి రాను - పోను ఆటో ఏర్పాట్టు చేసుకోవటం సౌక్యముగా ఉంటుంది. వీటి మధ్య దూరం సుమారు 10 kms.

ఆలయ సమాచారం & Photos అందించిన అయితపూడి - శ్రీ రామలింగేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొత్తలంక ప్రతాప్, సెల్ నెం. 90007 82819 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ పార్వతీ సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి

వృషభరాశి, రోహిణి నక్షత్రం (4 వ పాదం)

శీల గ్రామం, కాజులూరు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక విశ్వ సత్య సుబ్రహ్మణ్య మల్లికార్జునరావు (శంకరప్రియ), సెల్ నెం. 99127 67098


శ్రీ రామలింగేశ్వర లింగము
శీల గ్రామం, కాజులూరు మండలం

**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 19 kms. దూరాన, శీల గ్రామం (Seela) కలదు. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**స్థల పురాణం:** త్రేతాయుగం నందు శ్రీ రామచంద్రమూర్తి తన అరణ్యవాసం కాలము దండకారణ్యములో గడిపినాడు. పలు ప్రాంతముల నందు కుటీరం నిర్మించుకుని, సీతా లక్ష్మణుల సమేతంగా కొంత కాలము ఆ ప్రాంతములో నివాసాన్ని ఏర్పాటు చేసుకునే వాడు. ధర్మస్వరూపుడగు శ్రీరాముడు నిత్య శివార్చన తత్పరుడు. ఆ అవతారమూర్తి నిత్య అర్చన కోసం అనేక శివలింగములను దండకారణ్యములో నెలకొల్పారు. ఆ రామ లింగాలల్లో ఒక శివ లింగమును శీల గ్రామం నందు దర్శించగలము. స్వామి శ్రీ రామలింగేశ్వరుడుగా ఖ్యాతి పొందినాడు.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత శ్రీ రామలింగేశ్వర స్వామి వారి ఆలయం పశ్చిమాభిముఖంగా ఉంటుంది. ఆలయ ప్రవేశం తూర్పున గల ముఖద్వారం నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణము చాల విశాలంగా ఉంటుంది. శివాలయం కు ఉత్తరం వైపున విష్ణ్వాలయం ఉంటుంది. విష్ణ్వాలయం నందు శ్రీదేవి - భూదేవి సమేత శ్రీ వేంకటేశ్వర సామి దర్శనమిస్తారు. ఒకే ప్రాంగణములో శివ-కేశవులు కొలువుదీరియుండుట విశేషం. శివాలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. శివాలయం నకు ధ్వజస్తంభం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. ముఖ మండపం నందు నందీశ్వరుడు, గణపతి, పార్వతీ దేవి సన్నిధిలు ఉంటాయి. అంతరాలయం నందు ఉత్సవమూర్తులు కలవు. గర్భాలయం లోపల శ్రీ రామలింగేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ పార్వతీ దేవి కొలువుదీరింది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం మాఘ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు వైభవంగా జరుగుతాయి.

**రవాణా సమాచారం:** రాజమండ్రి - మంజేరు బస్సులు (via) రామచంద్రపురం, ద్రాక్షారామం, కుయ్యేరు, కాజులూరు, చేదువాడ బ్రిడ్జి, శీల మీదగా ఉండేవి. ప్రస్తుతం బస్ సర్వీసులు లేవు.

* కాకినాడ - పల్లిపాలెం, కాకినాడ - దుగ్గుదూరు, కాకినాడ - కాజులూరు బస్సులు (via) గొల్లపాలెం, చేదువాడ బ్రిడ్జి, మీదగా ఉండేవి. చేదువాడ బ్రిడ్జి నుంచి శీల దూరం సుమారు 2.5 Kms. మాత్రమే. ప్రస్తుతం బస్ సర్వీసులు లేవు.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. గొల్లపాలెం (కాజులూరు సెంటర్) వద్ద ఆటో స్టాండ్ ఉంటుంది. ఇక్కడ నుంచి కాజులూరు, శీల, అయితపూడి మొదలగు పల్లెటూరు ప్రాంతమలకు షేరింగ్ ఆటోలు బయలుదేరుతాయి. గొల్లపాలెం (కాజులూరు సెంటర్) నుంచి శీల శివాలయం దూరం సుమారు 7 Kms. యాత్రికులు శీల కు ఆటోలు రాను-పోను ఏర్పాట్లు చేసుకోవడం సౌక్యంగా ఉంటుంది.

ఆలయ సమాచారం & Photos అందించిన ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొత్తలంక విశ్వ సత్య సుబ్రహ్మణ్య మల్లికార్జునరావు (శంకరప్రియ), సెల్ నెం. 99127 67098 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి

వృషభరాశి, మృగశిర నక్షత్రం (1 వ పాదం)

తాళ్ళరేవు గ్రామం, తాళ్ళరేవు మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొండవీటి శివ రామకృష్ణ, సెల్ నెం. 98494 43187




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి తూర్పు దిశగా, సుమారు 26 kms. దూరాన, తాళ్ళరేవు గ్రామం (Tallarevu) కలదు. ఇచ్చట శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం ఉంది. తాళ్ళరేవు రిజిస్టర్ ఆఫీస్ కు సమీపంలో శ్రీ రామాలయం, శ్రీ కేశవ స్వామి ఆలయం, శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం ఉంటాయి. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాల్లో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయ ప్రాంగణములో ప్రధానాలయం, ధ్వజ స్థంభము, కుమారుస్వామి, విఘ్నేశ్వర స్వామి, నవగ్రహ మండపం, చండేశ్వర స్వామిని దర్శించగలము. ముఖ మండపం నందు శ్రీ వీరేశ్వర స్వామి సన్నిధి మరియు శ్రీ సత్యనారయణ స్వామి సన్నిధి వేరు వేరుగా ఉంటాయి. వీటితో పాటు శ్రీ సుబ్రహ్మణ్య సామి, శ్రీ విఘ్నేశ్వర స్వామి, శ్రీ శనీశ్వర లింగము ఉంటాయి. శ్రీ శనీశ్వర లింగము పశ్చిమాభి ముఖముగా దర్శనమిస్తుంది. శ్రీ వీరేశ్వర స్వామి వారి అంతరాలయం నందు నంది, శ్రీ భద్రకాళి అమ్మ వారు ఉంటారు. శ్రీ భద్రకాళి అమ్మ వారి సన్నిధి దక్షిణ ముఖంగా ఉండును. గర్భాలయం నందు శ్రీ వీరేశ్వర లింగము దర్శనమిస్తుంది. శ్రీ వీరేశ్వర స్వామికి నిత్య అర్చనలు, అభిషేకాలు జరగుచుంటాయి. స్వామి వారి కళ్యాణోత్సవం మాఘ శుద్ధ ఏకాదశి నాడు వైభవంగా జరుగుతాయి. కార్తీక మాసం, మహా శివ రాత్రి నాడు విశేష పూజలు నిర్వహించుతారు. శ్రీ సత్యనారయణ స్వామి వారి కళ్యాణం చైత్ర శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది ఒకే ఆలయ ప్రాంగణములో శివ - కేశవులు కొలువు దీరియుండుట విశేషం.

**రవాణా సమాచారం:** కాకినాడ నుంచి యానాం బస్సులు (Via) జగన్నాధపురం బ్రిడ్జి, కోరంగి, తాళ్ళరేవు మీదగా ఉంటాయి. కాకినాడ - యానాం మరియు కాకినాడ - అమలాపురం (పల్లె వెలుగు) బస్సులు తాళ్ళరేవు (ఊరు లోపల) మీదగా ఉంటాయి. కాకినాడ బస్ స్టాండ్ నుంచి తాళ్ళరేవు దూరం సుమారు 25 Kms. గా ఉంటుంది.

* తాళ్ళరేవు రిజిస్టర్ ఆఫీస్ బస్ స్టేజి దిగాలి. ఇక్కడ నుంచి శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం దూరం సుమారు 400 meters గా ఉంటుంది.

* కాకినాడ లోని జగన్నాధపురం బ్రిడ్జి నుంచి తాళ్ళరేవు ఊరు లోనికి షేరింగ్ ఆటోలు కూడ దొరుకుతాయి.

* కాజులూరు నుంచి తాళ్ళరేవు కు రోడ్డు మార్గం & ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 8 Kms. గా ఉంటుంది.

ఆలయ సమాచారం & Photos అందించిన తాళ్ళరేవు - శ్రీ వీరేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొండవీటి శివ రామకృష్ణ, సెల్ నెం. 9849443187 గార్కి నా నమసుమాంజలి.



శ్రీ భ్రమరాంబికా సమేత శ్రీ చెన్నమల్లేశ్వర స్వామి

వృషభరాశి, మృగశిర నక్షత్రం (2 వ పాదం)

గురజనాపల్లి గ్రామం, కరప మండలం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి బాల కామేశ్వర శర్మ, సెల్ నెం. 98663 96635




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 26 kms. దూరాన, గురజనాపల్లి గ్రామం (Gurajanapalli) కలదు. ఇచ్చట శ్రీ భ్రమరాంబికా సమేత శ్రీ చెన్న మల్లేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ చెన్న మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఒకనాటి గురజనాపల్లి గ్రామం నందు శ్రీ సర్వమంగళ అన్నపూర్ణ సమేత కాశీ విశ్వేశ్వరాలయం ఉండేది. ప్రకృతి వైపరీత్యాలు వలన నాటి గురజనాపల్లి గ్రామం పూర్తిగా అగ్నికి అహుతి అయింది. ప్రాచీన ఆలయం నేల మట్టమయింది. దేవతా మూర్తులుకు నష్టం జరిగింది. ఆ బూడిద మీద మరల గురజనాపల్లి గ్రామం వెలిసింది. కొంత కాలము గడిచిన పిమ్మట గ్రామవాసులు ఆర్ధిక సహాయం తో మరో ఆలయం నిర్మించుట జరిగింది. నూతనముగా మరో దేవతా మూర్తులును ప్రతిష్టించారు. ఆ మూర్తులును శ్రీ భ్రమరాంబికా సమేత శ్రీ చెన్న మల్లేశ్వర స్వామి గా నామకరణం చేశారు. పిఠాపురం సంస్థానం వారు ఆలయం కు భూములు దానం ఇచ్చారు. కాలక్రమేన శ్రీ చెన్న మల్లేశ్వర స్వామి ఆలయం క్రమ క్రమముగా జీర్ణమైనది. గురజనాపల్లి గ్రామ ప్రజలు, దాతల సహకారముతో 1997 సంవత్సరములో మరల చెన్న మల్లేశ్వర స్వామి ఆలయం పునర్నిర్మాణం చేశారు. దేవతా మూర్తులుకు పునః ప్రతిష్ట గావించారు. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభము, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ చెన్న మల్లేశ్వర లింగము దర్శనమిస్తుంది. అంతరాలయం నందు శ్రీ భ్రమరాంబికా దేవి, గణపతి, నాగ బంధం, అయ్యప్ప స్వామి కలరు. ముఖమండపం నందు నంది విగ్రహం ఉంటుంది. శ్రీ చెన్న మల్లేశ్వర స్వామికి నిత్య అర్చనలు, అభిషేకాలు జరగుచుంటాయి. ఇచ్చట స్వామి వారి కళ్యాణోత్సవం, గణపతి నవరాత్రులు, దేవి శరన్నవరాత్రులు, అయ్యప్ప స్వాముల దీక్షలు జరగుచుంటాయి.

**రవాణా సమాచారం:** కాకినాడ నుంచి యానాం బస్సులు (Via) జగన్నాధపురం బ్రిడ్జి, చొల్లంగి తీర్ధం, గురజనాపల్లి జంక్షన్, కోరంగి, తాళ్ళరేవు మీదగా ఉంటాయి. కాకినాడ - యానాం మరియు కాకినాడ - అమలాపురం (పల్లె వెలుగు) బస్సులు గురజనాపల్లి జంక్షన్ వద్ద ఆగుతాయి. దీనిని గురజనాపల్లి బస్ స్టాప్ గా పిలుస్తారు. కాకినాడ RTC బస్ స్టాండ్ నుంచి గురజనాపల్లి జంక్షన్ దూరం సుమారు 8 Kms. గా ఉంటుంది. గురజనాపల్లి బస్ స్టాప్ నుంచి గురజనాపల్లి ఊరు దూరం సుమారు 2 Kms. గా ఉంటుంది.

* కాకినాడ లోని జగన్నాధపురం బ్రిడ్జి నుంచి గురజనాపల్లి ఊరు లోనికి షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* కాకినాడ నుంచి కోటిపల్లి బస్సులు (Via) జగన్నాధపురం బ్రిడ్జి, నడకుదురు మీదగా ఉంటాయి.

* కాకినాడ - కోటిపల్లి, కాకినాడ - రామచంద్రపురం మరియు కాకినాడ - రావులపాలెం (పల్లె వెలుగు) బస్సులు (Via) నడకుదురు, గురజనాపల్లి బస్ స్టాప్ మీదగా ఉంటాయి.

* నడకుదురు ఊరు దాటగానే గురజనాపల్లి రోడ్డు వద్ద బస్సులు ఆగుతాయి. దీనిని గురజనాపల్లి బస్ స్టాప్ (నడకుదురు) గా పిలుస్తారు.

* కాకినాడ లోని జగన్నాధపురం బ్రిడ్జి నుంచి షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* నడకుదురు (గురజనాపల్లి రోడ్డు) నుంచి చొల్లంగి వైపు పోవు బ్రాంచి రోడ్డు మార్గములో గురజనాపల్లి గ్రామం ఉంటుంది. నడకుదురు (గురజనాపల్లి రోడ్డు) - చొల్లంగి (గురజనాపల్లి జంక్షన్) రోడ్డు మార్గం నందు శ్రీ భ్రమరాంబికా సమేత చెన్న మల్లేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. నడకుదురు (గురజనాపల్లి రోడ్డు) నుంచి ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 3 Kms. గా ఉంటుంది.

ఆలయ సమాచారం & Photos అందించిన గురజనాపల్లి - శ్రీ చెన్న మల్లేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ వెలవలపల్లి బాల కామేశ్వర శర్మ, సెల్ నెం. 9866396635 గార్కి నా నమసుమాంజలి.








జ్యోతిష చక్రంలో మిధునరాశి మూడవ రాశి

స్వభావం "ద్వి స్వభావం"

వృషభరాశికి అధిపతి బుధుడు.

మిధునరాశి 9 ఆలయాలు ఉంటాయి.

మృగశిర నక్షత్రంలోని 3, 4 పాదములు

ఆరుద్ర నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

మరియు పునర్వసు నక్షత్రంలోని 1, 2, 3

9 ఆలయాలు కలిసి మిధునరాశిగా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి

మిధునరాశి, మృగశిర నక్షత్రం (3 వ పాదం)

అంద్రంగి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** స్వామి శ్రీ సంగమేశ్వర మల్లేశ్వర శర్మ, సెల్: 99514 23978 మరియు శ్రీ సంగమేశ్వర సురేష్, సెల్: 90101 81873




**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 08 kms. దూరాన, అంద్రంగి గ్రామం (Andrangi) కలదు. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ మల్లేశ్వర లింగము, మృగశిర నక్షత్రం . (3 వ పాదం) చెందినది. ఈ రాశిలో జన్మించిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయ ప్రాంగణం విశాలముగా ఉంటుంది. ప్రధానాలయం తూర్పు అభిముఖం గా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ప్రధానాలయం, శివకోటి స్తూపం, చండీశ్వరుడు, శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి వారి సన్నిధి మొదలగునవి ఉంటాయి. ముఖ మండపం నందు నంది విగ్రహం ఉంటుంది. అంతరాలయం నందు చిన్న నంది, గణపతి, నాగ బంధం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ మల్లేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ పార్వతీ దేవి కొలువుదీరింది. స్వామిని సేవించిన వారు విశేష ఫలాలను పొందగలరు అని భక్తుల విశ్వాసం. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు.

వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు మల్లేశ్వర స్వామి వారి కళ్యాణం జరుగుతుంది. శ్రావణ మాసం లో వరలక్ష్మీ వ్రతం పూజలు, భాద్రపద మాసం లో వినాయక చవితి వ్రతం, అశ్వయుజ మాసం లో శరన్నవరాత్రులు సందర్భంగా తొమ్మిది రోజులు పాటు విశేష అర్చనలు వైభవంగా జరుగుతాయి. హోమాలు కూడ నిర్వహించుతారు. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు, అభిషేకాలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. మార్గశిర మాసం లో సుబ్రహ్మణ్య షష్టి ఘనంగా నిర్వహించుతారు. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. సంక్రాంతి, దీపావళీ మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా ఉంటాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 4 Kms. దూరంలో ఎర్ర పోతవరం బస్ స్టాప్ ఉంటుంది. ఎర్ర పోతవరం నుంచి అంద్రంగి గ్రామం కు రోడ్డు మార్గము కలదు.

* ఎర్ర పోతవరం బ్రిడ్జి దిగువ నుంచి అంద్రంగి కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms. ఎర్ర పోతవరం నుంచి అంద్రంగి వైపు పోవు ఆటోలు చాల తక్కువగా ఉంటాయి. కాబట్టి ద్రాక్షారామం నుంచి అంద్రంగి కి రాను - పోను ఆటో ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యముగా ఉంటుంది. ద్రాక్షారామం - అంద్రంగి మధ్య దూరం సుమారు 08 Kms. గా ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన అంద్రంగి అర్చక స్వామి శ్రీ సంగమేశ్వర మల్లేశ్వర శర్మ, సెల్: 99514 23978 గార్కి మరియు శ్రీ సంగమేశ్వర సురేష్, అంద్రంగి గ్రామం గార్కి నా నమసుమాంజలి.



## శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి

## మిధునరాశి, మృగశిరి నక్షత్రం (4 వ పాదం)

## జగన్నాధగిరి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ చెరుకూరి నాగదత్తాత్రేయ శర్మ, సెల్: 7780208088 & 7207192247



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 08 kms. దూరాన జగన్నాధగిరి గ్రామం (Jaganadhagiri) కలదు. ద్రాక్షారామం - కాకినాడ రోడ్డు మార్గములో జగన్నాధగిరి గ్రామం ఉంటుంది. జగన్నాధగిరి శివాలయం బస్ స్టాప్ కు సమీపంలో శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. శ్రీ విశ్వేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ప్రధానాలయం, హోమశాల, వాహన శాల, చండీశ్వరుడు, నవగ్రహ మండపం ఉంటాయి. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ముఖ మండపం నందు నందీశ్వరుడు, సుబ్రహ్మణ్య స్వామి (ఉత్తరాభి ముఖం), అన్నపూర్ణా దేవి (దక్షిణాభి ముఖం) ఉన్నారు. అయ్యప్ప స్వామి, ఆంజనేయ స్వామి దర్శనం కూడ లభ్యమవుతుంది. అంతరాలయం నందు గణపతి స్వామి కలరు. గర్భాలయం నందు శ్రీ విశ్వేశ్వర లింగము దర్శనమిస్తుంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం చైత్ర శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది.

ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక మాసంలో లక్షపత్ర పూజ నిర్వహించుతారు. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. శాంతి కళ్యాణం, హోమం, జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. షష్ఠి నాడు శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి వారి కళ్యాణం జరుగుతుంది. ధనుర్మాసం నందు 'తీర్థ బిందె' కార్యక్రమం ఉంటుంది. ప్రతి మాస శివరాత్రి సందర్భముగా రుద్రాభిషేకం నిర్వహించుతారు. ఆలయం నందు గ్రహ శాంతులు, హోమం, నామకరణం, అన్నప్రాశన, అక్షరాభ్యాసం మొదలగునవి జరుపుతారు. శ్రీ విశ్వేశ్వర లింగము, మృగశిర నక్షత్రం (4 వ పాదం) చెందినది. ఈ రాశిలో జన్మించిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** కోటిపల్లి నుంచి కాకినాడ పోవు బస్సులు (Via) ద్రాక్షారామం,హసన్ బాద, ఉండూరు, జగన్నాధగిరి, గొల్లపాలెం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 8 Kms. దూరంలో జగన్నాధగిరి గ్రామం ఉంటుంది. యాత్రికులు జగన్నాధగిరి లోని శివాలయం బస్ స్టేజి దిగాలి. ద్రాక్షారామం నుంచి జగన్నాధగిరి మీదగా కాకినాడ కు షేరింగ్ ఆటోలు కూడ దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన జగన్నాధగిరి అర్చక స్వామి శ్రీ చెరుకూరి నాగదత్తాత్రేయ శర్మ, సెల్: 7780208088 & 7207192247 గార్కి నా నమసుమాంజలి.



శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి

మిధునరాశి, ఆరుద్ర నక్షత్రం (1 వ పాదం)

పెనుమళ్ళ గ్రామం

అష్ట సోమేశ్వరాలయాలు (ఈశాన్య క్షేత్రం)

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కాళ్ళకూరి కామేశ్వరరావు, సెల్: 9848422988



**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 10 kms. దూరాన, పెనుమళ్ళ గ్రామం (Penumalla) కలదు. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ద్రాక్షారామ క్షేత్రం నందలి శ్రీ భీమేశ్వర లింగము "సూర్య యంత్ర" ప్రతిష్ట. ఆ రుద్రమూర్తిని శాంతపరచేందుకు ద్రాక్షారామ క్షేత్రం చుట్టూ

ఎనిమిది "చంద్ర యంత్ర" ప్రతిష్టలు జరిగినాయి. వీటిని సోమేశ్వర ఆలయాలుగా పిలుస్తారు. చంద్రుడిని సోముడు అని కూడ పిలుస్తారు. సోము ప్రతిష్ట శివాలయాలను అష్ట సోమేశ్వరాలయాలు అని అంటారు. ఇవి ద్రాక్షారామం పరిసరాల్లోనే ఉంటాయి. వీటి సందర్శనం వలన చంద్ర గ్రహ దోష నివృత్తి కలుగుతుంది. ఆలయ ప్రాంగణం చాల విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, నంది విగ్రహం, ప్రధానాలయం, చండీశ్వరుడు, కళ్యాణ మండపం, సంతాన వృక్షం (రావి & వేప), నాగ ప్రతిమలు మొదలగునవి ఉంటాయి. ఆలయ ప్రాంగణ ప్రవేశం ఉత్తర ద్వారం నుంచి జరుగుతుంది. ప్రధానాలయం తూర్పు అభిముఖం గా ఉంటుంది. నంది మండపం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గర్భాలయం నందు శ్రీ రాజ సోమేశ్వర స్వామి కొలువై యున్నాడు. అంతరాలయం నందు ఉత్సవ మూర్తులు, గణపతి దర్శనమిస్తాయి. ముఖ మండపం నందు శ్రీ పార్వ తీ దేవి దక్షిణాభి ముఖంగా కొలువుదీరింది. శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి వారి సన్నిధి ఉత్తర ముఖంగా ఉంటుంది. ఇచ్చటనే వీరభద్ర స్వామి దర్శనం కూడ లభ్యమవుతుంది. నంది మండపం నందు నందీశ్వరుడు, ద్వారపాలకులు కలరు. నంది విగ్రహం నకు నైఋతి మూల నాగ ప్రతిమ కలదు. నాగ శిరస్సు మీద ఒక శివ లింగము సుదరంగా ఉంటుంది. నాగ ప్రతిష్ట క్రింద నాగ యంత్రం మరియు సంతాన గోపాలస్వామి యంత్రం ప్రతిష్టించబడ్డాయి. ప్రతి మంగళవారం నాగ ప్రతిమ కు అభిషేకాలు జరుగుతాయి.

* జాతకచక్రంలో నాగదోషం వలన ముఖ్యంగా వివాహం ఆలస్యం కావటం, సంతాన సమస్యలు ఎదుర్కోవటం జరుగుతుంది. నాగదోషం ఉన్న జాతకులకు అశాంతి కలిగించే పరిస్థితులు ఏర్పడతాయి. సంతానం కలుగకపోవడంతో పాటు ఆర్థిక సమస్యలు, వివాహంలో జాప్యం, అంగవిహీనులైన సంతతి జన్మించడం, పుత్రశోకం, వైవాహిక జీవితంలో ఆటంకాలు నాగదోషము వల్లనే ఏర్పడుతాయని పురాణాలు చెబుతున్నాయి.

* సంతాన గోపాల స్వామి యంత్రం వలన గర్భస్రావం నుండి తల్లులను రక్షించడానికి మరియు శిశువుకు సురక్షితంగా

ప్రసవించేలా చేస్తుంది. ఆలయం నందు నిత్యం భారీ శ్రీ రాజ సోమేశ్వర లింగము నకు అభిషేకాలు, అర్చనలు

జరుగుతాయి. వీటితో పాటు గ్రహ అభిషేక శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు వైభవంగా జరుగుతుంది. మహా శివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు నిర్వహించుతారు. ఉదయం 6:00 గంటలు నుంచి భజన కార్యాక్రమాలు జరుగుతాయి. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. సుబ్బారాయుడు షష్ఠికి ముందు రోజు అనగా పంచమి నాడు సుబ్రహ్మణ్య స్వామి కళ్యాణోత్సవాలు ఘనంగా నిర్వహించుతారు

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి పెనుమళ్ళ గ్రామం నకు ఆటో రాను - పోను ఏర్పాట్లు చేసుకోవటం సౌక్యం. ఇవి (via) ఉండూరు, ఉండూరు బ్రిడ్జి, కాలువ గట్టు మీదగా ఉంటాయి. వీటి మధ్య దూరం 10 Kms. గా ఉండును.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన పెనుమళ్ళ అర్చక స్వామి శ్రీ కాళ్ళకూరి కామేశ్వరరావు, సెల్: 9848422988 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత గోకర్ణేశ్వర స్వామి

మిధునరాశి, ఆరుద్ర నక్షత్రం (2 వ పాదం)

గొల్లపాలెం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పూజ్యం మల్లిఖార్జున శర్మ, సెల్: 95159 91986




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 14 kms. దూరాన గొల్లపాలెం గ్రామం (Gollapalem) కలదు. ద్రాక్షారామం - కాకినాడ రోడ్డు మార్గములో గొల్లపాలెం గ్రామం ఉంటుంది. గొల్లపాలెం ఊరులో శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత గోకర్ణేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. శ్రీ గోకర్ణేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. శ్రీ గోకర్ణేశ్వర స్వామి,

శివ భగవానుని అష్ట మూర్తులలో ఒక్కడు అని చెప్పుచుంటారు. అష్ట మూర్తులలో ఆరవ స్వరూపమే "భీముడు". సర్వమునకు అవకాశమొసగు, సర్వవ్యాపియగు మహాదేవుని ఆకాశాత్మక రూపమును "భీముడు" అని అంటారు. ఈ మూర్తి స్థానం ఆకాశం. దేహం లోని రంధ్రాలలో (బయలు ప్రదేశం) వ్యాపించి ఉంటాడు. ఇతని శరీరం భీమము. గోకర్ణ అనగా గోవు యొక్క చెవి అని అర్ధం. దేహం లోని రంధ్రాలలో (బయలు ప్రదేశం) చెవి కూడ ఒక్కటి. దీనికి ఈశ్వరుడు "శ్రీ గోకర్ణేశ్వరడు".

**ఆలయం:** శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత గోకర్ణేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో అశ్వత్థ వృక్షము (రావిచెట్టు), ధ్వజ స్థంబం, ప్రధానాలయం, చండీశ్వరుడు మరియు అయ్యప్ప స్వామి, సుబ్రహ్మణ్య స్వామి ఉపాలయాలు ఉంటాయి. అశ్వత్థ వృక్షము క్రింద సంతాన రుద్రేశ్వరుడు ఉంటాడు. స్వామి కృప వలన సంతాన సిద్ధి కలుగుతుంది అని భక్తుల విశ్వాసం. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ముఖ మండపం నందు ఆంజనేయ స్వామి కలరు. శ్రీ ఆంజనేయ స్వామి క్షేత్రపాలకుడు. అంతరాలయం నందు నందీశ్వరుడు, గణపతి స్వామి కలరు. గర్భాలయం నందు శ్రీ బాలా త్రిపుర సుందరీ సమేత గోకర్ణేశ్వర స్వామి వారి దర్శనం లభ్యమవుతుంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. ఆలయం నందు గ్రహ శాంతులు, హోమం, నామకరణం, అన్నప్రాశన, అక్షరాభ్యాసం మొదలగునవి జరుపుతారు. శ్రీ గోకర్ణేశ్వర లింగము, ఆరుద్ర నక్షత్రం (2 వ పాదం) చెందినది. ఈ రాశిలో జన్మించిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలాతోరణము జరుపుతారు. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. రుద్రహోమం, జరుగుతాయి. అర్ధరాత్రి లింగోద్భవం కార్యాక్రమం జరుపుతారు. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. ప్రతి మాస శివరాత్రి సందర్భముగా ప్రత్యేక అభిషేకాలు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** కోటిపల్లి నుంచి కాకినాడ పోవు బస్సులు (Via) ద్రాక్షారామం,హసన్ బాద, ఉండూరు, జగన్నాధగిరి, గొల్లపాలెం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 14 Kms. దూరంలో గొల్లపాలెం గ్రామం ఉంటుంది. యాత్రికులు గొల్లపాలెం లోని మార్కెట్టు బస్ స్టేజి దిగాలి. బస్ స్టాప్ కు సుమారు 300 meters దూరంలో (ఊరు లోనికి) శివాలయం ఉంటుంది.

* ద్రాక్షారామం నుంచి గొల్లపాలెం మీదగా కాకినాడ కు షేరింగ్ ఆటోలు కూడ దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన గొల్లపాలెం అర్చక స్వామి శ్రీ పూజ్యం మల్లిఖార్జున శర్మ, సెల్: 95159 91986 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ మాణిక్యాంబ సమేత భీమేశ్వరస్వామి

మిధునరాశి, ఆరుద్ర నక్షత్రం (3 వ పాదం)

వేములవాడ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ మాచరి సత్య కామేశ్వర పురుషోత్తమ శర్మ, సెల్ నెం. 99510 28619




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 21kms. దూరాన, తుల్యభాగ నదీకి ఉత్తర తీరాన వేములవాడ గ్రామం (Vemulawada) కలదు. రామచంద్రపురం - కాకినాడ రోడ్డు మార్గములో వేములవాడ బస్ స్టాప్ ఉంటుంది. వేములవాడ బస్ స్టాప్ నకు దక్షిణ దిశ నందు వేములవాడ గ్రామం ఉంటుంది. వేములవాడ ఊరు శివారులో శ్రీ మాణిక్యాంబ సమేత భీమేశ్వరస్వామి ఆలయం కలదు. శ్రీ భీమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**క్షేత్ర విశిష్టత:** ఆది కవిగా ఖ్యాతి గాంచిన భీమకవి జన్మ స్థలం వేములవాడ. ఇతడు అగ్రహారానికి చెందిన ఒక బ్రాహ్మణుడు. ద్రాక్షారామ భీమేశ్వర స్వామి అనుగ్రహముతో వాక్కు శుద్ధి పొందినాడు. భీమన్న తండ్రి సోమనాధామాత్యుడు. ఇతడు నియోగి బ్రహ్మణుడు. పుత్ర సంతానము కోసం పెక్కు దాన ధర్మలు చేసాడు. కాని సంతానము కలగలేదు. ఒకనాడ సంతాన వియోగంతో మరణం పొందుతాడు. అతని అయిదుగురు భార్యలు (వితంతువులు) ఒకనాడు ద్రాక్షారామ క్షేత్రం వెళ్ళి శ్రీ భీమేశ్వర స్వామిని దర్శించుకుంటారు. ఆ వితంతువులలో చిన్నది మాచమ్మ. బాల వితంతువు అయిన మాచమ్మ తన భర్త కోరిక తీర్చమని భీమేశ్వర స్వామిని ప్రార్ధిస్తుంది.
భీమేశ్వరుడు ఆమె అమాయక కోరిక పట్ల సంతోషించి, ఆమెకు సంతానం ప్రసాధించుతాడు. మాచమ్మ ఒక అబ్బాయికి జన్మనిచ్చింది. అతడు భీమన్నగా పెరిగాడు. సమాజం భీమన్నకు గౌరవం, విద్యనూ ఇవ్వలేదు. ఒక రోజు అతడు నా తండ్రి ఎవరు? అని తల్లిని అడిగాడు. తల్లి ఆదేశంతో భీమన్న ద్రాక్షారామ క్షేత్రం నందలి శ్రీ భీమేశ్వర స్వామిని ప్రార్ధించుతాడు. భీమేశ్వరుడు ప్రత్యక్షమై వాక్కు శుద్ధి ప్రసాధించుతాడు. శ్రీ ద్రాక్షారామ భీమేశ్వర కృపా కటాక్షములు పొందిన వేములవాడ భీమకవి అనేక రచనలు గావించినాడు. ఇతడు కవిగా ఉద్దండ కవితావాగ్ధురీణుడై, ఎందరో ప్రభువులను, రాజ్యాధినేతలను తన మృదుమధురపద పద్యపరిమళాలతో రంజింపచేసాడు (వేములవాడ భీమకవి జన్మ స్థలం/కాలము గురించి స్పష్టంగా ఆధారములు లేవు).

**ఆలయం:** వేములవాడ గ్రామం నకు దక్షిణ వైపు తుల్యభాగ నదీ ప్రవాహం ఉంటుంది. నదీ తీరాన శ్రీ మాణిక్యాంబ సమేత భీమేశ్వరస్వామి ఆలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమంలో భక్తులు ఆలయం పునర్నిర్మాణము జరిపించారు. ఆలయ ప్రాంగణము నకు నాలుగు దిక్కుల యందు ప్రవేశ ద్వారములున్నాయి. సాధరణంగా భక్తులు తుల్యభాగ నదీ తీరములో పవిత్ర స్నానములు ఆచారించి, దక్షిణ ద్వారం గుండా ఆలయ ప్రవేశం చేస్తారు. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, నందీశ్వరుడు, నవగ్రహ మంటపం, ప్రధానాలయం, చండీశ్వరుడు మొదలగునవి దర్శనమిస్తాయి. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా

ఉంటుంది. ముఖ మండపం నందు శ్రీ లక్ష్మీ నారాయణ స్వామి మరియు శ్రీ మాణిక్యాంబ అమ్మ వారు తూర్పు అభిముఖంగా కొలువుదీరినారు. వీరితో పాటు శ్రీ అయ్యప్ప స్వామి విగ్రహం కూడ కలదు. అంతరాలయం నందు చిన్న నంది, శ్రీ గణపతి, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, కళ్యాణ ఉత్సవ మూర్తుల దర్శనం లభ్యమవుతుంది. గర్భాలయం నందు శ్రీ భీమేశ్వరస్వామి కొలువుదీరినారు. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి వార్షిక కళ్యాణం జ్యేష్ట శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది.

మహాశివరాత్రి చాల వైభవంగా జరుగుతుంది. రాత్రికి లింగోద్భవ పూజ జరుగుతాయి. ప్రతి మాస శివరాత్రికి విశేష పూజలు ఉంటాయి. కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. మాఘ శుద్ధ పంచమి నాడు నవగ్రహ వార్షిక ఉత్సవాలు నిర్వహించుతారు. ముక్కోటి ఏకాదశి సందర్భముగా శ్రీ లక్ష్మీ నారాయణ స్వామికి ప్రత్యేక అర్చనలు ఉంటాయి. కార్తీక మాసంలో అయ్యప్ప స్వామి దీక్షలు, పూజలు జరుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో రామచంద్రాపురం RTC బస్ స్టాండ్ ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం నకు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

* రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి కాకినాడ కు బస్సులు చాల ఎక్కువుగా దొరుకుతాయి. రామచంద్రాపురం - కాకినాడ బస్సులు (via) వేలంగి, వేములవాడ, కరప మీదగా ఉంటాయి.

* వేములవాడ బస్ స్టాప్ నుంచి వేములవాడ గ్రామం నకు రోడ్డు ఉంది. వేములవాడ బస్ స్టాప్ నుంచి శ్రీ భీమేశ్వరస్వామి ఆలయ దూరం సుమారు 750 meters. వేములవాడ బస్ స్టాప్ నుంచి వేములవాడ గ్రామం మీదగా ప్రయాణం. కొంత దూరం కాలువ గట్టు పైన ప్రయాణం ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన వేములవాడ అర్చక స్వామి శ్రీ మాచరి సత్య కామేశ్వర పురుషోత్తమ శర్మ, సెల్ నెం. 99510 28619 గార్కి నా నమసుమాంజలి.



శ్రీ భద్రకాళి సమేత వీరేశ్వరస్వామి

మిధునరాశి, ఆరుద్ర నక్షత్రం (4 వ పాదం)

కూరాడ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ దొంతికుర్తి నాగబాబు, సెల్ నెం. 8978625124



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 18 kms. దూరాన, కూరాడ గ్రామం (Kurada) కలదు. రామచంద్రపురం - కాకినాడ రోడ్డు మార్గములో వేళంగి గ్రామం ఉంటుంది. వేళంగి గ్రామములో కూరాడ సెంటర్ ఉంటుంది. వేళంగి (కూరాడ సెంటర్) కు ఈశాన్యం దిశగా, సుమారు 02 kms. దూరాన, కూరాడ గ్రామం ఉంటుంది. కూరాడ గ్రామ పంచాయితీ ఆఫీస్ సమీపంలో శ్రీ భద్రకాళి సమేత వీరేశ్వరస్వామి వారి శివాలయం ఉంటుంది. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** కూరాడ గ్రామం లో శ్రీ భద్రకాళి సమేత వీరేశ్వరస్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమంలో భక్తులు ఆలయం పునర్నిర్మాణము జరిపించారు. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, నందీశ్వరుడు, ప్రధానాలయం, చండీశ్వరుడు మొదలగునవి దర్శనమిస్తాయి. ప్రధానాలయం పశ్చిమాభిముఖంగా ఉంటుంది. మండపం నందు ద్వారపాలకులు దర్శనమిస్తారు. ముఖ మండపం నందు శ్రీ భద్రకాళి అమ్మ వారి సన్నిధి ఉత్తర ముఖంగా ఉంటుంది. శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి వారి సన్నిధి దక్షిణ ముఖంగా ఉంటుంది. అంతరాలయం నందు శ్రీ గణపతి స్వామి వారి దర్శనం లభ్యమవుతుంది. గర్భాలయం నందు శ్రీ వీరేశ్వర స్వామి కొలువుదీరినారు. మూల విరాట్టుతో పాటు ఉత్సవమూర్తులు కూడ దర్శనమిస్తారు.

ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి వార్షిక కళ్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. మహాశివరాత్రి చాల వైభవంగా జరుగుతుంది. ప్రతి మాస శివరాత్రికి విశేష పూజలు ఉంటాయి. కార్తీక మాసంలో విశేష పూజలు, అభిషేకాలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. శరన్నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి.

ఆలయం నందు శ్రీ సుబ్రహ్మణ్య స్వామి కి విశిష్ట స్థానం ఉంది. ప్రతి మంగళవారం మరియు శనివారం నాడు శ్రీ సుబ్రహ్మణ్య స్వామి కి అభిషేకాలు విశేముగా ఉంటాయి. సంతానం కోసం మరియు యువతి/ యువకులు వివాహం కోసం శ్రీ సుబ్రహ్మణ్య స్వామిని ఆరాధించుతారు. ఆలయం నందు శ్రీ గణపతి స్వామి కి విశిష్టత కలదు. భక్తులు భక్తి శ్రద్ధలతో శ్రీ గణపతి స్వామిని ఆరాధించుతారు. స్వామికి నైవేద్యముగా బెల్లం ముక్కను సమర్పించుట ఆచారంగా వస్తుంది. శ్రీ భద్రకాళి సమేత

వీరేశ్వరస్వామి వారి కృపతో సుఖ, సంతోష, ఆయురోగ్య, విజయ, ఐశ్వర్య, భోగ భాగ్యములు కలుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో రామచంద్రాపురం RTC బస్ స్టాండ్ ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం నకు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

* రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి కాకినాడ కు బస్సులు చాల ఎక్కువుగా దొరుకుతాయి. రామచంద్రాపురం - కాకినాడ బస్సులు (via) వేళంగి, వేములవాడ, కరప మీదగా ఉంటాయి. యాత్రికులు వేలంగి (కూరాడ సెంటర్) బస్ స్టేజి దిగాలి. ఈ బస్ స్టేజిని నిత్యనందాపురం అని కూడ పిలుస్తారు.

* వేళంగి (కూరాడ సెంటర్) బస్ స్టాప్ నుంచి కూరాడ గ్రామం నకు రోడ్డు ఉంది. వేళంగి (కూరాడ సెంటర్) బస్ స్టాప్ నుంచి కూరాడ గ్రామం దూరం సుమారు 02 Kms. వీటి మధ్య ఆటోలు మాత్రమే ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన శ్రీ చంద్రమౌళి దినకర్, హైదరాబాద్ గార్కి నా నమసుమాంజలి.





శ్రీ పార్వతీ సమేత భీమేశ్వర స్వామి

మిధునరాశి, పునర్వసు నక్షత్రం (1 వ పాదం)

గొర్రిపూడి గ్రామం (భీమలింగపాడు)

**ఆలయ అర్చక స్వామి:** గొర్రిపూడి నివాసి అయిన శ్రీ Y.వీరబాబు, శ్రీ ఈశ్వర మెడికల్ షాప్, గొర్రిపూడి సెల్: 9949274443 & శ్రీ మహేశ్, గొర్రిపూడి, సెల్: 9948538577



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 18 kms. దూరాన, తుల్యభాగ నదీకి ఉత్తర తీరాన గొర్రిపూడి గ్రామం (Gorripudi) కలదు. ద్రాక్షారామం - కాకినాడ రోడ్డు మార్గములో గొర్రిపూడి సెంటర్ ఉంటుంది. గొర్రిపూడి సెంటర్ నుంచి తూర్పు దిశగా సుమారు 1 Kms. దూరాన (లోపలకి) గొర్రిపూడి గ్రామం ఉంటుంది. గొర్రిపూడి గ్రామం నుంచి మరో 1.5 Kms.దూరంలో భీమలింగపాడు అను ప్రాంతము ఉంటుంది. భక్తులు స్వామిని శ్రీ పార్వతీ సమేత భీమేశ్వరగా కొలుస్తారు. స్థానికులు " పాటిమీద గుడి " అని పిలుస్తారు. పాటి అంటే ఇసుక/మట్టి దిబ్బ అని అర్ధం. శ్రీ భీమేశ్వర లింగము, పునర్వసు నక్షత్రం (1 వ పాదం) చెందినది. ఈ రాశిలో జన్మించిన వారు ఈ క్షేత్రం నందలి భీమేశ్వర స్వామి దర్శించుట పుణ్యధాయకం. శ్రీ భీమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆకు పచ్చని పండ్లు వనాలు మధ్యన శ్రీ పార్వతీ సమేత భీమేశ్వర స్వామి ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, నంది విగ్రహం, ప్రధానాలయం ఉంటాయి. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ముఖ మండపం నందు నందీశ్వరుడు, సుబ్రహ్మణ్య స్వామి, గణపతి, అయ్యప్ప స్వామి ఉన్నారు. గర్భాలయం నందు శ్రీ భీమేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ పార్వతీ దేవి కొలువుదీరింది. స్వామి కృపతో సుఖ, సంతోష, ఆయిరోగ్య, విజయ, ఐశ్వర్య, భోగ భాగ్యములు కలుగుతాయి. ప్రస్తుతం ఆలయాన్నికి ప్రత్యేకముగా అర్చకులు లేరు. స్థానికంగా వున్న శ్రీ ధనరాజు మరియు ఆలయ కమిటీ సభ్యుల స్వామిని సేవించు చున్నారు. ప్రతి నిత్యం శ్రీ ధనరాజు గారు నియమ నిష్టలతో స్వామికి దూప, దీప, నైవేద్యాలు సమర్పించుట జరుగుతుంది. భీమేశ్వర కమిటీ/గొర్రిపూడి వారి ఆధ్వర్యంలో స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ పూర్ణిమ (హోళీ పూర్ణిమ) నాడు జరుగుతుంది. ఉదయం భక్తులు తుల్యభాగ నదీ రేవులో పవిత్ర స్నానాలు ఆచారించుతారు. పిమ్మట స్వామిని సేవించుతారు. హోళీ పౌర్ణమి నాటి రాత్రి తీర్ధ జాతర చాల వైభవంగా జరుగుతుంది. చుట్టు ప్రక్కల ప్రాంతాలు నుంచి భక్తులు పెద్ద ఎత్తున పాల్గొంటారు. మహా శివరాత్రి కూడ ఘనముగా జరుగుతుంది. కార్తీక మాసంలో చుట్టు ప్రక్కల ప్రాంతాల వారు వన భోజన కార్యక్రమాలలో పాల్గొంటారు. మిగిలన సందర్భములో ఆలయ ప్రాంతము నందు భక్తులు ఉండరు.

ఆలయ దర్శనం కోసం ఆలయ కమిటీ సభ్యులును మరియు శ్రీ ధనరాజు, సెల్: 9542414179 గారిని ముందుగా సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** కోటిపల్లి నుంచి కాకినాడ పోవు బస్సులు (Via) ద్రాక్షారామం, ఉండూరు, జగన్నాధగిరి, గొల్లపాలెం, గొర్రిపూడి మీదగా ప్రతి గంటకు ఉంటాయి. గొర్రిపూడి సెంటర్ బస్ స్టాప్ కు సుమారు 2.5 Kms దూరంలో (ఊరు లోనికి) పాటి మీద శివాలయం ఉంటుంది. దీనినే భీమలింగపాడు శివాలయం అని కూడ అంటారు. గొర్రిపూడి సెంటర్ బస్ స్టేజి లో ఆటోలు దొరుకుతాయి. యాత్రికులు రాను-పోను ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి.

* ద్రాక్షారామం నుంచి గొర్రిపూడి సెంటర్ మీదగా కాకినాడ కు షేరింగ్ ఆటోలు కూడ దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన గొర్రిపూడి నివాసి అయిన శ్రీ Y.వీరబాబు, శ్రీ ఈశ్వర మెడికల్ షాప్, గొర్రిపూడి సెల్: 9949274443 & శ్రీ మహేశ్, గొర్రిపూడి, సెల్: 9948538577 గార్కి నా నమసుమాంజలి.






శ్రీ పర్వతవర్ధని సమేత రామలింగేశ్వర స్వామి

మిధునరాశి, పునర్వసు నక్షత్రం (2 వ పాదం)

కరప గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ భాస్కర కుమార స్వామి, సెల్ నెం. 9912577332 సంప్రదించగలరు.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 22 Kms. దూరాన, కరప గ్రామం (Karapa) కలదు. రామచంద్రపురం - కాకినాడ రోడ్డు మార్గములో కరప బస్ స్టాప్ ఉంటుంది. కరప బన్నీ కాంప్లెక్స్ సమీపం లో శ్రీ పర్వతవర్ధని సమేత రామలింగేశ్వర ఆలయం కలదు. శ్రీ రామలింగేశ్వర లింగము, పునర్వసు నక్షత్రం (2 వ పాదం) చెందినది. పునర్వసు నక్షత్రం నందలి 2 వ పాదము లో జన్మంచిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు.

శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** కరప గ్రామం నందు శ్రీ పర్వతవర్ధని సమేత రామలింగేశ్వర ఆలయం పశ్చిమాభిముఖంగా ఉంటుంది. ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమంలో భక్తులు ఆలయం పునర్నిర్మాణము జరిపించారు. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, కళ్యాణ మండపం, నవగ్రహ మంటపం, ప్రధానాలయం, చండీశ్వరుడు మొదలగునవి దర్శనమిస్తాయి. ముఖ మండపం నందు శ్రీ నందీశ్వర స్వామి, ద్వారపాలకులు ఉంటారు. అంతరాలయం నందు చిన్న నంది, శ్రీ గణపతి, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, కళ్యాణ ఉత్సవ మూర్తుల దర్శనం లభ్యమవుతుంది. గర్భాలయం నందు శ్రీ రామలింగేశ్వర స్వామి కొలువుదీరినారు. వామ భాగం నందు శ్రీ పర్వతవర్ధని దేవి కొలువుదీరింది. స్వామి కృపతో సుఖ, సంతోష, ఆయురోగ్య, విజయ, ఐశ్వర్య, భోగ భాగ్యములు కలుగుతాయి. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి వార్షిక కళ్యాణం జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. మహాశివరాత్రి చాల వైభవంగా జరుగుతుంది. ప్రతి మాస శివరాత్రికి విశేష పూజలు ఉంటాయి. కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. శరన్నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. నక్షత్ర శాంతి కోసం ఆలయ అర్చక స్వామి: శ్రీ భాస్కర కుమార స్వామి, సెల్ నెం. 9912577332 సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో రామచంద్రాపురం RTC బస్ స్టాండ్ ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం నకు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

* రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి కాకినాడ కు బస్సులు చాల ఎక్కువుగా దొరుకుతాయి. రామచంద్రాపురం - కాకినాడ బస్సులు (via) వేలంగి, వేములవాడ, కరప మీదగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు. ఆలయ Photos అందించిన పబ్బినీడి చక్రరావు గార్కి నా నమసుమాంజలి. ఆలయ సమాచారం అందించిన శ్రీ కామేశ్వర శర్మ గార్కి ధన్యవాదాలు.



శ్రీ భ్రమరాంబా సమేత శ్రీ మల్లేశ్వర స్వామి

మిధునరాశి, పునర్వసు నక్షత్రం (3 వ పాదం)

అరట్లకట్ట గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొంతేటి శివశర్మ (శివ), సెల్ నెం. 9849313133



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 28 kms. దూరాన అరట్లకట్ట గ్రామం (Aratlakatta) కలదు. రామచంద్రపురం - కాకినాడ రోడ్డు మార్గములో కరప ఉంటుంది. కరప నకు ఉత్తరం-వాయువ్యం దిశ నందు గల కాకినాడ కెనాల్ రోడ్ కు సమీపంలో అరట్లకట్ట గ్రామం ఉంటుంది. కరప జంక్షన్ నంచి అరట్లకట్ట గ్రామం మీదగా బ్రాంచి రోడ్డు మార్గము కలదు. అరట్లకట్ట ఊరులో శ్రీ భ్రమరాంబా సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం కలదు. శ్రీ మల్లేశ్వర లింగము, పునర్వసు నక్షత్రం (3 వ పాదం) చెందినది. పునర్వసు నక్షత్రం నందలి 3 వ పాదము లో జన్మంచిన వారికి శాంతులు నిర్వహించుతారు. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** పూర్వం పెద్దాపురం సంస్థానాధీశుల ఆధీనములో అరట్లకట్ట గ్రామం ఉండేది. ఇచ్చట సగము కూలిపోయిన కోట గోడలు (అరకోట గోడలు) ఉన్న కారణంచే అరకోట గ్రామంగా పిలిచేవారుట! అరకోట గ్రామప్రజలు కట్లమ్మ అను గ్రామ దేవత కొలుచేవారు. చుట్టు ప్రక్కల ప్రాంతము వారు ' అర కోట కట్లమ్మ ' గా పిలిచేవారు. అర కోట క్రమముగా 'అరట్లకట్ట' గా వాడుకలోనికి వచ్చింది. అరట్లకట్ట గ్రామం లోని శ్రీ భ్రమరాంబా సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. 17 వ శతాబ్దం నందు పెద్దాపురం సంస్థానాధీశులు ఆలయం పునర్నిర్మాణము జరిపించారు. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రవేశం ముఖద్వారం నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ప్రధానాలయం, చండీశ్వరుడు, మహా గణపతి దర్శనమిస్తారు. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. మేధా దక్షిణామూర్తి దక్షిణ ముఖంగా ఉంటాడు. ముఖ మండపం నందు నందీశ్వరుడు, దత్తాత్రేయ స్వామి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి కొలువై ఉంటారు. అంతరాలయం నందు శ్రీ లక్ష్మీ గణపతి దర్శనం లభ్యమవుతుంది. గర్భాలయం నందు శ్రీ భ్రమరాంబా సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఏక పీఠం పైన కొలువుదీరినారు. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి వార్షిక కళ్యాణం మాఘ శుద్ధ ఏకాదశి (భీష్మ ఏకాదశి) నాడు జరుగుతుంది. మహాశివరాత్రి చాల వైభవంగా జరుగుతుంది. ప్రతి మాస శివరాత్రికి విశేష పూజలు ఉంటాయి. స్వామి జన్మ నక్షత్రం అయిన ఆరద్ర సందర్భముగా మహన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం జరుగుతుంది. పునర్వసు నక్షత్రం సందర్భముగా శ్రీ రుద్ర హోమం నిర్వహించుతారు. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. లక్ష పత్ర పూజ నిర్వహహంచుతారు. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా

జరుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో రామచంద్రాపురం RTC బస్ స్టాండ్ ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం నకు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

* రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి కాకినాడ కు బస్సులు చాల ఎక్కువుగా దొరుకుతాయి. రామచంద్రాపురం - కాకినాడ బస్సులు (via) కరప మీదగా ఉంటాయి.

* కరప నుంచి కరకుదురు గ్రామం నకు ఆటోలు (via) Z.భావారం, అరట్లకట్ట మీదగా ఉంటాయి. అరట్లకట్ట రాను - పోను ఆటోలు ఏర్పాట్లు చేసుకోవడం సౌక్యముగా ఉంటుంది. కరప - అరట్లకట్ట మధ్య దూరం సుమారు 05 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన అరట్లకట్ట అర్చక స్వామి శ్రీ కొంతేటి శివశర్మ (శివ), సెల్ నెం. 9849313133 గార్కి నా నమసుమాంజలి.








జ్యోతిష చక్రంలో కర్కాటక రాశి **నాలుగవది.**

ఈ రాశి అందు ఉచ్ఛ స్థితిని, కుజుడు నీచ స్థితిని పొందుతాడు.

దీనిని సమరాశి, జలరాశి, శుభ రాశి, స్త్రీరాశి, సౌమ్య రాసి, చరరాశి, కీటక రాశిగా వ్యవహరిస్తారు.

వృషభరాశికి **అధిపతి చంద్రుడు.**

కర్కాటక రాశి 9 ఆలయాలు ఉంటాయి.

**పునర్వసు** నక్షత్రంలోని 4 వ పాదము

**పుష్యమి** నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

**మరియు ఆశ్రేష** నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

9 ఆలయాలు కలిసి **కర్కాటక** రాశిగా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి

కర్కాటకరాశి, పునర్వసు నక్షత్రం (4 వ పాదం)

యనమదల గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** అయిలూరి వెంకట సత్య శ్రీనివాస్, సెల్ నెం. 9848719299



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఉత్తరం దిశగా, సుమారు 11 kms. దూరాన యనమదల గ్రామం (Yanamadala) కలదు. ద్రాక్షారామం - రామచంద్రపురం రోడ్డు మార్గములో రాజగోపాల సెంటర్ ఉంటుంది. రాజగోపాల సెంటర్ నకు ఈశాన్యం దిశగా, సుమారు 5.5 Kms. దూరములో యనమదల గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి ఆలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. పునర్వసు నక్షత్రం నందు జన్మించిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** యనమదల గ్రామం లోని శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్దంబం, ప్రధానాలయం, చండీశ్వరుడు, కళ్యాణ మండపం ఉంటాయి. ముఖ మండపం నందు నందీశ్వరుడు, గణపతి,
కుమార సామి (సుబ్రహ్మణ్య స్వామి) ఉంటారు. అంతరాలయం యొక్క ద్వారం నకు నందుడు మరియు కాళుడు అను ద్వారపాలకులు ఉంటారు. గర్భాలయం నందు శ్రీ మల్లేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ పార్వతీ దేవి కొలువుదీరింది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం చైత్ర బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. మహా శివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు జరుగుతాయి. లింగోద్భవ కాలం వరకు అభిషేకాలు ఉంటాయి. మహా శివరాత్రి నాడు అన్న సమారాధన సేవ జరుగుతుంది. శరన్నవరాత్రులు విశేషముగా ఉంటుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. సుబ్బారాయుడు షష్ఠి దర్శనాలు విశేషముగా జరుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 6 kms. దూరంలో రాజగోపాల సెంటర్ (రామచంద్రపురం) ఉంటుంది. ద్రాక్షారామం నుంచి బస్సులు / ఆటోలు దొరుకుతాయి. * రాజగోపాల సెంటర్ నుంచి యనమదల గ్రామం కు ఆటోలు దొరుకుతాయి.

* కాకినాడ - రామచంద్రపురం బస్సులు (via) కరప, చోడవరం మీదగా ఉంటాయి. రామచంద్రపురం RTC bus complex నుంచి రాజగోపాల సెంటర్ కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 500 meters మాత్రమే.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన యనమదల - శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన అయిలూరి వెంకట సత్య శ్రీనివాస్, సెల్ నెం. 9848719299 గార్కి నా నమసుమాంజలి.



శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి

కర్కాటకరాశి, పుష్యమి నక్షత్రం (1 వ పాదం)

కాపవరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ దెందులూరి రామభద్రి రాజు శర్మ. సెల్ నెం.9182096125



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఉత్తర - ఈశాన్యం దిశగా, సుమారు 14 kms. దూరాన, కాపవరం (Kapvaram) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైది. కాల క్రమములో గ్రామస్తుల సహాయంతో శివాలయం పునర్నార్మించారు. ఆలయ ప్రాంగణము చాల విశాలముగా ఉంటుంది. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయంతో పాటు ధ్వజస్తంభం, చండీశ్వరుడు, రామాలయం మొదలగునవి ఉంటాయి. ముఖ మండపం నందు నందీశ్వరుడు, ద్వారపాలకులు ఉంటారు. వీరితో పాటు గణపతి, నటరాజ స్వామి, గజలక్ష్మీ ప్రతిమలను చూడగలము. అంతరాలయం నందు చిన్న నంది విగ్రహం, గణపతి కలరు. గర్భాలయంలో శ్రీ వీరేశ్వర లింగము మరియు శ్రీ భద్రకాళి అమ్మవారు ఏక పీఠం పైన కొలువైయున్నారు. స్వామిని సేవించిన వారు విశేష ఫలాలను పొందగలరు అని భక్తుల విశ్వాసం. స్వామి కృపతో సుఖ, సంతోష, ఆయురోగ్య, విజయ, ఐశ్వర్య, భోగ భాగ్యములు కలుగుతాయి. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం చైత్ర శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. గ్రామోత్సవం అనంతరం, గ్రామ స్త్రీలు స్వామికి ఆవు పెరుగును నైవేద్యంగా సమర్పించుతారు. కార్తీక బహుళ అష్టమి/నవమి తిధి, శనివారం నాడు లక్ష పత్రి పూజ నిర్వహించుతారు.

శరన్నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. రాత్రి లింగోద్భవ అభిషేకాలు కూడ ఉంటాయి. శ్రావణ మాసంలో సామి వారికి శాంతి కళ్యాణం, అమ్మవారికి శాకాంబరి అలంకారము జరుపుతారు. సంక్రాంతి, దీపావళీ మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా ఉంటాయి. ప్రతి పౌర్ణమి నాడు శ్రీ భద్రకాళి అమ్మవారికి అభిషేకాలు, కుంకమార్చనలు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం నుంచి గోల్లపాలెం మీదగా కాకినాడ కు మరో రోడ్డు మార్గం ఉంది.  రాజగోపాల సెంటర్ (రామచంద్రపురం), వెల్ల, కాపవరం సెంటర్, ఉండూరు బ్రిడ్జి, జగన్నాధగిరి, గోల్లపాలెం, నడకుదురు మీదగా రోడ్డు ఉంటుంది. వెల్ల గ్రామం - ఉండూరు బ్రిడ్జి మధ్య కాపవరం సెంటర్ ఉంటుంది. కాపవరం సెంటర్ నుంచి వేళంగి గ్రామం నకు పోవు రోడ్డు మార్గములో కాపవరం గ్రామం ఉంటుంది. కాపవరం సెంటర్ నుంచి కాపవరం గ్రామం మధ్య దూరం ఒక Km. గా ఉంటుంది.

* ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 6 kms. దూరంలో రాజగోపాల సెంటర్ (రామచంద్రపురం) ఉంటుంది. ద్రాక్షారామం నుంచి బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

* రాజగోపాల సెంటర్ నుంచి  వెల్ల గ్రామం కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.* వెల్ల గ్రామం లో ఆటోలు ఉంటాయి. కాపవరం నకు రాను- పోను ఆటో ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన కాపవరం - శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వరాలయం అర్చక స్వామి అయిన శ్రీ దెందులూరి రామభద్రి రాజు శర్మ. సెల్ నెం.9182096125 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ భద్రకాళీ సమేత వీరేశ్వరస్వామి

కర్కాటకరాశి, పుష్యమి నక్షత్రం (2 వ పాదం)

సిరిపురం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ చాగంటిపాటి వీరవెంకట సత్యనారాయణగారు సెల్: 9502277791 & 62812 84879.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 13 kms. దూరాన, సిరిపురం (Siripuram) గ్రామం ఉంటుంది. కాకినాడ జిల్లా, కరప మండలంకు చెందినది. రామచంద్రపురం - కరప రోడ్డులో వేళంగి ఉంటుంది. వేళంగి నుండి కాపవరం వెళ్ళు మార్గంలో జీ. భావారం కలదు. జీ. భావారం నుంచి సిరిపురం కు సుమారు 1.5 Kms. లోపలకి మార్గం ఉంది. వేళంగి నుంచి సిరిపురం కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. సిరిపురం నందు శ్రీ భద్రకాళీ సమేత వీరేశ్వరస్వామి (శివాలయం) ఉంటుంది. శ్రీ వీరేశ్వరస్వామి లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయము చాల ప్రాచీనమైనది. ఆలయ ప్రాంగణంలో సుబ్రహ్మణ్యేశ్వరుడు కొలువై ఉన్నారు. అంతరాలయంలో గణపతి కలడు. వీరేశ్వరస్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవము, చైత్రశుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి నిర్వహించబడతాయి. ఆలయము పుష్యమి నక్షత్రం రెండవ పాదమునకు చెందినది. స్వామిని దర్శించి & అర్చన, అభిషేకములు నిర్వర్తించిన యెడల పుష్యమి నక్షత్రంవారు వారి గ్రహపీడలు తొలగి శుభ ఫలితములు పొందగలరని భక్తుల విశ్వాసము. శివాలయం ప్రక్కన శ్రీ కోదండ రామాలయం కలదు.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ బాలాత్రిపుర సుందరీ సమేత భవానీశంకర స్వామి

కర్కాటకరాశి, పుష్యమి నక్షత్రం (3 వ పాదం)

వేళంగి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** బ్రహ్మశ్రీ దొంతికుర్తి ఈశ్వరశర్మగారు మరియు మణికంఠ కుమార్ , సెల్ నెం : 99896 26526.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 16 kms. దూరాన, వేళంగి (Velangi) గ్రామం ఉంటుంది. ఇది కాకినాడ జిల్లా, కరప మండలంకు చెందినది. రామచంద్రపురం - కరప రోడ్డులో వేళంగి బస్ స్టాప్ ఉంటుంది. వేళంగి నందు శ్రీ బాలాత్రిపుర సుందరి సమేత భవానీశంకరస్వామి (శివాలయం) కలదు. శ్రీ భవానీశంకర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. కాకినాడ జిల్లా, కరప మండలంకు చెందిన వేళంగి గ్రామం నందు శ్రీ బాలాత్రిపుర సుందరీ సమేత భవానీశంకరస్వామి ఆలయం కలదు. ఇది కర్కాటకరాశి, పుష్యమి నక్షత్రం, 3 వ పాదం చెందిన శివాలయం. పుష్యమి నక్షత్రం నందు జన్మించిన వారికి అర్చనలు, అభిషేకములు జరుగుతాయి. రామచంద్రపురం నుంచి కాకినాడ వైపు పోవు బస్సులు వేళంగి మీదగా ఉంటాయి. వేళంగి బస్సు స్టాపునకు దక్షిణంగా సుమారు 800 మీటర్లు దూరాన, తుల్యభాగ నదీ తీరం లో భవానీశంకర స్వామి ఆలయం ఉంటుంది.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. పిఠాపురం మహారాజావారు మరియు గ్రామస్థుల సహకారంతో ఆలయ పునరుద్ధరణ జరిగినది. ఆలయంలో గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, నాగబంధము కలవు. శ్రీ భవానీశంకరస్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవములు మాఘశుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి అత్యంత వైభవోపేతంగా జరుగుతాయి. ఆలయం పుష్యమి నక్షత్రం మూడవ పాదమునకు చెందినది. పుష్యమి నక్షత్రం వారు శ్రీ భవానీశంకర స్వామిని దర్శించి అర్చన, అభిషేకములు నిర్వర్తించిన యెడల వారి గ్రహపీడలు తొలగి శుభ ఫలితములు పొందగలరని భక్తుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం - కాకినాడ బస్సులు (Via) వేళంగి మీదగా ఉంటాయి. బస్సు స్టాపునకు దక్షిణంగా సుమారు 800 meters దూరాన, తుల్యభాగ నదీ తీరం లో భవానీశంకర స్వామి ఆలయం ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ బాలాత్రిపుర సుందరి సమేత సోమేశ్వర స్వామి

కర్కాటకరాశి, పుష్యమి నక్షత్రం (4 వ పాదం)

ఒదూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ సతీష్ సెల్: 96403 52052.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 13 kms. దూరాన, ఒదూరు (Oduru) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రామచంద్రపురం మండలంకు చెందినది. రామచంద్రపురం - కరప రోడ్డులో ఒదూరు బస్ స్టాప్ ఉంటుంది. రోడ్డుకు కొంత లోపలకి ఒదూరు గ్రామం కలదు. ఒదూరు నందు శ్రీ బాలాత్రిపుర సుందరి సమేత సోమేశ్వరస్వామి (శివాలయం) కలదు. శ్రీ సోమేశ్వరస్వామి లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**స్థల పురాణం:** ఒదూరుకి మరో పేరు ఓంకారపురం. దీని గురించి శ్రీనాథ మహాకవి రచించిన "భీమఖండం" అను కావ్యంలో ఉంది. వ్యాస మహర్శి తన అపరాదం వలన కాశీక్షేత్రంను విడిచి పెట్టి తన శిష్యులతో కలసి భీమేశ్వరుని కన్న ఉత్తమమైన దేవుడు, ద్రాక్షారామం కన్న మిన్నయైన పుణ్యక్షేత్రం లేదని తలిచి, ఆ దివ్య దర్శనముకై బయలుదేరి మొదటి పూరి జగన్నాధాలయంను దర్శించి, మార్గ మధ్మన గల శ్రీకూర్మం, సింహచలం, పిఠాపురం, సామర్లకోట, సర్పవరం క్షేత్రాలు దర్శించిన తరువాత తుల్యభాగ నదీతీరాన గల సాంపరాయణపురం (సంపర) గ్రామంను దర్శించిన పిమ్మట దక్షవాటికకు బయలుదేరగా, ఓంకారపురం క్షేత్రం (ఒదూరు) నందు అగస్థ్యుడు తన భార్య లోపాముద్రి సమేతంగా వ్యాసులవారిని కలుసుకొని కుశల ప్రశ్నలు వేసుకుని ఓంకారపురం క్షేత్రం నందు వున్న బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను వారు స్తుతించిరి. వ్యాస, వైశంపాయన, అగస్త్య ఋషీశ్వరులు సంచరించిన పుణ్యభూమి ఓంకారపురం క్షేత్రం (ఒదూరు).

శ్రీ బాలాత్రిపుర సుందరి సమేత సోమేశ్వరస్వామి (శివాలయం) చాల ప్రాచీనమైనది. ఆలయ ప్రాంగణంలో శ్రీ రుక్మిణి, సత్యభామా సమేత వేణుగోపాలస్వామి వారి ఆలయం మరియు శ్రీదేవి, భూదేవి సమేత వేంకటేశ్వరస్వామి వారి ఆలయం కలవు. శ్రీ సోమేశ్వరస్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ బహుళ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. ఇదే రోజున వేణుగోపాలస్వామి మరియు వేంకటేశ్వర స్వామివారి (ముగ్గురు దేవతామూర్తులు) కళ్యాణ ఉత్సవములు జరుగుట విశేషం. సోమేశ్వరస్వామి ఆలయంలో “అఖండజ్యోతి” నిరంతరం వెలుగుతుంది. ఇది మరో విశేషం. శరన్నవరాత్రులు ఘనంగా నిర్వహించ బడతాయి. క్షేత్రము కర్కాటకరాశి యందలి పుష్యమి నక్షత్రం నాలుగవ పాదమునకు చెందినది. పుష్యమి జాతకులు శ్రీ బాలాత్రిపుర సుందరి సమేత సోమేశ్వర స్వామిని దర్శించి అర్చన, అభిషేకములు నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు లభించునని భక్తజనుల విశ్వాసము. ఒదూరు, శ్రీ సోమేశ్వర స్వామి.

ఒదూరు గ్రామంలో సీతారామచంద్రస్వామి ఆలయం, ఆంజనేయస్వామివారి ఆలయం మరియు షిరిడి సాయినాధు మందిరం కూడా వున్నాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి రామచంద్రపురం కు బస్సులు ఉంటాయి. రామచంద్రపురం నుంచి కాకినాడ వైపు పోవు బస్సులు (Via) ఒదూరు, వేళంగి మీదగా ఉంటాయి. ఒదూరు బస్సు స్టాపునకు కొంత లోపలకి శ్రీ బాలాత్రిపుర సుందరి సమేత సోమేశ్వరస్వామి (శివాలయం) ఉంటుంది.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.





శ్రీ ఉమా సమేత మాండేశ్వర స్వామి

కర్కాటకరాశి, ఆశ్రేష నక్షత్రం (1 వ పాదం)

దోమాడ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పుల్లేటికుర్తి సోమేశ్వర శర్మ, సెల్ నెం. 7995435863



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 28 kms. దూరాన దోమాడ గ్రామం (Domada) కలదు. రామచంద్రపురం - సామర్లకోట రోడ్డు మార్గములో గొల్లల మామిడాడ జంక్షన్ ఉంటుంది. గొల్లల మామిడాడ జంక్షన్ కు తూర్పు-ఈశాన్యం దిశగా సుమారు 8Kms. దూరంలో దోమాడ గ్రామం ఉంటుంది. గొల్లల మామిడాడ జంక్షన్ నుంచి కాకినాడ కు రోడ్డు మార్గము కలదు. కాకినాడ రోడ్డు మార్గములో పెదపూడి గ్రామం దాటిన తర్వాత దోమాడ పంచాయితీ ఆఫీస్ కు సమీపం లో శ్రీ ఉమా సమేత మాండేశ్వర స్వామి ఆలయం ఉంటుంది. శ్రీ మాండేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** మాండవ్య మహర్షి మహాతపస్వి. ధర్మ స్వరూపుడు. కాలి నడకతో భూలోకములోని సర్వ పుణ్య క్షేత్రాలాన్నీ సందర్శించిన మహర్షి. అతడు యాత్రలో భాగముగా దోమాడ గ్రామ ప్రాంతము ఒక శివ లింగమును ప్రతిష్టించి ఆరాధించాడు. ఆ శివలింగము శ్రీ మాండేశ్వ స్వామిగా ఖ్యాతి పొందినాడు.

పూర్వం దోమాడ గ్రామం పాడిపంటలతో పచ్చగా కళకళలాడుతూ ఉండేది. పచ్చని పంట పొలాలు మధ్యన గల శివాలయం నందలి శివలింగము భక్తుల కోరికలు తీర్చే కల్పతరువుగా ప్రసిద్ధి చెందింది. కొంత కాలము తర్వాత ప్రకృతి వైపరీత్యాలు కారణముగా శివాలయం ధ్వంసం అయింది. బహిరంగ మిగిలన శివలింగాన్ని స్థానికులు భక్తి శ్రద్ధలతో ఆరాధించేవారు. దీనిని శ్రీ మాండేశ్వర దిమ్మగా పిలిచేవారు. దీని ప్రక్కనే పంట పొలాలుకు పోవు ఎద్దుల బండి రహదారి ఉండేది. ఒకనాడు ఒక ఎద్దుల బండి చక్రం వలన ఆ దిమ్మకు ( శ్రీ మాండేశ్వర శివలింగము) నష్టం జరిగింది. శిథిలమైన శివలింగము వలన ఊరుకు అరిష్టంగా భావించి, సమీపంలో గల గంగా ప్రవాహం నందు (కాలువలో) నిమజ్జనం చేసారు. ఆ నాటి నుంచి దోమాడ గ్రామంలో కరువు కాటకాలు ఏర్పడాయి. ఆచార్యపురుషులు సలహాతో గ్రామస్థులు కాశీ నుంచి ఒక శివలింగాన్ని తెప్పించి ప్రతిష్ట గావించారు.

దోమాడ గ్రామం లోని శ్రీ ఉమా సమేత మాండేశ్వర స్వామి ఆలయం ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంభం, ప్రధానాలయం, చండీశ్వరుడు నవగ్రహ మండపం మొదలగునవి ఉంటాయి. ప్రధానాలయం తూర్పు అభిముఖముగా ఉంటుంది. ముఖమండపం నందు నంది విగ్రహం, గణపతి, నాగ బంధము (సుబ్రహ్మణ్యేశ్వరుడు) ద్వారపాలకులు ఉంటారు. అంతరాలయం నందు వినాయకుడు దర్శనమిస్తారు. గర్భాలయం నందు శ్రీ మాండేశ్వర లింగము మరియు శ్రీ ఉమా దేవి కొలువుదీరినారు. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం మాఘ బహుళ ఏకాదశి నాడు

జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమికి జ్వాలతోరణం జరుగుతుంది. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు & లింగోద్భవ కాల పూజలు ఉంటాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 8 kms. దూరంలో రామచంద్రాపురం bus complex ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం కు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి సామర్లకోట బస్సులు ప్రతి గంటకు ఉంటాయి. బస్ సర్వీసులు గొల్లల మామిడాడ, బిక్కవోలు మీదగా ప్రయాణం చేస్తాయి.

గొల్లల మామిడాడ నుంచి దోమాడ గ్రామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి. ఆటోలు రాను - పోను ఏర్పాట్లు చేసుకోవడం సౌక్యముగా ఉంటుంది. గొల్లల మామిడాడ - దోమాడ మధ్య దూరం సుమారు 8 Kms,

* కాకినాడ - గొల్లల మామిడాడ ఆటోలు (via) ఇంద్రపాలెం, రామేశ్వరం, దోమాడ, పెదపూడి మీదగా ఉంటాయి. కాకినాడ - దోమాడ మధ్య దూరం 13 Kms. కాకినాడ బాల చెరువు నుంచి ఆటోలు బయలుదేరుతాయి.

* సామర్లకోట - పెదపూడి మధ్య ఆటోలు దొరుకుతాయి మరియు పెదపూడి నుంచి దోమాడ మీదగా కాకినాడ ఆటోలు దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన దోమాడ - శ్రీ మాండేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ పుల్లేటికుర్తి సోమేశ్వర శర్మ, సెల్ నెం. 7995435863 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ శ్యామలాంబ సమేత శ్రీ సోమేశ్వర స్వామి

కర్కాటకరాశి, ఆశ్లేష నక్షత్రం (2 వ పాదం)

పెదపూడి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొమాళ్ళపల్లి సత్య వీరవెంకట్రావు, సెల్ నెం. 9959039975



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 27 kms. దూరాన పెదపూడి గ్రామం (Pedapudi) కలదు. రామచంద్రపురం - సామర్లకోట రోడ్డు మార్గములో గొల్లల మామిడాడ జంక్షన్ ఉంటుంది. గొల్లల మామిడాడ జంక్షన్ కు తూర్పు-ఈశాన్యం దిశగా సుమారు 7Kms. దూరంలో పెదపూడి గ్రామం ఉంటుంది. గొల్లల మామిడాడ జంక్షన్ నుంచి కాకినాడ కు రోడ్డు మార్గము ఉంది. కాకినాడ రోడ్డు మార్గములో పెదపూడి గ్రామం తాలుకా MRO office దాటిన తర్వాత శ్రీ శ్యామలాంబ సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం వస్తుంది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** పెదపూడి గ్రామం లోని శ్రీ శ్యామలాంబ సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రవేశం గాలిగోపురం క్రింద నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, వినాయకుడు, నందీశ్వరుడు, ప్రధానాలయం, చండీశ్వరుడు నవగ్రహ మండపం మొదలగునవి ఉంటాయి. ముఖమండపం నందు చిన్న నంది విగ్రహం, ద్వారపాలకులు ఉంటారు. అంతరాలయం నందు వినాయకుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు దర్శనమిస్తారు. గర్భాలయం నందు శ్రీ సోమేశ్వర లింగము మరియు శ్రీ శ్యామలాంబ దేవి కొలువుదీరినారు. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. తిరునాళ్ళ, జాగరణ వైభవంగా ఉంటుంది.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 8 kms. దూరంలో రామచంద్రాపురం bus complex ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం కు బస్సులు / ఆటోలు దొరుకుతాయి. రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి సామర్లకోట బస్సులు ప్రతి గంటకు ఉంటాయి. బస్ సర్వీసులు గొల్లల మామిడాడ, బిక్కవోలు మీదగా ప్రయాణం చేస్తాయి.

* గొల్లల మామిడాడ నుంచి పెదపూడి గ్రామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి. ఆటోలు రాను - పోను ఏర్పాట్లు చేసుకోవడం సౌక్యముగా ఉంటుంది. గొల్లల మామిడాడ - పెదపూడి మధ్య దూరం సుమారు 7 Kms,

* కాకినాడ - గొల్లల మామిడాడ ఆటోలు (via) ఇంద్రపాలెం, దోమాడ, పెదపూడి మీదగా ఉంటాయి. కాకినాడ - పెదపూడి మధ్య దూరం 14 Kms. ఆటోలు కాకినాడ బాల చెరువు నుంచి బయలుదేరుతాయి.

* సామర్లకోట - పెదపూడి మధ్య ఆటోలు దొరుకుతాయి.

ఆలయ సమాచారం & Photos అందించిన పెదపూడి - శ్రీ సోమేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొమాళ్ళపల్లి సత్య వీరవెంకట్రావు, సెల్ నెం. 9959039975 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి

కర్కాటకరాశి, ఆశ్రేష నక్షత్రం (3 వ పాదం)

గంగ్రేడు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొమాళ్ళపల్లి వీరభద్రం, సెల్ నెం. 9949139638



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఉత్తరం దిశగా, సుమారు 20 kms. దూరాన గంగ్రేడు గ్రామం (Grandredu) కలదు. రామచంద్రపురం - సామర్లకోట రోడ్డు మార్గములో గొల్లల మామిడాడ జంక్షన్ ఉంటుంది. గొల్లల మామిడాడ జంక్షన్ కు దక్షిణ-ఆగ్నేయం దిశగా సుమారు 2.8 Kms. దూరంలో గంగ్రేడు గ్రామం ఉంటుంది. క్షేత్రం నందు శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం కలదు. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** గంగ్రేడు గ్రామం లోని శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయ ప్రవేశం పశ్చిమ గాలిగోపురం క్రింద నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, నాగ బంధం, ప్రధానాలయం, చండీశ్వరుడు, తులసికోట మొదలగునవి ఉంటాయి. ముఖమండపం నందు నందీశ్వరుడు, ద్వారపాలకులు, శ్రీ ఉమా దేవి సన్నిధి కలవు. అమ్మ వారి సన్నిధి దక్షిణాభిముఖంగా ఉంటుంది. అంతరాలయం విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు దర్శనమిస్తారు. గర్భాలయం నందు శ్రీ సోమేశ్వర లింగము దర్శనమిస్తాంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది.

మహాశివరాత్రి నాడు విశేష అభిషేకాలు ఉంటాయి. అర్ధరాత్రి లింగోద్భవం కార్యాక్రమం జరుపుతారు. మహాశివరాత్రి సందర్భముగా నాలుగు జాములు ఆలయ దర్శనం జరుగుతుంది. మహాశివరాత్రి నాటి సాయంత్రం దీపోత్సవం జరుగుతుంది. శరన్నవరాత్రులు జరుగుతాయి.
అన్నపూర్ణ దేవి అవతారం సందర్భముగా అమ్మ వారిని కూరగాయలతో 'శాకంబరి' దేవిగా అలంకరించుతారు. మరసటి రోజు ఆ కూరగాయలతో వంటలు తయారుచేసి, భక్తులుకు అన్నదానం (కదంబాన్ని) జరుపుతారు. కార్తీక మాసంలో విశేష పూజలు ఉంటాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. ధనుర్మాసం నందు 'తీర్ధ బిందె' కార్యక్రమం ఉంటుంది. ధనుర్మాసం (30 రోజులు) నందు గ్రామ ఊరేగింపు కార్యక్రమం జరుగుతాయి. సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. ప్రతి నెల మాస శివరాత్రి పూజలు జరుగుతాయి. భీష్మా ఏకాదశి నాడు వార్షికోత్సవం వేడుకులు జరుగుతాయి. ఆలయ పూజ సమాచారం కోసం ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొమాళ్ళపల్లి వీరభద్రం, సెల్ నెం. 9949139638 గారిని సంప్రదించగలరు.

శ్రీ భీమేశ్వర లింగము, ఆశ్రేష నక్షత్రం (3 వ పాదం) చెందినది. ఆశ్రేష నక్షత్రం నందలి 3 వ పాదము లో జన్మంచిన శిశువు వలన తల్లికి దోషం కలుగను. ఆలయం నందు ఆశ్రేష నక్షత్రం (3 వ పాదం) నందు జన్మించిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 8 kms. దూరంలో రామచంద్రాపురం bus complex ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం కు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

* రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి సామర్లకోట బస్సులు ప్రతి గంటకు ఉంటాయి. బస్ సర్వీసులు గొల్లల మామిడాడ, బిక్కవోలు మీదగా ప్రయాణం చేస్తాయి.

* గొల్లల మామిడాడ జంక్షన్ (గాంధీ బొమ్మ సెంటర్) నుంచి గండ్రేడు శివాలయం నకు ఆటోలు దొరుకుతాయి. ఆటోలు రాను - పోను ఏర్పాట్లు చేసుకోవడం సౌకర్యముగా ఉంటుంది. గొల్లల మామిడాడ - గండ్రేడు శివాలయం మధ్య దూరం సుమారు 3 Kms. గా ఉంటుంది.

* కాకినాడ - గొల్లల మామిడాడ ఆటోలు (via) ఇంద్రపాలెం, పెదపూడి మీదగా ఉంటాయి. గొల్లల మామిడాడ ఆటోలు కాకినాడ బాల చెరువు నుంచి బయలుదేరుతాయి. పెద్దాడ తర్వాత గండ్రేడు జంక్షన్ వస్తుంది. దీనినే చర్చి సెంటర్ అని కూడ పిలుస్తారు. ఇక్కడ నుంచి సుమారు 01 Km. దూరంలో గండ్రేడు శివాలయం ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన గండ్రేడు శివాలయం నివాసి శ్రీ కొమాళ్ళపల్లి సూర్యనారాయణ మూర్తి శర్మ, సెల్ నెం. 9949139638 గార్కి నా నమసుమాంజలి.

గండ్రేడు గ్రామం లో నేరేళ్ళమ్మ గ్రామదేవత జాతర ఉత్సవములు వైశాఖ బహుళ అమావాస్య రోజున వైభవంగా జరుగుతాయి. గండ్రేడు పరిసర ప్రాంతాలలో రైతులు వైశాఖ బహుళ అమావాస్య నుంచి, తమ వ్యవసాయం పాలేర్లకు (కమతాలు కుదిరిన) జీతాలు గుణించుతారు (లెక్కకడతారు). వైశాఖ బహుళ అమావాస్యను 'గండ్రేడమాస' అని అంటారు.

గండ్రేడు గ్రామం లో " గౌరీదేవి సంబరం " చాల వైభవంగా ఉంటుంది. ఇది ఒక మాసం పాటు జరుగుతుంది. దీనిని గండ్రేడు గ్రామం నకు చెందిన సానపతుల (పద్మసాలి) కులము చెందిన ఒక కుటుంబం నిర్వహించుతారు. ఆశ్వీయుజ మాసం నందలి బహుళ తదియ (అట్లతద్ది) నాడు ఒక మట్టి బొమ్మకు రంగులు అద్ది ఊరేగింపుగా గౌరీదేవి గుడికి తెచ్చి, నెల రోజులు పాటు ఆర్చనలు చేస్తారు. ప్రతి ఇంటి నుంచి ఒక పచ్చి అరటి పళ్ళు గెలను గౌరిదేవికి సమర్పించుట ఆచారంగా ఉంది. గౌరీదేవి గుడిలో ఒక శిల పైన శివ కుటుంబం చూడగలం. శివుడు, పార్వతి దేవి (గౌరి దేవి), గణపతి ఉంటారు.



శ్రీ మాణిక్యాంబ సమేత శ్రీ భీమేశ్వర స్వామి

కర్కాటకరాశి, ఆశ్రేష నక్షత్రం (4 వ పాదం)

మామిడాడ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక కామరాజు, సెల్ నెం. 9866136166



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఉత్తరం దిశగా, సుమారు 20 kms. దూరాన మామిడాడ గ్రామం (Mamidada) కలదు. రామచంద్రపురం - సామర్లకోట రోడ్డు మార్గములో గొల్లల మామిడాడ జంక్షన్ ఉంటుంది. గొల్లల మామిడాడ జంక్షన్ కు ఈశాన్యం దిశగా సుమారు 1.6 Kms. దూరంలో మామిడాడ గ్రామం చెరువు ఉంటుంది. ప్రస్తుతం ఈ ప్రాంతమును శివారు లక్ష్మీనరసాపురం (LNPuram) గా పిలుస్తారు. ఇది గొల్లల మామిడాడ తపాల కార్యాలయం పరిధి లోనికి వస్తుంది. మామిడాడ గ్రామం చెరువు కు ఎదురుగా శ్రీ మాణిక్యాంబ సమేత శ్రీ భీమేశ్వర స్వామి ఆలయం కలదు. స్థానికులు దీనిని పాటిమీద శివాలయంగా పిలుస్తారు.

**ఆలయం:** మామిడాడ (LN పురం) గ్రామం లోని శ్రీ మాణిక్యాంబ సమేత శ్రీ భీమేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయ ప్రవేశం గాలిగోపురం క్రింద నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, నంది మండపం, ప్రధానాలయం, చండీశ్వరుడు, కళ్యాణ మండపం మొదలగునవి ఉంటాయి. ముఖమండపం నందు విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు దర్శనమిస్తారు, అంతరాలయం దాటిన తర్వాత గర్భాలయం వస్తుంది. గర్భాలయం నందు శ్రీ భీమేశ్వర లింగము మరియు శ్రీ మాణిక్యాంబ దేవి కొలువుదీరినారు. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం మాఘ బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. మహాశివరాత్రి నాడు విశేష అభిషేకాలు ఉంటాయి. దేవస్థానం వారు లక్షపత్ర పూజ నిర్వహించుతారు. అర్ధరాత్రి లింగోద్భవం కార్యాక్రమం జరుపుతారు. మహాశివరాత్రి సందర్భముగా నాలుగు జాములు ఆలయ దర్శనం జరుగుతుంది. మహాశివరాత్రి నాటి సాయంత్రం రథోత్సవం వైభవంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు మొదలగు నవి జరుగుతాయి. కార్తీక మాసంలో విశేష పూజలు ఉంటాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. ధనుర్మాసం (30 రోజులు) నందు గ్రామ ఊరేగింపు కార్యక్రమం జరుగుతాయి. ఆలయ ప్రత్యేకత శివయ్య రజత ఆకృ తి. అభిషేకాలు ముగించి, శివలింగాన్నికి రజత ఆకృ తి అమర్చుతారు.

**రవాణా సమాచారం:** రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి సామర్లకోట బస్సులు ప్రతి గంటకు ఉంటాయి. బస్ సర్వీసులు గొల్లల మామిడాడ, బిక్కవోలు మీదగా ప్రయాణం చేస్తాయి.

* గొల్లల మామిడాడ జంక్షన్ (గాంధీ బొమ్మ సెంటర్) నుంచి పాటిమీద శివాలయం నకు ఆటోలు దొరుకుతాయి. ఆటోలు రాను - పోను ఏర్పాట్టు చేసుకోవడం సౌక్యముగా ఉంటుంది. గొల్లల మామిడాడ - పాటిమీద శివాలయం మధ్య దూరం సుమారు 1.6 Kms. గా ఉంటుంది.

* కాకినాడ - గొల్లల మామిడాడ ఆటోలు (via) ఇంద్రపాలెం, పెదపూడి మీదగా ఉంటాయి. పెదపూడి తర్వాత దొడ్డి ముసలమ్మ గుడి వస్తుంది. దీని తర్వాత పాటిమీద శివాలయం జంక్షన్ వస్తుంది. ఇక్కడ నుంచి సుమారు 400 meters దూరంలో పాటిమీద శివాలయం ఉంటుంది.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన శివారు లక్ష్మీనరసాపురం (LN Puram) గ్రామ నివాసి శ్రీ కొత్తలంక వెంకట సుబ్రహ్మణ్య శర్మ 9705300240 గార్కి నా నమసుమాంజలి. ఆలయ పూజ సమాచారం కోసం ప్రస్తుతం ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొత్తలంక కామరాజు, సెల్ నెం. 9866136166 గారిని సంప్రదించగలరు.








సింహ రాశి రాశి చక్రంలో **అయిదవ రాశి.**

ఈ రాశికి **అధిపతి సూర్యుడు.**

ఇది పురుష రాశి, విషమ రాశి, స్థిర రాశి, అగ్ని తత్వ రాశి, అశుభ రాశి, పురుష రాసి అని వ్యవహరిస్తారు.

సింహ రాశి **9 ఆలయాలు** ఉంటాయి.

**ముఖ** నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

**పుబ్బ** నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

**మరియు ఉత్తర** నక్షత్రంలోని 1 వ పాదం

9 ఆలయాలు కలిసి **సింహ రాశి**గా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ పార్వతీ సమేత భవానీశంకర స్వామి

సింహరాశి, మఖ నక్షత్రం (1 వ పాదం)

నరసాపురపుపేట గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ మద్దిరాల శ్రీనివాసదత్తు, సెల్: 94908 83183 సంప్రదించగలరు.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఈశాన్యం దిశగా, సుమారు 12 kms. దూరాన, నరసాపురపుపేట (Narasapurapupeta) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రామచంద్రపురం మండలంకు చెందినది. రామచంద్రపురం - కరప రోడ్డులో నరసాపురపుపేట బస్ స్టాప్ ఉంటుంది. బస్ స్టాప్ కు కొంత లోపలకి నరసాపురపుపేట గ్రామం ఉంటుంది. ఇక్కడ శ్రీ పార్వతీ సమేత భవానీశంకరస్వామి (శివాలయం) కలదు. శ్రీ భవానీశంకర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. శ్రీ భవానీశంకర లింగము స్వయంభూ లింగము అని చెప్పుచుంటారు. శ్రీ వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి ఉపాలయం కలదు. శ్రీ భవానీశంకరస్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవములు మాఘశుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి అత్యంత వైభవోపేతంగా జరుగుతాయి. సింహరాశి జాతకులు క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం - కాకినాడ బస్సులు (Via) నరసాపురపుపేట, వేళంగి మీదగా ఉంటాయి. బస్సు స్టాపునకు ఉత్తరంగా సుమారు 300 meters దూరాన, భవానీశంకర స్వామి ఆలయం ఉంటుంది. నరసాపురపుపేట గ్రామంలో శ్రీ రుక్మిణి సత్యభామా సమేత వేణు గోపాలస్వామివారి ఆలయము కూడా వున్నది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.





శ్రీ విశాలక్షి సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి

సింహరాశి, మఖ నక్షత్రం (2 వ పాదం)

మెళ్ళూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొమాళ్ళపల్లి కాశీ విశ్వేశ్వర రావు, సెల్ నెం. 9010545349



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఉత్తరం దిశగా, సుమారు 14 kms. దూరాన మెళ్ళూరు గ్రామం (Melluru) కలదు. రామచంద్రపురం - కాకినాడ రోడ్డు మార్గములో చోడవరం జంక్షన్ ఉంటుంది. చోడవరం నకు ఉత్తరం - ఈశాన్యం దిశగా ఆరికిరేవుల సమీపంలో మెళ్ళూరు గ్రామం కలదు. చోడవరం జంక్షన్ నంచి ఆరికిరేవుల గ్రామం మీదగా బ్రాంచి రోడ్డు మార్గము కలదు. మెళ్ళూరు ఊరు నందు శ్రీ విశాలక్షి సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి ఆలయం చాల ప్రసిద్ధి.

శ్రీ విశ్వేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** మెళ్ళూరు గ్రామం లోని శివాలయం చాల ప్రాచీనమైనది. అగస్త్య మహర్షి లింగ ప్రతిష్ట గావించాడు. ప్రకృతి వైపరీత్యాలు కారణముగా శివాలయం ధ్వంసం అయింది. కొంత కాలము తర్వాత అనగా 1981 సంవత్సరమున సమీపంలో గల చెరువు నందు శివలింగము బయలు పడింది. గ్రామస్థులు ఆ శివలింగాన్నికి చిన్న గుడి నిర్మించారు. పిదప 1983 సంవత్సరం నందు మరో పెద్ద ఆలయం నిర్మించి, కాశి నుంచి మరో శివలింగాన్ని తెచ్చి ప్రతిష్టించారు. దీనితో పాటు శ్రీ విశాలక్షి అమ్మవారి ప్రతిష్ట కూడ గ్రామస్థులు గావించారు. ఇప్పటికి వృద్ధ శివలింగాన్నికి గ్రామస్థులు అర్చనలు నిర్వహించుచున్నారు.

మెళ్ళూరు గ్రామం లోని శ్రీ విశాలక్షి సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగాను, తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయ ప్రవేశం దక్షిణ ముఖద్వారం నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, నంది, ప్రధానాలయం, శివకోటి స్తూపం, చండీశ్వరుడు, దత్రాత్రేయుడు, నవగ్రహ మండపం మరియు వృద్ధ శివలింగము ఉంటాయి. ముఖ మండపం నందు నందీశ్వరుడు, ద్వారపాలకులు ఉన్నారు. అంతరాలయం నందు శ్రీ సుబ్రహ్మణ్య స్వామి మరియు గణపతి మూర్తి కలరు. గర్భాలయం నందు శ్రీ విశ్వేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ విశాలక్షి దేవి కొలువుదీరింది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాల తోరణం, శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు జరుగుతాయి. మహాశివ రాత్రి సందర్భముగా లింగోద్భవ కాల పూజ నిర్వహించుతారు. మెళ్ళూరు గ్రామం లోని దుర్గమ్మ గుడి కూడ దర్శనీయం.

శ్రీ విశ్వేశ్వర లింగము, మఖ నక్షత్రం (2 వ పాదం) చెందినది.
మఖ నక్షత్రం నందలి 2 వ పాదము లో జన్మించిన స్త్రీ వలన తల్లికి, పురుషుడు వలన తండ్రికి దోషం కలుగను. మఖ నక్షత్రం (2 వ పాదం) నందు జన్మించిన వారికి శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో ద్రాక్షారామం -రామచంద్రాపురం జంక్షన్ ఉంటుంది. ద్రాక్షారామం నుంచి బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి మెళ్ళూరు గ్రామం కు బస్సులు చాల తక్కువుగా దొరుకుతాయి.

రామచంద్రాపురం నుంచి మెళ్ళూరు గ్రామం నకు ఆటోలు రాను - పోను ఏర్పాట్లు చేసుకోవడం సౌక్యముగా ఉంటుంది. రామచంద్రాపురం - మెళ్ళూరు మధ్య దూరం సుమారు 9 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

మాకు సహకరించిన మెళ్ళూరు - శ్రీ కొమాళ్ళపల్లి కాశీ విశ్వేశ్వర రావు, సెల్ నెం. 9010545349 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి

సింహరాశి, మఖ నక్షత్రం (3 వ పాదం)

ఆరికిరేవుల గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ యలమంచిలి లక్ష్మీ నరసింహమూర్తి, సెల్ నెం. 9010247494




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఉత్తరం దిశగా, సుమారు 13 kms. దూరాన ఆరికిరేవుల గ్రామం (Aarikirevula) కలదు. రామచంద్రపురం - కాకినాడ రోడ్డు మార్గములో చోడవరం జంక్షన్ ఉంటుంది. చోడవరం నకు ఉత్తరం దిశ నందు గల తుల్యభాగ నదికి సమీపంలో ఆరికిరేవుల గ్రామం ఉంటుంది. చోడవరం జంక్షన్ నంచి ఆరికిరేవుల గ్రామం మీదగా బ్రాంచి రోడ్డు మార్గము కలదు.

ఆరికిరేవుల ఊరుకు పశ్చిమ వైపున శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి ఆలయం కలదు. శ్రీ విశ్వేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆరికిరేవుల గ్రామం లోని శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము చాల విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రవేశం గాలిగోపురం మరియు ముఖద్వారం నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ప్రధానాలయం, శివకోటి స్తూపం, చండీశ్వరుడు, కాల భైరవ స్వామి సన్నిధి, అన్న సమారాధన సేవ కార్యక్రమాలు నిర్వహించుటకు హాల్ మొదలగునవి ఉంటాయి. ప్రతి సోమవారం అన్నసమారాధన జరుగుతుంది. ముఖ మండపం నందు నందీశ్వరుడు, వినాయకుడు, సుబ్బారాయుడు (శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి) సన్నిధిలున్నాయి. అంతరాలయం నందు ఉత్సవమూర్తులు కలరు. గర్భాలయం నందు శ్రీ విశ్వేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ అన్నపూర్ణా దేవి కొలువుదీరింది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. శ్రీ విశ్వేశ్వర లింగము, మఖ నక్షత్రం (3 వ పాదం) చెందినది. మఖ నక్షత్రం నందలి 3 వ పాదము లో జన్మంచిన స్త్రీ వలన తల్లికి, పురుషుడు వలన తండ్రికి దోషం కలుగను. మఖ నక్షత్రం (3 వ పాదం) నందు జన్మించిన వారికి శాంతులు నిర్వహించుతారు. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. సుబ్బారాయుడు షష్ఠికి ముందు రోజు అనగా పంచమి నాడు సుబ్రహ్మణ్య స్వామి కళ్యాణోత్సవాలు ఘనంగా నిర్వహించుతారు. ఆలయం నకు ఉత్తర భాగములో కోనేరు ఉంటుంది. ఆలయం పునః ప్రతిష్ట సందర్భముగా ఒక నాగ జంట కోనేరు గట్టు పైన అద్భుత నృత్యం చేశాయి అని స్థానికులు చెప్పుచుంటారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో ద్రాక్షారామం -రామచంద్రాపురం జంక్షన్ ఉంటుంది. ద్రాక్షారామం నుంచి బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

* రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి ఆరికిరేవుల గ్రామం కు బస్సులు చాల తక్కువుగా దొరుకుతాయి. ఆరికిరేవుల బస్ స్టాప్ కు పశ్చిమ దిశగా సుమారు 300 meters దూరంలో శివాలయం ఉంటుంది.

రామచంద్రాపురం నుంచి ఆరికిరేవుల గ్రామం నకు ఆటోలు రాను - పోను ఏర్పాట్లు చేసుకోవడం సౌక్యముగా ఉంటుంది.

రామచంద్రాపురం - ఆరికిరేవుల మధ్య దూరం సుమారు 8 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన ఆరికిరేవుల - శ్రీ విశ్వేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ యలమంచిలి లక్ష్మీ నరసింహమూర్తి, సెల్ నెం. 9010247494 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ పార్వతీ సమేత నాగలింగేశ్వర స్వామి

సింహరాశి, మఖ నక్షత్రం (4 వ పాదం)

కొత్తూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ విల్లూరి ఉమా మహేశ్వరరావు, సెల్ నెం : 94946 63385




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 9.5 kms. దూరాన, కొత్తూరు (Kotturu) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రామచంద్రపురం మండలంకు చెందినది. కొత్తూరు నందు శ్రీ పార్వతీ సమేత నాగలింగేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ నాగలింగేశ్వర లింగము భీమసభ నందలి . 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. ఆలయ ముఖద్వారం పైన శివకుటుంబము మరియు ముఖమంటపము పైన పరమేశ్వరుడు మార్కండేయుని యమధర్మరాజు నుండి రక్షించిన ఘట్టము శిల్పీకరించబడినది. ఆలయ ప్రాంగణములో గణపతి ఆలయం కలదు. శ్రీ నాగలింగేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవములు చైత్రశుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు వైభవోపేతంగా జరుగుతాయి. సింహరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకులు శ్రీ విల్లూరి ఉమా మహేశ్వరరావు, సెల్ నెం : 94946 63385 సంప్రదించగలరు. కొత్తూరు గ్రామంలో రామాలయము, వేంకటేశ్వరస్వామి ఆలయము కలవు.

రామచంద్రపురం మార్కెట్టు సెంటర్ నుంచి కొత్తూరు శివాలయంకు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 3 కిల్లో మిటార్లుగా ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి

సింహరాశి, పుబ్బ నక్షత్రం (1 వ పాదం)

చింతపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి సుబ్రహ్మణ్య శర్మ, సెల్ నెం. 99898 45988




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఉత్తరం దిశగా, సుమారు 18 kms. దూరాన చింతపల్లి గ్రామం (Chintapalli) కలదు. రామచంద్రపురం - గొల్లల మామిడాడ రోడ్డు మార్గములో చింతపల్లి లాకులు ఉంటాయి. చింతపల్లి లాకులు కు ఈశాన్యం దిశగా, కరప పోవు రోడ్డు మార్గం లో చింతపల్లి గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం కలదు. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** చింతపల్లి గ్రామం లోని శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. నేటి ఆలయం పిఠాపురం మహారాజులు కాలం నాటిది. ఆలయం పశ్చిమాభి ముఖంగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ప్రధానాలయం, తులసి కోట, చండీశ్వరుడు, నాగ బంధం మొదలగునవి ఉంటాయి. ముఖ మండపం నందు నందీశ్వరుడు, వినాయకుడు, ద్వారపాలకులు ఉంటారు. అంతరాలయం నందు శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి, గణపతి, ఉత్సవమూర్తులు కలరు. గర్భాలయం నందు శ్రీ వీరేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ భద్రకాళి దేవి కొలువుదీరింది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. మహాశివరాత్రి కి విశేష అభిషేకాలు జరుగుతాయి. ఉగాది కి పుష్ప యాగం జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. లక్షపత్ర పూజ మొదలగునవి నిర్వహించుతారు. కార్తీక మాసం నందలి పౌర్ణమి నాడు జ్వాలాతోరణం జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. శ్రీ వీరేశ్వర లింగము, పుబ్బ నక్షత్రం (1 వ పాదం) చెందినది. పుబ్బ నక్షత్రం (1 వ పాదం) నందు జన్మించిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో రామచంద్రాపురం RTC బస్ స్టాండ్ ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం నకు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి సామర్లకోట బస్సులు
(Via) చింతపల్లి లాకులు, గొల్లల మామిడాడ మీదగా ఉంటాయి. ప్రయాణికుల అభ్యర్ధన బట్టి బస్సులు చింతపల్లి లాకులు వద్ద ఆగుతాయి. రామచంద్రాపురం నుంచి చింతపల్లి లాకులు దూరం 12 Kms. చింతపల్లి లాకులు నుంచి చింతపల్లి గ్రామం నకు రవాణా సౌకర్యములు ఉండవు. వీటి మధ్య దూరం సుమారు 01.5 Kms. మాత్రమే.

గొల్లల మామిడాడ నుంచి చింతపల్లి శివాలయం కు ఆటోలు దొరుకుతాయి. వీటిని రాను-పోను ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 04.5 Kms. గా ఉంటుంది.

మాకు సహకరించిన చింతపల్లి అర్చక స్వామి శ్రీ వెలవలపల్లి సుబ్రహ్మణ్య శర్మ, సెల్ నెం. 99898 45988 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.





శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి

సింహరాశి, పుబ్బ నక్షత్రం (2 వ పాదం)

వెదురుపాక గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ యలమంచలి సుబ్రహ్మణ్యం, సెల్ నెం : 89856 84897



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 17 kms. దూరాన, వెదురుపాక (Vedurupaka) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రాయవరం మండలంకు చెందినది. వెదురుపాక నందు శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. ఆలయ ముఖద్వారం పైన ఓంకారం కలదు. ఆలయ ప్రాంగణములో చండీశ్వరుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు, వీరభద్రుడు, గణపతి సన్నిధిలు కలవు. శ్రీ సోమేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు వైభవోపేతంగా జరుగుతాయి. సుబ్రహ్మణ్య షష్ఠి సందర్భముగా మూడురోజుల పాటు శ్రీ వల్లీ దేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి కళ్యాణం జరుగుతుంది. సింహరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకులు శ్రీ యలమంచలి సుబ్రహ్మణ్యం, సెల్ నెం : 89856 84897 సంప్రదించగలరు. వెదురుపాక గ్రామంలో విజయదుర్గాపీఠం, శ్రీదేవి, భూదేవి సమేత జనార్ధనస్వామి మరియు శ్రీ రమాసమేత సత్యనారాయణ స్వామి వారి ఆలయములు కలవు. రామచంద్రపురం - అనపర్తి బస్సులు (Via) రాయవరం మీదగా ఉంటాయి. రాయవరం దాటగానే శ్రీ పొలమ్మ తల్లి పుట్ట వస్తుంది. ప్రయాణికులు పొలమ్మ పుట్ట వద్ద దిగాలి. ఇక్కడ నుంచి వెదురుపాక గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 3 కీల్లో మిటార్లుగా ఉంటుంది.

రామచంద్రపురం నుంచి వెదురుపాక కు (వయా) పసలపూడి మీదగా ఆటోలు రాను-పోను ఏర్పాట్లు చేసుకోవచ్చు. వీటి మధ్య దూరం సుమారు 11 కీల్లో మిటార్లుగా ఉంటుంది.కొత్తూరు మీదగా వెదురుపాక కు మార్గం ఉంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి

సింహరాశి, పుబ్బ నక్షత్రం (3 వ పాదం)

తొస్సిపూడి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ దొంతికుర్తి శ్రీమన్నారాయణ మూర్తి, సెల్ నెం. 9441154185




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 22 kms. దూరాన, తుల్యాభాగ నదీ తీరం నకు ఉత్తరం భాగంలో తొస్సిపూడి (Tossipudi) అను గ్రామం కలదు. రామచంద్రపురం - అనపర్తి రోడ్డు మార్గములో తొస్సిపూడి గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ రామలింగేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం పుబ్బ నక్షత్రం కు (3 వ పాదం) చెందినది. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** తొస్సిపూడి గ్రామం లోని శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. 1960 సంవత్సరములో పునః ప్రతిష్ట జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయం ప్రవేశం సింహద్వారం నుంచి జరుగుతుంది. ఆలయం ప్రాంగణము లోనికి ప్రవేశించగానే ధ్వజస్థభం, తులసి కోట, ప్రధానాలయం, చండీశ్వర సన్నిధి దర్శనమిస్తాయి. ముఖ మండపం నందు మహా నందీశ్వరుడు ఉంటాడు. అంతరాలయం నందు గణపతి కొలువైన్నారు. గర్భాలయం నందు శ్రీ రామలింగేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ పార్వతీ దేవి కొలువుదీరింది. స్వామి కృపతో సుఖ, సంతోష, ఆయురోగ్య, విజయ, ఐశ్వర్య, భోగ భాగ్యములు కలుగుతాయి. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. ఆలయం నందు మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. రాత్రికి లింగోద్భవ పూజ జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా రథోత్సవం, మహా అన్నదానం నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం మాఘ బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. ప్రతి మాసం మాస శివరాత్రి, పౌర్ణమి సందర్భముగా విశేష పూజలు, అభిషేకాలు నిర్వహించబడును. కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక మాసం పౌర్ణమి నాడు జ్వాలాతోరణం జరుగుతుంది. శరన్నవరాత్రులు జరుగుతాయి. సంక్రాంతి, దీపావళీ, సుబ్రహ్మణ్య షష్టి మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా జరుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి రాజమండ్రి బస్సులు (via) రామచంద్రపురం మీదగా ఉంటాయి.

* రామచంద్రపురం - అనపర్తి బస్ సర్వీసులు (via) తొస్సిపూడి గ్రామం మీదగా ఉంటాయి. రామచంద్రపురం - తొస్సిపూడి మధ్య దూరం సుమారు దూరం 17 Kms.

* కాకినాడ - రాజమండ్రి బస్సులు (via) సామర్లకోట, బలభద్రాపురం, అనపర్తి మీదగా ఉంటాయి.

* బలభద్రాపురం సెంటర్ నుంచి తొస్సిపూడి కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 3 Kms.

మాకు సహకరించిన తొస్సిపూడి - శ్రీ రామలింగేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ దొంతికుర్తి శ్రీమన్నారాయణ మూర్తి, సెల్ నెం. 9441154185 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.





శ్రీ ఉమా సమేత రామలింగేశ్వర స్వామి

సింహరాశి, పుబ్బ నక్షత్రం (4 వ పాదం)

పొలమూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ యలమంచలి సతీష్ శర్మ, సెల్ నెం. 96186 59214



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 21 kms. దూరాన, తుల్యాభాగ నదీ తీరం నకు దక్షిణ భాగంలో పొలమూరు (Polamuru) అను గ్రామం కలదు. పెడపర్తి రేవు - అనపర్తి రోడ్డు మార్గములో పొలమూరు గ్రామం ఉంటుంది. పొలమూరు మెయిన్ రోడ్డుకు తూర్పు దిశగా సుమారు 0.5 Kms. లోపలకి శివాలయం ఉంటుంది. ఇచ్చట శ్రీ రామలింగేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** పొలమూరు గ్రామం లోని శ్రీ ఉమా సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. నాలుగ వైపుల ప్రవేశ ద్వారములున్నాయి. ప్రధానాలయం పశ్చిమాభిముఖంగా ఉంటుంది. ఆలయం నకు పశ్చిమ వైపున మూడు అంతస్థుల గాలి గోపురం ఉంటుంది. ఆలయం ప్రవేశం గాలి గోపురం క్రింద నుంచి జరుగుతుంది. ఆలయం ప్రాంగణము లోనికి ప్రవేశించగానే ధ్వజస్థభం, బలి పీఠం, ప్రధానాలయం దర్శనమిస్తాయి.

ఆలయం ప్రాంగణము నందు యాగ శాల, వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి, కాల భైరవ స్వామి, చండీశ్వర స్వామి, చక్కటి తులసి కోట ఉంది. కోటకి అష్ట లక్ష్మి మూర్తులు పొదిగి ఉన్నాయి. ఈశాన్య మూల నవగ్రహ మండపం, తూర్పున వృద్ధ రామలింగేశ్వర స్వామి మొదలగు మూర్తులు కలరు. భక్తులు స్వయంగా శ్రీ వృద్ధ రామలింగేశ్వర లింగముకు అభిషేకాలు జరుపుతారు. ఉత్తర-ఈశాన్యం నందు కోనేరు ఉంది. ముఖ మండపం నందు మహా నందీశ్వరుడు, చిన్న నంది, ద్వారపాలకులు ఉంటారు. ముఖ మండపం నందు దక్షిణ భాగం నందు మేధా దక్షిణామూర్తి దర్శనం మిస్తారు. అంతరాలయం నందు మహా గణపతి, కుమార స్వామి, ఉత్సవ మూర్తులు కొలువైన్నారు. గర్భాలయం నందు శ్రీ రామలింగేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ ఉమా దేవి కొలువుదీరింది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణం కార్తీక బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. కార్తీక మాసం పౌర్ణమి నాడు జ్వాలాతోరణం జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. మహాశివరాత్రి నాడు కోటిదీపోత్సవం మరియు మహా అన్నదానం నిర్వహించుతారు. సంక్రాంతి, దీపావళీ, సుబ్రహ్మణ్య షష్టి మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా జరుగుతాయి. ప్రతి మాసం మాస శివరాత్రి సందర్భముగా శాంతి కళ్యాణం భక్తుల చేత నిర్వహించబడును.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి రాజమండ్రి బస్సులు (via) రామచంద్రపురం, పెడపర్తి రేవు, మండపేట మీదగా ఉంటాయి. * రామచంద్రపురం - మండపేట రోడ్డు మార్గములో పెడపర్తి రేవు అను గ్రామం ఉంది.

* పెడపర్తి రేవు నుంచి పొలమూరు గ్రామం నకు (via) కుతుకులూరు మీదగా ఆటోలు దొరుకుతాయి. పెడపర్తి రేవు నుంచి పొలమూరు గ్రామం దూరం సుమారు 08 Kms. గా ఉంటుంది.

* కాకినాడ - రాజమండ్రి బస్సులు (via) అనపర్తి మీదగా ఉంటాయి. * అనపర్తి వంతెన బస్సు స్టాప్ (దేవి చౌక్) నుంచి పొలమూరు కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన పొలమూరు - శ్రీ రామలింగేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ యలమంచలి సతీష్ శర్మ, సెల్ నెం. 96186 59214 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి

సింహరాశి, ఉత్తర నక్షత్రం (1 వ పాదం)

పందలపాక గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ చంద్రమౌళి కామేశ్వర శర్మ, సెల్ నెం : 99510 24439




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 21 kms. దూరాన, పందలపాక (Pandalapaka) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, బిక్కవోలు మండలంకు చెందినది. పందలపాక నందు శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. ఆలయ ప్రాంగణములో శ్రీదేవి, భూదేవి సమేత కేశవస్వామివారి ఆలయం, శ్రీ వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్యస్వామి వారి ఆలయం, నవగ్రహ మంటపము, చండీశ్వరాలయం కూడ కలవు. శ్రీ సోమేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శ్రీ సుబ్రహ్మణ్య స్వామివారి కళ్యాణోత్సవము కూడ పాంచాహ్నికంగా జరపుతారు. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు వైభవోపేతంగా జరుగుతాయి. సింహరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకులు శ్రీ చంద్రమౌళి కామేశ్వర శర్మ, సెల్ నెం : 99510 24439 సంప్రదించగలరు. నదీ తీరాన మరో శివాలయం కలదు.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం - అనపర్తి బస్సులు (Via) రాయవరం, తొస్సిపూడి మీదగా ఉంటాయి. తొస్సిపూడి వంతెన నుంచి పందలపాక గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 2 కీల్లో మిటార్లుగా ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.








కన్యా రాశి రాశి చక్రంలో ఆరవది.

ఈ రాశికి అధిపతి బుధుడు.

కన్యా రాశి 9 ఆలయాలు ఉంటాయి.

ఉత్తర నక్షత్రంలోని 2, 3, 4 పాదములు

హస్త నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

మరియు చిత్త నక్షత్రంలోని 1, 2 పాదములు

9 ఆలయాలు కలిసి కన్యా రాశి గా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ పార్వతీ సమేత అగస్త్యేశ్వర స్వామి

కన్యారాశి, ఉత్తర నక్షత్రం (2 వ పాదం)

చోడవరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ చావలి విశ్వనాధశర్మ., సెల్ నెం : 99594 12444



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 9 kms. దూరాన, చోడవరం (Chodavaram) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రామచంద్రపురం మండలంకు చెందినది. చోడవరం నందు శ్రీ పార్వతీ సమేత అగస్త్యేశ్వరస్వామి (శివాలయం) కలదు. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. ప్రాంగణములో ధ్వజస్థంభం, ముఖమండపం. అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయం నందు వినాయకుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు కలరు. శ్రీ అగస్త్యేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామివారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శ్రీ సుబ్రహ్మణ్య స్వామివారి కళ్యాణోత్సవము కూడ పాంచాహ్నికంగా జరపుతారు. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు వైభవోపేతంగా జరుగుతాయి. కన్యారాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకులు శ్రీ చావలి విశ్వనాధశర్మ., సెల్ నెం : 99594 12444 సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం - కాకినాడ రహదారి పైన చోడవరం బస్ స్టాప్ ఉంటుంది. దీనికి దక్షిణ దిశగా కొంత లోపలకి చోడవరం గ్రామం ఉంటుంది. రామచంద్రపురం నుంచి చోడవరం కు ఆటో ప్రయాణం సౌకర్యంగా ఉండును. వీటి మధ్య దూరం సుమారు 3 కీల్లో మిటార్లుగా ఉంటుంది.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి

కన్యారాశి, ఉత్తర నక్షత్రం (3 వ పాదం)

నదురుబాదు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ విల్లూరి వీరభద్రరావు సెల్ నెం : 94915 77066.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 11 kms. దూరాన, నదురుబాదు (Nadurubada) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రాయవరం మండలంకు చెందినది. నదురుబాదు నందు శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వరస్వామి (శివాలయం) కలదు. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. ప్రాంగణములో ధ్వజస్థంభం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ ముఖ మంటపము పైన నటరాజస్వామి, మార్కండేయుని పరమేశ్వరుడు కాపాడిన ఘట్టం మరియు గీతోపదేశఘట్టం, ఆంజనేయస్వామి, గణపతి, కుమార స్వామి, లక్ష్మీ, సరస్వతుల విగ్రహములు దర్శనమిస్తాయి. శ్రీ మల్లేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు వైభవోపేతంగా జరుగుతాయి. కన్యారాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ ప్రాంగణంలో శ్రీ రుక్మిణీ, సత్య భామ నమేత వేణుగోపాలస్వామి ఆలయం కూడ ఉంది.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం మార్కెట్టు సెంటర్ (Annapurna Theater) నుంచి నదురుబాదు కు ఆటో ప్రయాణం సౌకర్యంగా ఉండును. వీటి మధ్య దూరం సుమారు 5 కీల్లో మిటార్లుగా ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.





శ్రీ మాణిక్యాంబ సమేత శ్రీ రాజరాజేశ్వర స్వామి

కన్యారాశి, ఉత్తర నక్షత్రం (4 వ పాదం)

పసలపూడి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పరిటాల ధామకర్ లక్ష్మీ భీమేశ్వర శ్రీనివాస్, సెల్ నెం. 9618963333




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 10 kms. దూరాన పసలపూడి గ్రామం (Pasalapudi) కలదు. కాకినాడ - రామచంద్రపురం - మండపేట రోడ్డు మార్గములో పసలపూడి గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ మాణిక్యాంబ సమేత శ్రీ రాజరాజేశ్వర స్వామి ఆలయం కలదు. శ్రీ రాజరాజేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** పసలపూడి గ్రామం లోని శ్రీ మాణిక్యాంబ సమేత శ్రీ రాజరాజేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రవేశం పశ్చిమ గాలిగోపురం నుంచి జరుగుతుంది. గాలిగోపురం నకు ఇరువైపుల ప్రవేశ ద్వారములున్నాయి.

ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, బలిపీఠం, నవగ్రహ మండపం, స్వామి వారి కళ్యాణ మండపం, యాగశాల, చండీశ్వరుడు, ప్రధానాలయం మొదలగునవి ఉంటాయి.
ముఖ మండపం నందు నందీశ్వరుడు, ద్వారపాలకులు దర్శనమిస్తారు. అంతరాలయం నందు ఉత్సవమూర్తులు, గణపతి కలరు. గర్భాలయం నందు శ్రీ రాజరాజేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ మాణిక్యాంబ దేవి కొలువుదీరింది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది.

శ్రీ రాజరాజేశ్వర లింగము, ఉత్తర నక్షత్రం (4 వ పాదం) చెందినది. ఉత్తర నక్షత్రం నందలి 4 వ పాదము లో జన్మంచిన స్త్రీ వలన తల్లికి, పురుషుడు వలన తండ్రికి దోషం కలుగను. ఉత్తర నక్షత్రం (4 వ పాదం) నందు జన్మించిన వారికి అభిషేక శాంతులు నిర్వహించుతారు. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శివమాల కార్యక్రమాలు ఉంటాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. లింగోద్భవ కాలం వరకు 108 బిందెల పాలుతో శివునికి అభిషేకం జరుగుతుంది. శరన్నవరాత్రులు సందర్భంగా తొమ్మిది రోజులు పాటు విశేష అలంకార అర్చనలు వైభవంగా జరుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 7 kms. దూరంలో రామచంద్రాపురం ఉంటుంది. ద్రాక్షారామం నుంచి రామచంద్రాపురం కు బస్సులు / ఆటోలు దొరుకుతాయి.

రామచంద్రాపురం బస్ స్టాండ్ నుంచి పసలపూడి గ్రామం కు బస్సులు దొరుకుతాయి. కాకినాడ - రావులపాలెం బస్సులు మరియు కోటిపల్లి - రాజమండ్రి & యానాం - రాజమండ్రి బస్సులు (via) రామచంద్రాపురం, పసలపూడి మీదగా ఉంటాయి.

* రామచంద్రాపురం నుంచి పసలపూడి గ్రామం నకు ఆటోలు సౌక్యర్యంములు కలవు. రామచంద్రాపురం RTC బస్ స్టాండ్ నుంచి పసలపూడి మధ్య దూరం సుమారు 4.5 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన పసలపూడి - శ్రీ రాజరాజేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన
శ్రీ పరిటాల ధామకర్ లక్ష్మీ భీమేశ్వర శ్రీనివాస్,
సెల్ నెం. 9618963333 గార్కి నా నమసుమాంజలి.





**శ్రీ బాలా త్రిపుర సుందరి దేవి సమేత సోమేశ్వర స్వామి**

**కన్యారాశి, హస్త నక్షత్రం (1 వ పాదం)**

**అష్ట సోమేశ్వరాలయాలు (వాయువ్యం క్షేత్రం)**

**సోమేశ్వరం గ్రామం**

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పరిటాల సుబ్రహ్మణ్య శర్మ, సెల్: 99896 26953



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 14 kms. దూరాన, సోమేశ్వరం (Someswaram) అను గ్రామం కలదు. రామచంద్రపురం - మండపేట రోడ్డులో మాచవరం సెంటర్ ఉంది. దీనికి ఉత్తర దిశగా, సుమారు 1.5 Kms. దూరాన సోమేశ్వరం గ్రామం ఉంటుంది. క్షేత్రం నందు సోముడు (చంద్రుడు) ఒక మండల కాలము తపస్సు చేసి, ఒక శివ లింగాన్ని ప్రతిష్టించి ఆరాధించాడు. ఆ కారణముగా క్షేత్రం సోమేశ్వరం గా ఖ్యాతి పొందినది.

ఇచ్చట శ్రీ బాలా త్రిపుర సుందరి దేవి సమేత సోమేశ్వరాలయం దర్శించగలము. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయ సమూహం విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయం పశ్చిమాభిముఖముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయం తో పాటు ధ్వజ స్థంభం, శ్రీ పర్వత వర్ధని సమేత బ్రహ్మేశ్వర స్వామి, శ్రీ వల్లీ - దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి ఆలయాలు కలవు. ప్రధానాలయం యొక్క గూటి నందు శ్రీ దుండు గణపతి, శ్రీ చండీశ్వర స్వామి కలరు. వీటితో పాటు శ్రీ సూర్యనారాయణ మూర్తి, శ్రీ కాలభైరవ స్వామి దర్శనమిస్తారు. శ్రీ ఆంజనేయ స్వామి క్షేత్రపాలకడు. ఆలయ ముఖ మండపం నందు నంది, వినాయకుడు, సత్య సాయిబాబను చూడగలము. అంతరాళయం నందు కళ్యాణ ఉత్సవమూర్తులు, నిత్య ఉత్సవమూర్తులు, నందీశ్వరుడు దర్శనమిస్తారు. గర్భాలయం నందు ఏక పీఠం పైన శ్రీ సోమేశ్వర లింగము మరియు శ్రీ బాలా త్రిపుర సుందరి దేవి అమ్మవారి కొలువుదీరారు.

ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు జరుగుతాయి. వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు కళ్యాణ ఉత్సవాలు పాంచాహ్నికంగా నిర్వహించుతారు. మహా శివరాత్రి సందర్భముగా సోమేశ్వర లింగము నకు విశేష అభిషేకాలు జరుగుతాయి. రాత్రికి లింగోద్భవ సమయంలో అభిషేకాలు నిర్వహించుతారు. ప్రతి మాసశివరాత్రికి లక్ష పత్రి పూజ జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు, అభిషేకాలు, లక్ష పత్రి పూజ & జ్వాలతోరణం జరుగుతాయి. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు విశేషముగా ఉంటుయి. ముక్కోటి ఏకాదశి, ధనుర్మాసం పూజలు, హనుమాన్ జయింతి మొదలగునవి విశేషముగా జరుగుతాయి. సుబ్బారాయుడు షష్ఠి సందర్భముగా కళ్యాణం జరుగుతుంది.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం RTC Bus stand నుంచి అనపర్తి బస్సులు (వయా) సోమేశ్వరం మీదగా ఉంటాయి.

* రామచంద్రపురం RTC bus stand నుంచి మండపేట వైపు బస్సులు అధికముగా ఉంటాయి. రామచంద్రపురం - మండపేట రోడ్డులో పసలపూడి దాటిన తరువాత మాచవరం సెంటర్ (సోమేశ్వరం బ్రిడ్జి),వస్తుంది. మాచవరం సెంటర్ కు ఉత్తర దిశగా, సుమారు 1.5 Kms. దూరాన సోమేశ్వరం గ్రామం ఉంటుంది. మాచవరం సెంటర్ లో ఆటోలు ఉంటాయి.

2) కాకినాడ - రావులపాలెం బస్సులు (via) కరప, రామచంద్రపురం, మాచవరం సెంటర్, మండపేట మీదగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

ఆలయ సమాచారం & Photos అందించిన సోమేశ్వరం - శ్రీ బాలా త్రిపుర సుందరి దేవి సమేత సోమేశ్వరాలయ ఆలయ అర్చక స్వామి శ్రీ పరిటాల సుబ్రహ్మణ్య శర్మ, సెల్: 99896 26953 గార్కి నా నమసుమాంజలి.





శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి

కన్యారాశి, హస్త నక్షత్రం (2 వ పాదం)

పెడపర్తి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ యలమంచలి ప్రసాద్ శర్మ, సెల్ నెం : 98498 28891




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 18 kms. దూరాన, పెడపర్తి (Pedaparthi) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, అనపర్తి మండలంకు చెందినది. పెడపర్తి నందు శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ప్రాంగణములో ధ్వజస్తంభం, యాగశాల, చండీశ్వరాలయం, మహానంది, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము మరియు ముఖమంటపం నందు శ్రీ దక్షిణామూర్తి, అర్ధనారీశ్వరులు, గణపతి ఇత్యాది దేవతా మూర్తులు అద్భుతంగా శిల్పీకరించబడ్డాయి. ముఖమంటపం లోపలి పై కప్పు పైన ద్వాదశ రాశులు చిత్రించబడ్డాయి. అంతరాలయంలో గణపతి కొలువై యున్నారు. శ్రీ రామలింగేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు వైభవోపేతంగా జరుగుతాయి. కన్యారాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకులు శ్రీ యలమంచలి ప్రసాద్ శర్మ, సెల్ నెం : 98498 28891 సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం నుంచి మండపేట పోవు రహదారిలో పెడపర్తి రేవు అను బస్సు స్టాపు ఉంది. ప్రయాణికుల అభ్యర్ధన బట్టి బస్సులు ఆగుతాయి. పెడపర్తి రేవు నుంచి పెడపర్తి గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 2 కీల్లో మిటార్లుగా ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.





శ్రీ ఉమా పార్వతీ సమేత అగస్త్యేశ్వర స్వామి

కన్యారాశి, హస్త నక్షత్రం (3 వ పాదం)

పులగుర్త గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ చంద్రమౌళి మధు వెంకటేష్ శర్మ, సెల్ నెం : 93812 80993




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 14 kms. దూరాన, పులగుర్త (Pulugurta) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, మండపేట మండలంకు చెందినది. పులగుర్త నందు శ్రీ ఉమా పార్వతీ సమేత అగస్త్యేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ప్రాంగణములో ధ్వజస్తంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము మరియు ముఖమంటపం నందు దేవత మూర్తులు అద్భుతంగా శిల్పీకరించబడ్డాయి. ముఖ మంటపం నందు గణపతి మరియు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి సన్నిధిలున్నాయి. శ్రీ అగస్త్యేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి, గణపతి నవరాత్రులు జరుగుతాయి. కన్యారాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకులు శ్రీ చంద్రమౌళి మధు వెంకటేష్ శర్మ, సెల్ నెం : 93812 80993 సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం - మండ పేట ప్రధాన రహదారి నందు మాచవరం సెంటర్ ఉంది. దీనిని సోమేశ్వరం వంతెన అని పిలుస్తారు ఇక్కడ నుంచి పులగుర్త కి ఆటోలు దొరుకుతాయి.

* రామచంద్రపురం - మండ పేట ఆటోలు (వయా) పులగుర్త మీదగా ఉంటాయి. రామచంద్రపురం (రాజగోపాల సెంటర్) నుంచి కూడ దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ భద్రకాళీ సమేత వీరేశ్వర స్వామి

కన్యారాశి, హస్త నక్షత్రం (4 వ పాదం)

మాచవరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ గిలపర్తి వీరభద్ర శర్మ, సెల్ నెం : 99893 65155



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 14 kms. దూరాన, మాచవరం (Machavaram) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రాయవరరం మండలంకు చెందినది. మాచవరం నందు శ్రీ భద్రకాళీ సమేత వీరేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవత మూర్తులు అద్భుతంగా శిల్పీకరించబడ్డాయి. శ్రీ వీరేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవ రాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి, గణపతి నవరాత్రులు జరుగుతాయి. కన్యారాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకులు శ్రీ గిలపర్తి వీరభద్ర శర్మ, సెల్ నెం : 99893 65155 సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం - మండ పేట ప్రధాన రహదారి నందు మాచవరం సెంటర్ ఉంది. దీనిని సోమేశ్వరం వంతెన అని పిలుస్తారు ఇక్కడ నుంచి మాచవరం కి ఆటోలు దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి

కన్యారాశి, చిత్త నక్షత్రం (1 వ పాదం)

కొప్పవరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కాళ్ళకూరి ప్రసాద్ శర్మ, సెల్ నెం: 99089 17888




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 23 kms. దూరాన, కొప్పవరం (Koppavaram) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, అనపర్తి మండలంకు చెందినది. కొప్పవరం నందు శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** ఆలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ప్రాంగణములో ధ్వజస్తంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆగ్నేయంలో నాగబంధము, గణపతి మరియు అయ్యప్పస్వామి విగ్రహాలు అందరూ అర్చించుకొనడానికి వీలుగా ప్రతిష్ఠించ బడ్డాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవత మూర్తులు కలరు. అంతరాలయంలో శ్రీమహాగణపతి కొలువై వున్నారు.
శ్రీ రామలింగేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ బహుళ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు నిర్వహించబడతాయి. కన్యారాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:**అనవర్తి గ్రామానికి సమీపమున కొప్పవరం కలదు. అనపర్తి (దేవి చౌక్) నుండి ఆటో లేదా స్వంత వాహనంపై కొప్పవరం క్షేత్రమునకు చేరవచ్చును. వీటి మధ్య దూరం సుమారు 3 kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ ఉమా సమేత అగస్త్యేశ్వర స్వామి

కన్యారాశి, చిత్త నక్షత్రం (2 వ పాదం)

అర్తమూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ చేబ్రోలు కామేశ్వరరావు, సెల్ నెం: 98664 81797



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 19 kms. దూరాన, అర్తమూరు (Arthamuru) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, మండపేట మండలంకు చెందినది. అర్తమూరు నందు శ్రీ ఉమా సమేత అగస్త్యేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. అగస్త్య మహర్షి ప్రతిష్టించిన పంచ అగస్త్యేశ్వర ఆలయ కూటమిలో అర్తమూరు క్షేత్రం ఒకటి (మండపేట, తాపేశ్వరం, చెల్లూరు, వల్లూరు క్షేత్రాలు మిగిలిన ప్రతిష్టలు). అర్తమూరు ఆలయ కూడలిలో శివాలయంతో పాటు రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలస్వామివారి ఆలయం, సిద్ధి బుద్ధి సమేత విఘ్నేశ్వరాలయం, వేంకటేశ్వరస్వామివారి ఆలయం, ఆంజనేయస్వామివారి విగ్రహం మొదలగునవి దర్శనమిస్తాయి.

**ఆలయం:** శివాలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ప్రాంగణములో ధ్వజస్తంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవత మూర్తులు కలరు. శ్రీ అగస్త్యేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు మరియు సుబ్రహ్మణ్యషష్ఠి ఘనంగా జరుగుతాయి. అంతేగాక ప్రతి పౌర్ణమికి చండీయాగము నిర్వహించుతారు. ఆలయము నందు నాగబంధము మరియు గణపతి మూర్తులు ఉన్నారు. కన్యారాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం మరియు రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (వయా) మండపేట మీదగా ఉంటాయి.

* మండపేట నుంచి అర్తమూరు గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 kms.

* రామచంద్రపురం - మండపేట ఆటోలు (వయా) పులగుర్త మీదగా ఉంటాయి. రామచంద్రపురం (రాజగోపాల సెంటర్) నుంచి మండపేట దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.






తుల రాశి  రాశి చక్రంలో ఏడువ రాశి.

ఈ రాశికి **అధిపతి** శుక్రుడు.

తుల రాశి 9 ఆలయాలు ఉంటాయి.

చిత్త నక్షత్రంలోని 3, 4 పాదములు ,

స్వాతి నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

**మరియు విశాఖ** నక్షత్రంలోని **1, 2, 3 పాదములు**

9 ఆలయాలు కలిసి **తుల రాశి** గా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత అగస్త్యేశ్వర స్వామి

తులరాశి, చిత్త నక్షత్రం (3 వ పాదం)

చెల్లూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ యలమంచలి సాయి ప్రసాద్, సెల్ నెం: 99595 06650



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 10 kms. దూరాన, చెల్లూరు (Chelluru) గ్రామం ఉంటుంది. ఇది తూర్పు గోదావరి జిల్లా, రాయవరం మండలంకు చెందినది. చెల్లూరు నందు శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత అగస్త్యేశ్వరస్వామి (శివాలయం) కలదు. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. అగస్త్య మహర్షి ప్రతిష్ఠించిన పంచ అగస్త్యేశ్వర ఆలయ కూటమిలో చెల్లూరు క్షేత్రం ఒకటి (మండపేట, తాపేశ్వరం, అర్తమూరు, వల్లూరు క్షేత్రాలు మిగిలిన ప్రతిష్ఠలు).

**ఆలయం:** శివాలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. మూడు అంతస్థుల గాలి గోపురం క్రింద నుంచి ఆలయ ప్రవేశం జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో నీలకంఠేశ్వర లింగము, ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవత మూర్తులు కలరు. ముఖమండపం నందు నందీశ్వరుడు, ద్వారపాలకులు కలరు. గర్భాలయం నందు శ్రీ అగస్త్యేశ్వర స్వామి కలరు. అమ్మవారు శ్రీ బాలాత్రిపురసుందరీదేవి, గణపతి కలరు. నవగ్రహ మంటపము కూడ ఉంది. శ్రీ అగస్త్యేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు మరియు సుబ్రహ్మణ్యషష్ఠి ఘనంగా జరుగుతాయి. తులరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం నుంచి వాకతిప్ప బస్సులు (వయా) చెల్లూరు మీదగా ఉంటాయి. చెల్లూరు బస్ స్టాప్ కు సమీపంలో శివాలయం ఉంటుంది. రామచంద్రపురం - చెల్లూరు ఆటోలు (వయా) పసలపూడి (వంతెన) మీదగా ఉంటాయి. రామచంద్రపురం (రాజగోపాల సెంటర్) నుంచి చెల్లూరు కు దొరుకుతాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ రాజరాజేశ్వరీ సమేత మల్లేశ్వర స్వామి

తులరాశి, చిత్త నక్షత్రం (4 వ పాదం)

కాలేరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పూజ్యం వైద్యనాధ శర్మగారు సెల్ నెం: 94944 91053



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం - పశ్చిమ దిశగా, సుమారు 19 kms. దూరాన, కాలేరు (Kaleru) గ్రామం ఉంది. ఇది కోనసీమ జిల్లా, కపిలేశ్వరపురం మండలంకు చెందినది. కాలేరు నందు శ్రీ రాజరాజేశ్వరీ సమేత మల్లేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శివాలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో యాగశాల, ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవత మూర్తులు కలరు. శ్రీ మల్లేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. తులరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం ప్రధాన రహదారిలో పసలపూడి వంతెన ఉంది. ఇక్కడ నుండి చెల్లూరు కు ఆటోలు ఉంటాయి. చెల్లూరు గ్రామంలో ఆటో స్టాండ్ కలదు. చెల్లూరు నుంచి కాలేరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 6 Kms.

* రామచంద్రపురం నుంచి వాకతిప్ప బస్సులు (వయా) పసలపూడి వంతెన, చెల్లూరు మీదగా ఉంటాయి.

* మండపేట నుంచి కూడ కాలేరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవచ్చు. వీటి మధ్య దూరం సుమారు 12 Kms.

* మండపేట - కోరుమిల్లి బస్సులు (వయా) అంగర మీదగా ఉంటాయి. అంగర నుంచి కాలేరు కు (వయా) టేకి మీదగా ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 8 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి

తులరాశి, స్వాతి నక్షత్రం (1 వ పాదం)

మారేడుబాక గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొమాళ్ళపల్లి రామసుబ్బారాయుడు, సెల్ నెం: 99482 69059.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 18 kms. దూరాన, మారేడుబాక (Maredubaka) గ్రామం ఉంది. ఇది కోనసీమ జిల్లా, రాయవరం మండలంకు చెందినది. మారేడుబాక నందు శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శివాలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవత మూర్తులు కలరు. ప్రభావవంతమైన శివలింగ ప్రతిష్ట సప్తఋషుల ద్వారా జరిగినట్లు చెప్పబడుచున్నది. శ్రీ మల్లేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణశుద్ధ ఏకాదశి నుండి శుద్ధ పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి రాత్రులు ఘనంగా జరుగుతాయి. తులరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. శ్రీ లక్ష్మీ సమేత జనార్ధనస్వామి వారి ఆలయ దర్శనం పుణ్యధాయకం.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం - మండ పేట ప్రధాన రహదారి నందు మాచవరం సెంటర్ ఉంది. దీనిని సోమేశ్వరం వంతెన అని పిలుస్తారు. ఇక్కడ నుంచి మారేడుబాక ఆటోలు ఉంటాయి.

* రామచంద్రపురం - మండపేట ఆటోలు (వయా) మారేడుబాక మీదగా ఉంటాయి. రామచంద్రపురం (రాజగోపాల సెంటర్) నుంచి కూడ మండపేట దొరుకుతాయి.

మండపేట నుంచి మారేడుబాక కు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

**NOTE:** ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత అగస్తేశ్వర కైలాసేశ్వర స్వామి

తులరాశి, స్వాతి నక్షత్రం (2 వ పాదం)

మండపేట గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ అయినవిల్లి సూర్య సుబ్రహ్మణ్య శర్మ, సెల్ నెం: 94917 18899 .



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 21 kms. దూరాన, మండపేట (Mandapeta) ఉంది. ఇది కోనసీమ జిల్లా, ఆలమూరు మండలంకు చెందినది. మండపేట నందు శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత అగస్తేశ్వర కైలాసేశ్వర స్వామి (శివాలయం) కలదు. స్థానికలు " రథం గుడి " అని పిలుస్తారు. అగస్త్య మహర్షి ప్రతిష్టించిన పంచ అగస్త్యేశ్వర ఆలయ కూటమిలో మండపేట క్షేత్రం ఒకటి (చెల్లూరు, తాపేశ్వరం, అర్తమూరు, వల్లూరు క్షేత్రాలు మిగిలిన ప్రతిష్టలు). శ్రీ అగస్తేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి. శివాలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. శివాలయం (రథం గుడి) ప్రాంగణములో శ్రీ అగస్త్యేశ్వర స్వామి, శ్రీ జనార్దన స్వామి మరియు ఇతర దేవత మూర్తులు దర్శనమిస్తారు. రథం గుడి లో శ్రీ బాలా త్రిపుర సుందరి సమేత అగస్త్యేశ్వర స్వామి (శివాలయం) మరియు శ్రీదేవి భూదేవి సమేత జనార్ధన స్వామి ఆలయాలు తూర్పు అభిముఖంగా ఉంటాయి. శివ - కేశవ ఆలయాలు ఒకే ప్రాంగణంలో ఉండుట విశేషం. వీరితో పాటు శ్రీ రమా సమేత సత్యనారాయణ, శ్రీ సీతారామచంద్రమూర్తి, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర సన్నిధిలు, అద్దాలమండపం మొదలగునవి కలవు.

**స్థల పురాణం:** 17 వ శతాబ్దం లో పెద్దాపురం మహారాజ శ్రీ రాజా వత్సవాయి సూర్యనారాయణ తిమ్మజగపతి వర్మ ఒక శివాలయం నిర్మించుటకు ఒక శివలింగాన్ని తెప్పించినారు. భూమి పూజలో (తవ్వకాల్లో) అగస్త్య మహర్షి ప్రతిష్టించిన శివలింగము బయటపడినది. ఆ రెండు శివలింగాలు ప్రతిష్టించినారు. వీటిని శ్రీ అగస్తేశ్వర స్వామి మరియు శ్రీ కైలాసేశ్వర స్వామిగా పిలుస్తారు.

**ఆలయం:** శ్రీ అగస్తేశ్వర కైలాసేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి రాత్రులు ఘనంగా జరుగుతాయి. తులరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. శ్రీ లక్ష్మీ సమేత జనార్ధనస్వామి వారి ఆలయ దర్శనం పుణ్యధాయకం.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం ప్రధాన రహదారిలో మండపేట ఉంది. మండపేట - ఆలమూరు రోడ్డులో మండపేట రథం సెంటర్ ఉంటుంది. మండపేట (రథం సెంటర్) కు సుమారు ఒక Km. దూరాన (లోపలకి) రథం గుడి ఉంటుంది.

* మండపేట బస్ స్టాండ్ నుంచి రథం గుడి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 1.5 Kms.

* రాజమండ్రి - కోటిపల్లి & రాజమండ్రి - యానాం బస్సులు (వయా) మండపేట బస్ స్టాండ్ మీదగా ఉంటాయి.



శ్రీ ఉమా సమేత రామలింగ కోటేశ్వర స్వామి

తులరాశి, స్వాతి నక్షత్రం (3 వ పాదం)

గుమ్మిలేరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పుల్లేటికుర్తి వెంకట సుబ్రహ్మణ్య శర్మ, సెల్ నెం: 98480 84086.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం - దక్షిణ దిశగా, సుమారు 25 kms. దూరాన, గుమ్మిలేరు (Gummileru) గ్రామం ఉంది. ఇది కోనసీమ జిల్లా, ఆలమూరు మండలంకు చెందినది. గుమ్మిలేరు నందు శ్రీ ఉమా సమేత రామలింగ కోటేశ్వర స్వామి (శివాలయం) కలదు. శ్రీ రామలింగ కోటేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శివాలయం చాల ప్రాచీనమైనది. పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, గణపతి, నాగబంధము , చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవత మూర్తులు కలరు. శ్రీ రామలింగ కోటేశ్వర స్వామికి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు ఆశ్వయుజ శుద్ధ ఏకాదశి నుండి శుద్ధ పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి రాత్రులు ఘనంగా జరుగుతాయి. తులరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం ప్రధాన రహదారిలో గుమ్మిలేరు ఉంది. మండపేట - ఆలమూరు రోడ్డులో గుమ్మిలేరు శివాలయం ఉంటుంది.

* మండపేట బస్ స్టాండ్ నుంచి గుమ్మిలేరు కి బస్సులు/ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 5 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ పార్వతి సమేత సోమేశ్వర స్వామి

తులరాశి, స్వాతి నక్షత్రం (4 వ పాదం)

వెంటూరు గ్రామం

అష్ట సోమేశ్వరాలయాలు (పశ్చిమ క్షేత్రం)

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ మద్దిరాల సాయికిరణ్, సెల్ నెం. 9505540807



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి పశ్చిమ దిశగా, సుమారు 14 kms. దూరాన, వెంటూరు (Venturu) గ్రామం కలదు. రామచంద్రపురం - ద్రాక్షారామ రోడ్డులో వెంటూరు గ్రామం ఉంటుంది. క్షేత్రం నందు శ్రీ సోమేశ్వరాలయం కలదు. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** వెంటూరు గ్రామంలో శ్రీ సోమేశ్వరాలయం మరియు శ్రీ కేశవ స్వామి ఆలయం ఒకే ప్రాంగణములో ఉంటాయి. శివ-కేశవులకు ధ్వజస్థంభాలు వేరు వేరుగా ఉంటాయి. ఆలయ సమూహం విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయం తూర్పు అభిముఖముగా ఉంటుంది. ప్రధానాలయం తో పాటు శ్రీ దేవి - భూ దేవి సమేత శ్రీ కేశవ స్వామి ఆలయం, శ్రీ వల్లీ - దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి ఆలయం కలవు. శివాలయం నకు ఉత్తర భాగములో శ్రీ చండీశ్వర స్వామి, నవగ్రహములు కూడ ఉన్నాయి. ప్రధానాలయం నందు శ్రీ సోమేశ్వర లింగము దర్శనమిస్తుంది. అంతరాళయం నందు గణపతి, పార్వతి, ఉత్సవమూర్తులు, నందీశ్వరుడు కొలువై ఉంటారు. స్వామి వారి గర్భాలయం నకు ఎడమ భాగం (ఉత్తరం వైపు) పార్వతి అమ్మవారి సన్నిధి మరియు కుడి భాగం (దక్షిణ వైపు) గణపతి సన్నిధి ఉంటాయి. ముఖ మండపం నందు రాతి నందిని చూడగలము.

ప్రధానాలయం నకు దక్షిణ వైపు శ్రీ దేవి - భూ దేవి సమేత శ్రీ కేశవ స్వామి ఆలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. విష్ణ్వాలయం నకు కూడ ధ్వజస్తంభము, ప్రవేశ ద్వారం ఉంటాయి. శ్రీ కేశవ స్వామి & శ్రీ సోమేశ్వర స్వామి వారి కళ్యాణం ఏక కాలములో జరుగుతాయి. శివాలయం నకు ఉత్తరం వైపు శ్రీ వల్లీ - దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి ఆలయం మరియు ధ్వజస్తంభము ఉంటాయి. సుబ్బారాయుడు షష్టి సందర్భముగా శ్రీ సుబ్రహ్మణ్య స్వామి వారి కళ్యాణం నిర్వహించుతారు. శివాలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు జరుగుతాయి. వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు శివ-కేశవులకు ఏక కాలములో కళ్యాణ ఉత్సవాలు పాంచాహ్నికంగా నిర్వహించుతారు. మహా శివరాత్రి సందర్భముగా సోమేశ్వర లింగము నకు విశేష అభిషేకాలు జరుగుతాయి. రాత్రికి లింగోద్భవ సమయంలో లక్ష పత్రి పూజ నిర్వహించుతారు. ప్రతి మాసశివరాత్రికి కూడ లక్ష పత్రి పూజ జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు, అభిషేకాలు & లక్ష పత్రి పూజ జరుగుతాయి. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు విశేషముగా ఉంటుయి. సుబ్బారాయుడు షష్ఠి దర్శనాలు విశేషముగా జరుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నకు వాయువ్య దిశగా, సుమారు 6 kms. దూరంలో రాజగోపాల సెంటర్ (రామచంద్రపురం) ఉంటుంది. ద్రాక్షారామం నుంచి బస్సులు / ఆటోలు దొరుకుతాయి. * రాజగోపాల సెంటర్ నుంచి రామచంద్రపురం మార్కెట్టు సెంటర్ కు ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 01 కీ.మీ

* రామచంద్రపురం (మార్కెట్టు సెంటర్) నుంచి పామర్రు ఆటోలు (వయా) ముచ్చిమిల్లి, వెంటూరు మీదగా ఉంటాయి. రామచంద్రపురం మార్కెట్టు సెంటర్ నుంచి వెంటూరు దూరం సుమారు 05 కీ.మీ

* రామచంద్రపురం - వాకతిప్ప బస్సులు (వయా) వెంటూరు మీదగా ఉంటాయి.

ఆలయ సమాచారం & Photos అందించిన వెంటూరు - శ్రీ పార్వతీ సమేత సోమేశ్వరాలయ ఆలయ అర్చక స్వామి శ్రీ మద్దిరాల సాయికిరణ్, సెల్ నెం. 9505540807 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ బాలా త్రిపురసుందరీ దేవి సమేత అగస్త్యేశ్వర స్వామి

తులారాశి, విశాఖ నక్షత్రం (1 వ పాదం)

దుళ్ళ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ బాదంపూడి వెంకట శివయ్య శర్మ, సెల్ నెం. 9908086836




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా, సుమారు 28 kms. దూరాన దుళ్ళ (Dulla) అను గ్రామం కలదు. మండపేట - ఏడిది - కడియం రోడ్డు మార్గములో దుళ్ళ గ్రామం ఉంటుంది. పూర్వం దూర్వాసపురంగా పిలిచేవారు. అగస్త్య మహర్షి వాతాపి అను ఒక బ్రహ్మ రాక్షసుని సంహరించాడు. పాప పరిహారార్థం మహర్షి ఒక శివ లింగమును ప్రతిష్టించినట్లు స్థల పురాణం తెల్పుతుంది.
ఆ లింగము శ్రీ అగస్త్యేశ్వర లింగముగా ఖ్యాతి పొందింది. అమ్మ వారు శ్రీ బాలా త్రిపురసుందరీ దేవిగా భక్తుల సేవలు స్వీకరించు చున్నారు. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

శ్లో|| వాతాపి దైత్యదమన దోషశాంతి చికీర్షయా
బాలాత్రిపురయా శంభుః అగస్త్యేన ప్రతిష్ఠితః!!
శ్రీ దుర్వాసపురే రమ్యే సర్వసంపత్సమన్వితే
అగస్త్యేశ్వర నామ్నాసౌ లోకాన వతిసర్వదా!!

**ఆలయం:** దుళ్ళ గ్రామం లోని శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత శ్రీ అగస్త్యేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. ఇది అగస్త్య మహర్షి ప్రతిష్టగా చెప్పబడుతుంది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. మూడు అంతస్థుల గాలిగోపురం పశ్చిమాభిముఖంగా ఉంటుంది. గాలిగోపురం నకు ఎడమ భాగములో భారీ నటరాజు మూర్తి విగ్రహం కలదు. గాలిగోపురం క్రింద నుంచి ఆలయ ప్రవేశం జరుగుతుంది. ఆలయ ప్రాంగణము చాల విశాలముగా ఉంటుంది. ధ్వజ స్థంబం, ప్రధానాలయం, చండీశ్వరుడు, నవగ్రహ మండపం ఉంటాయి. ముఖ మండపం నందు నందీశ్వరుడు ఉంటాడు. శ్రీ బాలా త్రిపురసుందరీ దేవి మరియు వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి వారి సన్నిధిలు కలవు. అంతరాలయం నందు గణపతి, ఆంజనేయ స్వామి కొలువైన్నారు. గర్భాలయం నందు శ్రీ అగస్త్యేశ్వర లింగము దర్శనమిస్తుంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, అభిషేక శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం మాఘ బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. సంక్రాంతి, దీపావళీ మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా జరుగుతాయి.

శ్రీ అగస్త్యేశ్వర లింగము, విశాఖ నక్షత్రం (1 వ పాదం) చెందినది. విశాఖ నక్షత్రం నందలి 1 వ పాదము లో జన్మంచిన స్త్రీ వలన మరదలుకి, పురుషుడు వలన బావమరిదికి దోషం కలుగను. విశాఖ నక్షత్రం (1 వ పాదం) నందు జన్మించిన వారికి ఆలయం నందు శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి రాజమండ్రి బస్సులు (via) రామచంద్రపురం, మండపేట మీదగా ఉంటాయి.

* మండపేట (కలువ పువ్వు సెంటర్) నుంచి దుళ్ళ గ్రామం నకు (via) ఏడిది మీదగా ఆటోలు దొరుకుతాయి. మండపేట నుంచి దుళ్ళ గ్రామం దూరం సుమారు 08 Kms. గా ఉంటుంది.

ఆలయ సమాచారం & Photos అందించిన దుళ్ళ - శ్రీ అగస్త్యేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ బాదంపూడి వెంకట శివయ్య శర్మ, సెల్ నెం. 9908086836 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





### శ్రీ ఉమా పార్వతీ సమేత సోమేశ్వర స్వామి

### తులారాశి, విశాఖ నక్షత్రం (2 వ పాదం)

### నర్సిపూడి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కాళ్ళకూరి కాశీ శేఖర్ బాబు, సెల్ నెం. 9908810995




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా సుమారు 29 kms. దూరాన నర్సిపూడి (Narsipudi) అను గ్రామం కలదు. మండపేట - ఆలమూరు రోడ్డు మార్గములో గుమ్మిలేరు గ్రామం ఉంటుంది. గుమ్మిలేరు బస్ స్టాప్ కు వాయువ్యం దిశగా సుమారు 04 Kms. దూరంలో నర్సిపూడి గ్రామం కలదు. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** నర్సిపూడి గ్రామం లోని శ్రీ ఉమా పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. జగద్గురువులు చంద్రశేఖర స్వామిజీ మరియు జయేంద్ర సరస్వతీ స్వామివారు నర్సిపూడి శివాలయం సందర్శించినారు. జగద్గురు చంద్రశేఖరేంద్ర సరస్వతి వారు
కంచి కామకోటి పీఠం నకు 68 వ పీఠాధిపతి. వీరు దేశమంతటా 3 సార్లు పాదయాత్రలు చేశారు. చంద్రశేఖర స్వామిజీతో పాటు జయేంద్ర సరస్వతీ స్వామివారు కూడ పాదయాత్రలు చేశారు. జగద్గురువులు తమ యాత్రలో అనేక ఆలయాలు సందర్శించినారు. ఆ యాత్రలో నర్సిపూడి గ్రామం లోని శ్రీ ఉమా పార్వతీ సమేత సోమేశ్వర ఆలయం ఒకటి. జగద్గురువులు నర్సిపూడి ఆలయం నందు అయ్య వారికి అభిషేకాలు, అమ్మ వారికి అర్చనలు నిర్వహించారు అని గ్రామ ఆర్యులు చెప్పుచుంటారు.

ప్రస్తుత ఆలయం 2009 సంవత్సరములో జీర్ణోదరణ గావించారు. 2011 సంవత్సరములో పునః ప్రతిష్ట జరిగింది. తూర్పు ముఖద్వాం నుంచి ఆలయ ప్రవేశం జరుగుతుంది.
ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయం నకు తూర్పున ధ్వజస్థంభం, ఆగ్నేయ మూల యాగ శాల, వాయువ్య మూల పంచముఖ ఆంజనేయస్వామి, వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి మరియు ఈశాన్య మూల నవగ్రహ మండపం ఉన్నాయి. ఆలయ ప్రాంగణములో చండీశ్వర స్వామి ఉన్నాడు. ముఖ మండపం నందు నందీశ్వరుడు ఉంటాడు. శ్రీ ఉమా పార్వతీ దేవి మరియు గణపతి స్వామి వారి సన్నిధిలు కలవు. అంతరాలయం నందు ఉత్సవ మూర్తులు కొలువైన్నారు. గర్భాలయం నందు శ్రీ సోమేశ్వర లింగము దర్శనమిస్తుంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. సంక్రాంతి, దీపావళీ మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా జరుగుతాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి రాజమండ్రి బస్సులు (via)  రామచంద్రపురం, మండపేట మీదగా ఉంటాయి.

* మండపేట (కలువ పువ్వు సెంటర్) నుంచి నర్సిపూడి గ్రామం నకు (via) గుమ్మిలేరు మీదగా ఆటోలు దొరుకుతాయి.

మండపేట నుంచి నర్సిపూడి గ్రామం దూరం సుమారు 09 Kms. గా ఉంటుంది.

* గుమ్మిలేరు నుంచి నర్సిపూడి గ్రామం నకు ఆటోలు ఉంటాయి. గుమ్మిలేరు నుంచి నర్సిపూడి గ్రామం దూరం సుమారు 04 Kms. గా ఉంటుంది.

ఆలయ సమాచారం & Photos అందించిన నర్సిపూడి - శ్రీ సోమేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కాళ్ళకూరి కాశీ శేఖర్ బాబు, సెల్ నెం. 9908810995 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ పార్వతీ సమేత సోమేశ్వరస్వామి

తులారాశి, విశాఖ నక్షత్రం (3 వ పాదం)

నవాబుపేట గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పుల్లేటికుర్తి శివకేశవ శర్మ, సెల్ నెం: 99590 32225



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా సుమారు 31 kms. దూరాన నవాబుపేట (Navabupeta) అను గ్రామం కలదు. మండపేట - ఆలమూరు రోడ్డు మార్గములో కొత్తూరు సెంటర్ ఉంటుంది. కొత్తూరు సెంటర్ బస్ స్టాప్ కు వాయువ్యం దిశగా సుమారు 05 Kms. దూరంలో నవాబుపేట గ్రామం కలదు. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం విశాఖ నక్షత్రం (3 వ పాదం) చెందినది.

శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, గణపతి, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు నంది మూర్తులు కలరు. శ్రీ సోమేశ్వర లింగంకి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి రాత్రులు ఘనంగా జరుగుతాయి. తులరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

మండపేట (కలువ పువ్వు సెంటర్) నుంచి నవాబుపేట గ్రామం నకు ఆటోలు దొరుకుతాయి. మండపేట నుంచి నవాబుపేట గ్రామం దూరం సుమారు 12 Kms. గా ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.






రాశి చక్రంలో వృశ్చిక రాశి **ఎనిమిదవది.**

ఈ రాశి **రాశ్యధిపతి కుజుడు.**

ఈ రాశి సమ రాశి, శుభరాశి, స్త్రీరాశి, సరి రాశి, స్త్రీరాశి, స్థిర స్వభావరాశి, జలరాశి, కీటకరాశిగాను వ్యవహరిస్తారు.

వృశ్చిక రాశి 9 ఆలయాలు ఉంటాయి.

**విశాఖ నక్షత్రంలోని 4 పాదము ,**

**అనురాధ నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు**

**మరియు జ్యేష్ఠ నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు**

9 ఆలయాలు కలిసి వృశ్చిక రాశిగా వ్యవహరిస్తారు.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి

వృశ్చికరాశి, విశాఖ నక్షత్రం (4 వ పాదం)

కూర్మాపురం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ S. పట్టాభి రామయ్య సెల్ నెం: 94411 43491 & 95732 46236, శ్రీ తేజ సెల్ నెం: 81249 13393 & శ్రీ పుల్లేటికుర్తి ఉమా మల్లేశ్వరరావు , సెల్ నెం: 94920 77744



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి పశ్చిమ-ఆగ్నేయం దిశగా సుమారు 18 kms. దూరాన కూర్మాపురం (Kurmapuram) అను గ్రామం కలదు. రామచంద్రపురం నుంచి వాకతిప్ప బస్సులు (వయా) ముచ్చిమిల్లి, వెంటూరు, కురకాళ్ళపల్లి, పామర్రు మీదగా ఉంటాయి. కురకాళ్ళపల్లి బస్ స్టాప్ కు పశ్చిమ దిశగా సుమారు 2.5 Kms. దూరంలో కూర్మాపురం గ్రామం కలదు. ఇచ్చట శ్రీ రామలింగేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం విశాఖ నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయములో గణపతి, నాగబంధము, కుమారస్వామి దర్శనమిస్తారు.
ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ రామలింగేశ్వరలింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు సుబ్రహ్మణ్య షష్ఠి, శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. తులరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

రామచంద్రపురం (మార్కెట్టు సెంటర్) నుంచి పామర్రు ఆటోలు (వయా) ముచ్చిమిల్లి, వెంటూరు, కురకాళ్ళపల్లి మీదగా ఉంటాయి. కురకాళ్ళపల్లి నుంచి కూర్మాపురం కు ఆటోలు ఏర్పాట్టు చేసుకోవాలి. రామచంద్రపురం మార్కెట్టు సెంటర్ నుంచి కూర్మాపురం దూరం సుమారు 10 కి.మీ.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత ఇష్టకాంతేశ్వర స్వామి

వృశ్చికరాశి, అనురాధ నక్షత్రం (1 వ పాదం)

పెనికేరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పుల్లేటికుర్తి సాంబ శివశర్మ (దొరబాబు), సెల్ నెం. 9866486437



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి పశ్చిమ దిశగా, సుమారు 30 kms. దూరాన పెనికేరు (Penikeru) అను గ్రామం కలదు. మండపేట - ఆలమూరు రోడ్డు మార్గములో కొత్తూరు సెంటర్ ఉంటుంది. కొత్తూరు సెంటర్ బస్ స్టాప్ కు వాయువ్యం దిశగా సుమారు 02 Kms. దూరంలో (లోపలకి) పెనికేరు గ్రామం కలదు. ఇచ్చట శ్రీ ఇష్టకాంతేశ్వర లింగమును దర్శించగలము. ఇది వ్యాస ప్రతిష్టగా ప్రతీతి. శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత ఇష్టకాంతేశ్వర స్వామి వారి ఆలయం అనురాధ నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ ఇష్టకాంతేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**స్థల పురాణం:** ఒకనాడు వ్యాస మునిని పరిశీలించాలని కాశీ విశ్వేశ్వరుడు అనుకున్నాడు. దాని ఫలితంగా కాశీ పురంలో వ్యాస మునికి, అతని శిష్యులుకు భిక్షం దొరకలేదు. శిష్యుల ఆకలి భాద చూడలేక కాశీ పురం నకు శాపం ఇవ్వడానికి వ్యాస మహర్షి సిద్ధపడ్డాడు. అప్పుడు అన్నపూర్ణదేవి వ్యాస పరివారం నకు భోజనం ప్రసాధించుతుంది. సంతృప్తి చెందిన వ్యాసుని మరియు అతని శిష్యులను కాశీని విడిచిపెట్టమని కాశీ మాత ఆదేశించుతుంది. అన్నపూర్ణదేవి మాటకు వ్యాస ముని దుఖీఃచాడు. ఆ సమయం లో విశ్వేశ్వరుడు వ్యాసునితో ఇట్లు పలికెను " ఓ మహర్షి కాశీతో సమానమైన ద్రాక్షరామానికి వెళ్ళు " అని సలహా ఇచ్చాడు. శివాజ్ఞ ప్రకారం దక్షిణ కాశీ అయిన ద్రాక్షారామం నకు వ్యాసు మహర్షి చేరుకొంటాడు. అప్పటికే దక్షిణ ప్రాంతము చేరుకున్న అగస్త్యుడు (మహర్షి) ద్రాక్షారామ పరిసర ప్రాంతాలను (భీమమండలము) వ్యాసుడుకి పరిచయం చేస్తాడు. వ్యాసుడు తన తపస్సు మహిమతో ఆకాశ ప్రయాణం లో భీమమండలము సందర్శించినాడు. వ్యాసుడు యాత్రలో పెనికేరు క్షేత్రం ఉండుట విశేషం. పెనికేరు ప్రాంతములో వ్యాసుడు ఒక నిద్ర చేస్తాడు. సూర్యోదయం జరిగిన తరువాత వ్యాసుడు తన తపోశక్తితో ఒక శివ లింగమును సృష్టించి, దానిని ప్రతిష్టించాడు. శివ లింగము నకు ఇష్టకాంతేశ్వర స్వామిగా నామకరణం గావించి మరియు సేవించాడు. వ్యాసుడు సందర్శించిన ఆకాశ భీమమండల యాత్రని శ్రీనాథుడు భీమేశ్వరపురాణం నందు గొప్పగా వర్ణించాడు.

**ఆలయం:** పెనికేరు గ్రామం లోని శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత ఇష్టకాంతేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. నేటి ఆలయం శిథిలావస్థకు చేరుకోబోతుంది. గ్రామస్థులు, దాతలు ముందుకు వచ్చి ఆలయ అభివృద్ధికి కృషి చేయాలి. ప్రాచీన ఆలయాలు పునరుద్ధరించి, ముందు తరాలకు కానుకగా అందించాలి. ఆలయ ప్రాంగణము విశాలముగా ఉంటుంది. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయం నకు తూర్పున ధ్వజస్థభం, ఆగ్నేయ మూల హోమ గుండం, వాయువ్య మూల వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి, చర నంది, ప్రాచీన మూర్తులు ఉంటారు. మండపం పైన గణపతి & శివాకృతి ఉన్నారు. ఉత్తర వైపున నాగబంధం కలదు. ముఖ

మండపం నందు నందీశ్వరుడు ఉంటాడు. అయ్యప్ప, సుబ్రహ్మణ్య స్వామి మూర్తులు చిన్న చిన్న గూటిలో కొలువైయున్నారు. అంతరాలయం నందు గణపతి స్వామి కొలువైన్నాడు. గర్భాలయం నందు శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత ఇష్టకాంతేశ్వర స్వామి దర్శనమిస్తారు. స్వామి వామ భాగం నందు శ్రీ బాలా త్రిపురసుందరీ దేవి కొలువుదీరింది. అమ్మ స్వయంభూ మూర్తి. పెనికేరు వెలసిన శ్రీ ఇష్టకాంతేశ్వర స్వామి గొప్ప మహిమ గల వానిగా నిత్యాభిషేకములతో విరాజిల్లుతూ భక్తుల కోరికలు తీరుస్తూ భక్త వత్సలుడైనాడు. స్వామి కృపతో సుఖ, సంతోష, ఆయురోగ్య, విజయ, ఐశ్వర్య, భోగ భాగ్యములు కలుగుతాయి. భక్తులు ఒక మండలం (41 రోజులు) శ్రీ ఇష్టకాంతేశ్వర స్వామిని సేవించి, ఆరాధించుట వలన వారి ఇష్ట కార్యములు సిద్ధించ గలవు అని ఒక గట్టి నమ్మకం అనాది నుంచి ఉంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం చైత్ర బహుళ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక మాసంలో లక్ష రుద్రాక్షల పూజ / లక్ష బిల్వ పత్ర పూజ నిర్వహించుతారు. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. మహాశివరాత్రి నాడు కోటిదీపోత్సవం నిర్వహించుతారు. సంక్రాంతి, తొలి ఏకాదశి, దీపావళీ, సుబ్రహ్మణ్య షష్ఠి మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా జరుగుతాయి.

శ్రీ ఇష్టకాంతేశ్వర లింగము, అనురాధ నక్షత్రం (1 వ పాదం) చెందినది. అనురాధ నక్షత్రం నందలి 1 వ పాదము లో జన్మించిన వారికి ఆలయం నందు అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి రాజమండ్రి బస్సులు (via) రామచంద్రపురం, మండపేట మీదగా ఉంటాయి.

* మండపేట (కలువ పువ్వు సెంటర్) నుంచి పెనికేరు గ్రామం నకు (via) గుమ్మిలేరు, కొత్తూరు సెంటర్ మీదగా ఆటోలు దొరుకుతాయి. మండపేట నుంచి పెనికేరు గ్రామం దూరం సుమారు 11 Kms. గా ఉంటుంది.

2) కాకినాడ - రావులపాలెం బస్సులు (via) కరప, రామచంద్రపురం, మండపేట, గుమ్మిలేరు, కొత్తూరు సెంటర్ మీదగా ఉంటాయి.

* కొత్తూరు సెంటర్ నుంచి పెనికేరు గ్రామం నకు ఆటోలు ఉంటాయి. కొత్తూరు సెంటర్ నుంచి పెనికేరు గ్రామం దూరం సుమారు 02 Kms. గా ఉంటుంది.

ఆలయ సమాచారం & Photos అందించిన పెనికేరు - శ్రీ ఇష్టకాంతేశ్వర స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ పుల్లేటికుర్తి సాంబ శివశర్మ (దొరబాబు), సెల్ నెం. 9866486437 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత పృథ్వీశ్వర స్వామి

వృశ్చికరాశి, అనూరాధ నక్షత్రం (2 వ పాదం)

చింతలూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** ఆలయ అర్చకులు శ్రీ గూడూరి వెంకటరమణ మూర్తి , సెల్ నెం: 94401 54372.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి పశ్చిమ దిశగా సుమారు 25 kms. దూరాన చింతలూరు (Chintaluru) అను గ్రామం కలదు. మండపేట - ఆలమూరు రోడ్డు మార్గములో కొత్తూరు సెంటర్ ఉంటుంది. ఇక్కడ బస్సులు ఆగుతాయి. కొత్తూరు సెంటర్ నుంచి చింతలూరు గ్రామం నకు ఆటోలు ఉంటాయి. ఇచ్చట శ్రీ పృథ్వీశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత పృథ్వీశ్వర స్వామి వారి ఆలయం అనూరాధ నక్షత్రం (2 వ పాదం) చెందినది.

శ్రీ పృథ్వీశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత పృథ్వీశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. గణపతి, గాయత్రి దేవి దర్శనమిస్తారు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ పృథ్వీశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ బహుళ ఏకాదశి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. వృశ్చికరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**స్థల పురాణం:** పృథ్వీశ్వర లింగము స్వయంభువుగా చెబుతారు. పూర్వం ఆలయం గల ప్రాంతం లో దట్టమైన పొదలతోను లతలతోను నిండివుండేదట. ఒకనాడు ఒక ఎరుకలవాడు కొంగను వేటాడుటకై పంగళ కర్రతో దాన్ని కొట్టగా ఆ కొంగ గాయపడింది. ఆ కొంగ అతనికి కనబడలేదట. పొదలను తొలగించి వెతుకగా, పొదలమధ్య గుండ్రటి రాయి దానిపైన రక్తపు మరకలు కనిపించాయట. అతడు భయంతో వారి కులపెద్దలకు ఈ విషయాన్ని వివరించి, రక్తం కక్కుకుని మరణించినట్లుగాను చెప్పుచుంటారు. ఆ విషయాన్ని కులపెద్దలు అప్పటి చింతలూరు కరణం గారికి తెలియజేయగా, ఆయన ఆ ప్రాంతాన్ని శుభ్రపరచి, ఆ రాతి యొక్క మూలం కనుగొనడానికి త్రవ్వకాలు ప్రారంభించారట. ఎంత లోతుకు త్రవ్వినా ఆ శిల అంతు దొరకలేదట! సుమారు ఒక పెద్ద తాటిచెట్టు ప్రమాణంలో త్రవ్విన తరువాత ఆ శిల చెరువు వైపు మళ్ళినట్లుగా గమనించారట. అంత ఇక త్రవ్వడం తమ వల్ల కాదని గ్రహించి ఎక్కడ ఆలింగం కనబడిందో అక్కడే పానపట్టంతో ఒక పీఠమును ఏర్పరచి, ఆ రాతికి తాత్కాలికంగా ఒక మందిరాన్ని ఏర్పాటు చేశారట! పృథ్వి (భూమి) నుండి ఉద్భవించిన కారణంగా, ఆ శివస్వరూపానికి పృథ్వీశ్వర నామాన్ని నిర్ణయించారు అని చెప్పుచుంటారు.

పృథ్వీశ్వర శివాలయము నకు చేర్చి అత్యద్భుత శిల్పకళతో నిర్మించబడ్డ ధన్వంతరి ఆలయం కలదు. దీనిని శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేదనిలయం/ చింతలూరు వ్యవస్థాపకులు ద్విభాష్యం వేంకటేశ్వర్లుగారు నిర్మించారు. ధన్వంతరి ఆలయం విశాలమైన ముఖమంటపము మరియు చక్కని పరిసరాలతో అత్యంత హృద్యంగా నిర్మించబడినది. సుబ్రహ్మణ్య షష్ఠి మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా జరుగుతాయి.చింతలూరు గ్రామ దేవత నూకాలమ్మ అమ్మవారి ఆలయం లోక ప్రసిద్ధి.

**రవాణా సమాచారం:** మండపేట - రావులపాలెం బస్సులు / ఆటోలు కొత్తూరు సెంటర్ మీదగా ఉంటాయి.

* కొత్తూరు సెంటర్ నుంచి చింతలూరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. కొత్తూరు సెంటర్ నుంచి చింతలూరు దూరం సుమారు 1 కి.మ

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





### శ్రీ పార్వతీ సమేత నీలకంఠేశ్వర స్వామి

### వృశ్చికరాశి, అనూరాధ నక్షత్రం (3 వ పాదం)

### పినపళ్ళ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొమాళ్ళపల్లి మహేశ్, సెల్ నెం. 94913 18406




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి తూర్పు దిశగా, సుమారు 24 kms. దూరాన పినపళ్ళ గ్రామం (Pinapalla) గ్రామం కలదు. వెదురుమూడి - కొత్తూరు రోడ్డు మార్గములో పినపళ్ళ బస్ స్టాప్ ఉంటుంది. పినపళ్ళ బస్ స్టాప్ కు సుమారు 500 మీటర్లు లోపలకి (ఉత్తరం దిశ) శ్రీ పార్వతీ సమేత శ్రీ నీలకంఠేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ నీలకంఠేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** పినపళ్ళ గ్రామం లోని శ్రీ పార్వతీ సమేత శ్రీ నీలకంఠేశ్వరాలయం చాల ప్రాచీనమైనది. ఇది మార్కండేయ మహర్షి ప్రతిష్టగా చెప్పుబడుతుంది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్ధంబం, ప్రధానాలయం ఉంటాయి.

ముఖ మండపం నందు నందీశ్వరుడు, అంతరాలయం నందు గణపతి, సుబ్రహ్మణ్య స్వామి కొలువైన్నారు. గర్భాలయం నందు శ్రీ నీలకంఠేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ పార్వతీ దేవి కొలువుదీరింది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం జ్యేష్ట శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. శ్రీ నీలకంఠేశ్వర లింగము అనూరాధ నక్షత్రం (3 వ పాదం) చెందినది. అనూరాధ నక్షత్రం (3 వ పాదం) నందు జన్మించిన వారికి శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం బస్సులు (via) కరప, మండపేట, గుమ్మిలేరు, కొత్తూరు సెంటర్ మీదగా ఉంటాయి.

* కాకినాడ - కొత్తూరు సెంటర్ దూరం 52 Kms. కొత్తూరు సెంటర్ నుంచి వెదురుమూడి (Via) కొత్తూరు, పినపళ్ళ బస్ స్టాప్ మీదగా ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 3 Kms. మాత్రమే. పినపళ్ళ బస్ స్టాప్ నుంచి పినపళ్ళ గ్రామం కు ఆటోలు చాల తక్కువగా దొరుకుతాయి. పినపళ్ళ బస్ స్టాప్ నుంచి పినపళ్ళ గ్రామం దూరం సుమారు 500 meters.
* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం,
* వెదురుమూడి, కొత్తూరు, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువగా ఉంటాయి.
* కొత్తూరు సెంటర్ నుంచి వెదురుమూడి (Via) కొత్తూరు, పినపళ్ళ బస్ స్టాప్ మీదగా ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 3 Kms. మాత్రమే. పినపళ్ళ బస్ స్టాప్ నుంచి పినపళ్ళ గ్రామం కు ఆటోలు చాల తక్కువగా దొరుకుతాయి. పినపళ్ళ బస్ స్టాప్ నుంచి పినపళ్ళ గ్రామం దూరం సుమారు 500 meters.

ఆలయ సమాచారం & Photos అందించిన పినపళ్ళ - శ్రీ నీలకంఠేశ్వరాలయం స్వామి, ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొమాళ్ళపల్లి మహేశ్, సెల్ నెం. 94913 18406 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.

పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి

వృశ్చికరాశి, అనూరాధ నక్షత్రం (4 వ పాదం)

పెదపళ్ళ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ బుచ్చి శివరామశాస్త్రి సెల్: 9989282253, పండు సెల్: 9989990029 మరియు శ్రీ ఇలపర్తి సీతారామశాస్త్రి సెల్ : 73825 76596.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి పశ్చిమ దిశగా సుమారు 25 kms. దూరాన పెదపళ్ళ (Pedapalla) అను గ్రామం కలదు. మండపేట - ఆలమూరు రోడ్డు మార్గములో కొత్తూరు సెంటర్ ఉంటుంది. ఇక్కడ బస్సులు ఆగుతాయి. కొత్తూరు సెంటర్ నుంచి పెదపళ్ళ గ్రామం నకు ఆటోలు ఉంటాయి. ఇచ్చట శ్రీ రామలింగేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం అనూరాధ నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ రామలింగేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ బహుళ ఏకాదశి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. వృశ్చికరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం బస్సులు (via) కరప, మండపేట, గుమ్మిలేరు, కొత్తూరు సెంటర్ మీదగా ఉంటాయి.

* కాకినాడ - కొత్తూరు సెంటర్ దూరం 52 Kms.

* కొత్తూరు సెంటర్ నుంచి వెదురుమూడి (Via) కొత్తూరు, పెదపళ్ళ, పినపళ్ళ బస్ స్టాప్ మీదగా ఆటోలు ఉంటాయి. కొత్తూరు సెంటర్ నుంచి పెదపళ్ళ బస్ స్టాప్ మధ్య దూరం సుమారు 2 Kms. మాత్రమే. పెదపళ్ళ బస్ స్టాప్ నుంచి

* పెదపళ్ళ గ్రామం కు ఆటోలు చాల తక్కువగా దొరుకుతాయి. పెదపళ్ళ బస్ స్టాప్ నుంచి పెదపళ్ళ గ్రామం దూరం సుమారు 500 meters.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, వెదురుమూడి, పెదపళ్ళ, కొత్తూరు, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత వీరేశ్వర స్వామి

వృశ్చికరాశి, జ్యేష్ట నక్షత్రం (1 వ పాదం)

వడ్లమూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక నాగేశ్వరరావు సెల్: 95507 28106.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా సుమారు 18 kms. దూరాన వడ్లమూరు (Vadlamuru) అను గ్రామం కలదు. చెల్లురు - వల్లూరు రోడ్డు మార్గములో వడ్లమూరు ఉంటుంది. ఇచ్చట శ్రీ వీరేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత వీరేశ్వర స్వామి వారి ఆలయం జ్యేష్ట నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత వీరేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ వీరేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. వృశ్చికరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం ప్రధాన రహదారిలో పసలపూడి వంతెన ఉంది. ఇక్కడ నుండి చెల్లూరు కు ఆటోలు ఉంటాయి. చెల్లూరు గ్రామంలో ఆటో స్టాండ్ కలదు. చెల్లూరు నుంచి వడ్లమూరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 5 Kms.

* రామచంద్రపురం నుంచి వాకతిప్ప బస్సులు (వయా) పసలపూడి వంతెన, చెల్లూరు మీదగా ఉంటాయి.

* మండపేట నుంచి కూడ వడ్లమూరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవచ్చు. వీటి మధ్య దూరం సుమారు 10 Kms.

*మండపేట నుంచి కోరుమిల్లి బస్సులు (వయా) వల్లూరు, అంగర మీదగా ఉంటాయి. వల్లూరు నుంచి వడ్లమూరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవచ్చు. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వర స్వామి

వృశ్చికరాశి, జ్యేష్ఠ నక్షత్రం (2 వ పాదం)

నల్లూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొండవీటి శేషసాయి సెల్: 96185 19292 & 94919 63294 (Whats app).



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి వాయువ్యం దిశగా సుమారు 19 kms. దూరాన నల్లూరు (Nalluru) అను గ్రామం కలదు. చెల్లురు - నల్లూరు - అంగర రోడ్డు మార్గములో నల్లూరు ఉంటుంది. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం జ్యేష్ఠ నక్షత్రం (2 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. ఆలయ ప్రాంగణంలో శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాల స్వామి ఆలయం మరియు కోదండ రామాలయం కలవు. శ్రీ సోమేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ సోమేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి పాంచాహ్నికంగా జరుగుతుంది. శివ కళ్యాణంతో శ్రీ వేణు గోపాల స్వామి వారి కళ్యాణం కూడా నిర్వహించుట క్షేత్రంలోని విశేషం. గణపతి నవరాత్రులు, కోదండస్వామి కళ్యాణం, శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. వృశ్చికరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం ప్రధాన రహదారిలో పసలపూడి వంతెన ఉంది. ఇక్కడ నుండి చెల్లూరు కు ఆటోలు ఉంటాయి. చెల్లూరు గ్రామంలో ఆటో స్టాండ్ కలదు. చెల్లూరు నుంచి నల్లూరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 5 Kms.

* రామచంద్రపురం నుంచి వాకతిప్ప బస్సులు (వయా) పసలపూడి వంతెన, చెల్లూరు మీదగా ఉంటాయి.

* మండపేట నుంచి కూడ నల్లూరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవచ్చు. వీటి మధ్య దూరం సుమారు 15 Kms.

* మండపేట నుంచి కోరుమిల్లి బస్సులు (వయా) వల్లూరు, అంగర మీదగా ఉంటాయి. అంగర నుంచి నల్లూరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవచ్చు. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి

వృశ్చికరాశి, జ్యేష్ట నక్షత్రం (3 వ పాదం)

వెదురుమూడి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కంఠం మల్లేశ్వరశర్మ సెల్: 9441140385



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి పశ్చిమ దిశగా సుమారు 21 kms. దూరాన వెదురుమూడి (Vedurumudi) అను గ్రామం కలదు. కొత్తూరు సెంటర్ - అంగర రోడ్డు మార్గములో వెదురుమూడి ఉంటుంది. ఇచ్చట శ్రీ మల్లేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి వారి ఆలయం జ్యేష్ట నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మల్లేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ మల్లేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ బహుళ షష్ఠి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. వృశ్చికరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** కాకినాడ - రావులపాలెం బస్సులు (via) కరప, మండపేట, గుమ్మిలేరు, కొత్తూరు సెంటర్ మీదగా ఉంటాయి.

* కాకినాడ - కొత్తూరు సెంటర్ దూరం 52 Kms. కొత్తూరు సెంటర్ నుంచి వెదురుమూడి (Via) కొత్తూరు, పినపళ్ళ బస్ స్టాప్ మీదగా ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms. మాత్రమే.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, వెదురుమూడి, కొత్తూరు, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువుగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



## పార్వతీ సమేత సోమేశ్వర స్వామి

## వృశ్చికరాశి, జ్యేష్ట నక్షత్రం (4 వ పాదం)

## టేకి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ ఎం.ఆర్. వి.వి.ఎస్. ఎస్. ఎస్. శర్మ సెల్: 99499 38156 & శ్రీ కొమాళ్ళపల్లి సుబ్రహ్మణ్యశర్మగారు సెల్: 99510 29060.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 19 kms. దూరాన టేకి (Teki) అను గ్రామం కలదు. కొత్తూరు సెంటర్ - అంగర - కె గంగవరం రోడ్డు మార్గములో టేకి గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం జ్యేష్ట నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ ప్రాంగణంలో సాయిబాబ, గణపతి, అయ్యప్ప, గాయత్రీదేవి, దత్తాత్రేయులు, ఆంజనేయస్వామి ఉపాలయాలు కూడ కలవు. నవగ్రహ మంటపము కూడా ఉంది. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ సోమేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ సోమేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు మాఘ శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు ఘనంగా జరుగుతాయి. వృశ్చికరాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

అతి పురాతన శైవ క్షేత్రములలో ఒకటిగా ప్రసిద్ధి. టేకి క్షేత్రమునకు ఘన చరిత్ర గలదు. కణ్వ మహర్షి ఈ గ్రామం సమీపంలో గల నది వద్ద తపమాచరించినట్లు కథనం. దీనికి సంబంధించిన ఆనవాళ్ళు కూడా ఉన్నట్లుగా అర్చకస్వామి తెలియజేశారు. టేకి గ్రామం గుండా ప్రవహించు నదికి కణ్వనది అని పిలుస్తారు.

**రవాణా సమాచారం:** మండపేట నుంచి కోరుమిల్లి కి (Via) అంగర, టేకి, మాచర మీదగా బస్సులు ఉంటాయి. మండపేట నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు మండపేట నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. అంగర నుంచి టేకి కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

* కాకినాడ నుంచి కోరుమిల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం, టేకి మీదగా బస్సులు ఉంటాయి.

* కాకినాడ నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, టేకి, వెదురుమూడి, కొత్తూరు, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువుగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.








రాశి చక్రంలో ధనస్సు రాశి **తొమ్మిదవ రాశి.**

ఈ రాశి బేసి రాశి, పురుష రాశి, అశుభరాశి, ద్విస్వభావ రాశి, క్షత్రియ రాశిగా వ్యవహరిస్తారు.

ఈ రాశికి **అధిపతి గురువు.**

ధనస్సు రాశి **9 ఆలయాలు** ఉంటాయి.

**మూల** నక్షత్రంలోని **1,2, 3, 4** పాదములు

**పూర్వాషాడ** నక్షత్రంలోని **1, 2, 3, 4** పాదములు

**మరియు ఉత్తరాషాడ** నక్షత్రంలోని **1** పాదం

9 ఆలయాలు కలిసి **ధనస్సు రాశి** గా వ్యవహరిస్తారు

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి

దనుస్సు రాశి, మూల నక్షత్రం (1 వ పాదం)

యండగండి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక నాగేశ్వరరావు, సెల్ నెం. 94409 99642.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 16 kms. దూరాన యండగండి (Yendagandi) అను గ్రామం కలదు. కొత్తూరు సెంటర్ - అంగర - కె.గంగవరం రోడ్డు మార్గములో యండగండి గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం మూల నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. వల్లీ దేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కూడ కలదు. అంతరాలయంలో గణపతి దర్శనమిస్తాడు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ సోమేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ సోమేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు జ్యేష్ఠ బహుళ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి కూడా వైభవోపేతంగా నిర్వహించబడతాయి. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** మండపేట నుంచి కోరుమిల్లి కి (Via) అంగర మీదగా బస్సులు ఉంటాయి. మండపేట నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు మండపేట నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. అంగర నుంచి యండగండి కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

* కాకినాడ నుంచి కోరుమిల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం, యండగండి మీదగా బస్సులు ఉంటాయి.
* కాకినాడ నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, యండగండి, అంగర, వెదురుమూడి, కొత్తూరు సెంటర్, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువుగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ ఉమా పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి

దనుస్సు రాశి, మూల నక్షత్రం (2 వ పాదం)

పామర్రు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ యనమండ్ర సాంబశివరావు, సెల్ నెం. 9908910299 & వి. రామవీరభద్ర శర్మ 99486 06369.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋుతి దిశగా సుమారు 14 kms. దూరాన పామర్రు (Pamarru) అను గ్రామం కలదు. కొత్తూరు సెంటర్ - అంగర - కె గంగవరం రోడ్డు మార్గములో పామర్రు గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ మల్లేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ ఉమా పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి వారి ఆలయం మూల నక్షత్రం (2 వ పాదం) చెందినది. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ ఉమా పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. వల్లీ దేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామి మరియు అమ్మవారి సన్నిధిలు కలవు. అంతరాలయంలో గణపతి దర్శనమిస్తాడు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మల్లేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ మల్లేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి కూడా వైభవోపేతంగా నిర్వహించబడతాయి. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** మండపేట నుంచి కోరుమిల్లి కి (Via) అంగర మీదగా బస్సులు ఉంటాయి. మండపేట నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు మండపేట నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. అంగర నుంచి పామర్రు కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

* కాకినాడ నుంచి కోరుమిల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం, పామర్రు మీదగా బస్సులు ఉంటాయి.
* కాకినాడ నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, కె.గంగవరం, పామర్రు, అంగర, వెదురుమూడి, కొత్తూరు సెంటర్, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువగా ఉంటాయి.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ ఉమా పార్వతీ సమేత సోమేశ్వర స్వామి

దనుస్సు రాశి, మూల నక్షత్రం (3 వ పాదం)

అముజూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి సత్యఅరుణ్ సెల్ నెం : 94409 99643, & శ్రీ వెలవలపల్లి సుబ్బారావు, సెల్ నెం : 98496 89703 సంప్రదించగలరు.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 13 kms. దూరాన అముజూరు (Amujuru) అను గ్రామం కలదు. కొత్తూరు సెంటర్ - అంగర - కె గంగవరం రోడ్డు మార్గములో అముజూరు గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ ఉమా పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం మూల నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ ఉమా పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయంలో గణపతి దర్శనమిస్తాడు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మల్లేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ మల్లేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు మాఘ శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. ధనుర్మాస, శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు కూడా వైభవోపేతంగా నిర్వహించబడతాయి. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** మండపేట నుంచి కోరుమిల్లి కి (Via) అంగర మీదగా బస్సులు ఉంటాయి. మండపేట నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు మండపేట నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. అంగర నుంచి అముజూరు కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. కాకినాడ నుంచి కోరుమిల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం, అముజూరు మీదగా బస్సులు ఉంటాయి.

* కాకినాడ నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, కె.గంగవరం, అముజూరు, అంగర, వెదురుమూడి, కొత్తూరు సెంటర్, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువగా ఉంటాయి.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ లలితాంబిక సమేత ఉత్తరేశ్వర స్వామి

దనుస్సు రాశి, మూల నక్షత్రం (4 వ పాదం)

పాణంగిపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ మద్దిరాల కాశీవిశ్వనాధం, సెల్ నెం. 98480 93334, శ్రీ కిరణ్ కుమార్ 95533 55211.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 9 kms. దూరాన పాణంగిపల్లి (Panangipalli) అను గ్రామం కలదు. కొత్తూరు సెంటర్ - అంగర - కె గంగవరం రోడ్డు మార్గములో పాణంగిపల్లి గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ ఉత్తరేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ లలితాంబిక సమేత ఉత్తరేశ్వర స్వామి వారి ఆలయం మూల నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ ఉత్తరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ లలితాంబిక సమేత ఉత్తరేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. ఆలయ ప్రాంగణంలో గణపతి, వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వరస్వామి కొలువైఉన్నారు. శ్రీ రుక్మిణీ సమేత వేణుగోపాలస్వామి ఆలయం కూడ కలదు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ ఉత్తరేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ ఉత్తరేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. సుబ్రహ్మణ్యషష్ఠి, శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు కూడా వైభవోపేతంగా నిర్వహించబడతాయి. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** మండపేట నుంచి కోరుమిల్లి కి (Via) అంగర మీదగా బస్సులు ఉంటాయి. మండపేట నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు మండపేట నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. అంగర నుంచి పాణంగిపల్లి కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

* కాకినాడ నుంచి కోరుమిల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం, పాణంగిపల్లి మీదగా బస్సులు ఉంటాయి.
* కాకినాడ నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.
* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, కె.గంగవరం, పాణంగిపల్లి, అంగర, వెదురుమూడి, కొత్తూరు సెంటర్, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువుగా ఉంటాయి.

పాణంగిపల్లి బస్ స్టాప్ నుంచి సుమారు 500 మీటర్లు లోపలకి ఆలయం ఉంటుంది

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



## శ్రీ పార్వతీ సమేత ఖండేశ్వర స్వామి

## ధనుస్సు రాశి, పూర్వాషాడ నక్షత్రం (1 వ పాదం)

## అంగర గ్రామం (పడమర ఖండ్రిక)

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కంతం అమ్మన్న శర్మ , సెల్ నెం: 98669 46082.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 23 kms. దూరాన అంగర (Angara - Padamara Khandrika) అను గ్రామం కలదు. కొత్తూరు సెంటర్ - అంగర - కె గంగవరం రోడ్డు మార్గములో అంగర గ్రామం ఉంటుంది. ఇచ్చట శ్రీ ఖండేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత ఖండేశ్వర స్వామి వారి ఆలయం పూర్వాషాడ నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ ఖండేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత ఖండేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. శ్రీ ఖండేశ్వర లింగము కణ్వ మహర్షి ప్రతిష్ట. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. గణపతి పార్వతీదేవికి సన్నిధిలు కలవు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ ఖండేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత ఖండేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు మాఘ శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. స్వామివారికి ఐదు రకాల వాహనాలతో సేవ జరుగుతాయి. శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు కూడా వైభవోపేతంగా నిర్వహించబడతాయి. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** మండపేట నుంచి కోరుమిల్లి కి (Via) అంగర మీదగా బస్సులు ఉంటాయి. మండపేట నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు మండపేట నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, కె.గంగవరం, పాణంగిపల్లి, అంగర, వెదురుమూడి, కొత్తూరు సెంటర్, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువుగా ఉంటాయి.

ద్రాక్షారామం - కోటిపల్లి మార్గములో కె.గంగవరం ఉంటుంది.
కె.గంగవరం నుంచి పాణంగిపల్లి, పామర్రు మీదగా అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

అంగర బస్ స్టాప్ నుంచి సుమారు 500 మీటర్లు లోపలకి ఆలయం ఉంటుంది (కపిలేశ్వరపురం వైపు).

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



## శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వర స్వామి

## ధనుస్సు రాశి, పూర్వాషాడ నక్షత్రం (2 వ పాదం)

## కోరుమిల్లి గ్రామం

## అష్ట సోమేశ్వరాలయాలు (నైఋుతి క్షేత్రం)

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ పుసునూరి శరభేశ్వర రావు, సెల్ : 9553115219



**పాద శివలింగ స్థానం:** ద్రాక్షారామ క్షేత్రానికి నైఋుతి దిశగా, సుమారు 21 kms. దూరాన, గోదావరి నదీ తీర ప్రాంతములో కోరుమిల్లి (Korumilli) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం ఉంది. ఇది అష్ట సోమేశ్వరాలయాలలో నైఋుతి క్షేత్రంగా ప్రసిద్ధి చెందినది. కోరుమిల్లి శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** దక్షప్రజాపతి యజ్ఞం చేసిన 'దక్షవాటిక' ను ద్రాక్షారామగా పిలుస్తారు. లోక ఖ్యాతి పొందిన పంచారామాల్లో ద్రాక్షారామ క్షేత్రం ఒకటి. దక్షిణ కాశీగా పిలువబడే ద్రాక్షారామ క్షేత్రం నందలి శ్రీ భీమేశ్వర లింగము 'సూర్య యంత్ర' ప్రతిష్ట. ఆ రుద్రమూర్తిని శాంతపరచేందుకు ద్రాక్షారామ క్షేత్రం చుట్టూ ఎనిమిది 'చంద్ర యంత్ర' ప్రతిష్టలు జరిగినాయి. వీటిని సోమేశ్వర ఆలయాలుగా పిలుస్తారు. చంద్రుడిని సోముడు అని కూడ పిలుస్తారు. సోము ప్రతిష్ట శివాలయాలను అష్ట సోమేశ్వరాలయాలు అని అంటారు. ఇవి ద్రాక్షారామం పరిసరాల్లోనే ఉంటాయి. వీటి సందర్శనం వలన చంద్ర గ్రహ దోష నివృత్తి కలుగుతుంది. అష్ట సోమేశ్వర క్షేత్రాలను దర్శిస్తే, తప్పకుండా శివానుగ్రహం కలుగుతుంది అనే నమ్మకం భక్తులలో ఉంది. అష్ట సోమేశ్వరాలయాలల్లో కోరుమిల్లి గ్రామం లోని శ్రీ సోమేశ్వరాలయం ఒకటిగా ప్రతీతి. ద్రాక్షారామ క్షేత్రం నకు నైఋుతి దిశలో కోరుమిల్లి గ్రామం ఉంటుంది.

కోరుమిల్లి గ్రామం లోని శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది (2015). ఆలయ ప్రాంగణము చాల విశాలముగా ఉంటుంది. చక్కటి పచ్చని తోట ఆహ్లాదకరంగా అలరారుతూ ఉండును. ప్రధానాలయం పశ్చిమాభి ముఖముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణ ప్రవేశం పశ్చిమ & తూర్పు ద్వారములు నుంచి జరుగుతుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజ స్థంబం, ప్రధానాలయం, చండీశ్వరుడు, కళ్యాణ మంపం మొదలగునవి ఉంటాయి. ముఖ మండపం నందు శృంగి-బృంగి అను ద్వారపాలకులు, నందీశ్వరుడు, శ్రీ రాజరాజేశ్వరీ అమ్మవారి సన్నిధి, శ్రీ వల్లి దేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి సన్నిధిలున్నాయి. అంతరాలయం నందు వినాయక మూర్తి కలరు. గర్భాలయం నందు శ్రీ సోమేశ్వర లింగము దర్శనమిస్తుంది. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. మహా శివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు నిర్వహించుతారు. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్బారాయుడు షష్ఠి వేడుకులు వైభవంగా జరుగుతాయి. సుబ్బారాయుడు షష్ఠికి ముందు రోజు అనగా పంచమి నాడు సుబ్రహ్మణ్య స్వామి కళ్యాణోత్సవాలు ఘనంగా నిర్వహించుతారు

క్షేత్రపాలకుడు శ్రీ జనార్ధన స్వామి. సోమేశ్వరాలయం నకు ఉత్తరం వైపున వైష్ణవాలయం తూర్పు అభిముఖముగా ఉంటుంది. శ్రీ దేవి - భూ దేవి సమేత శ్రీ జనార్ధన స్వామి సాధక ముద్రలో దర్శనమిస్తాడు. నవ జనార్ధనాలయలలో ఒకటిగా ప్రతితీ. ఆలయ ప్రాంగణములో శ్రీ లక్ష్మీ నరసింహస్వామి సన్నిధి కూడ కలదు.

నక్షత్ర శాంతి కోసం ఆలయ అర్చక స్వామి: శ్రీ పుసునూరి శరభేశ్వర రావు, సెల్ : 9553115219 సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** కాకినాడ - కోరుమిల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె. గంగవరం, టేకీ మీదగా ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 34 Kms.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (via) ద్రాక్షారామం, కె. గంగవరం మీదగా ఉంటాయి.

* కె. గంగవరం నుంచి అంగర ఆటోలు (vai) పామర్రు, టేకీ మీదగా ఉంటాయి. టేకీ నుంచి కోరుమిల్లి కి ఆటోలు దొరుకుతాయి. ఆటోలు రాను - పోను ఏర్పాట్లు చేసుకోవాలి.

* మండపేట - కోరుమిల్లి బస్సులు (Via) అంగర, టేకీ మీదగా ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 21 Kms.

* మండపేట (కలువ పువ్వు సెంటర్) నుంచి అంగర గ్రామం నకు ఆటోలు దొరుకుతాయి. మండపేట నుంచి అంగర గ్రామం దూరం సుమారు 13 Kms. గా ఉంటుంది.

* అంగర నుంచి కోరుమిల్లి కి ఆటోలు దొరుకుతాయి. దూరం సుమారు 10 Kms. గా ఉంటుంది. ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి.

* రావులపాలెం నుంచి యానాం నకు గోదావరి నదికి ఉత్తరం వైపు గల గట్టు పైన రోడ్డు మార్గము ఉంది. గోదావరి గట్టు మార్గం (via) కపిలేశ్వరపురం, కోరుమిల్లి, కూళ్ళ, కోటిపల్లి, పాత కోట మీదగా ఉంటుంది. ఈ మార్గములో ఆటోలు చాల తక్కువుగా ఉంటాయి. ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి

ధనుస్సు రాశి, పూర్వాషాడ నక్షత్రం (3 వ పాదం)

కూళ్ళ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి శ్రీ బాలసుబ్రహ్మణ్య శర్మ, సెలె నెం : 94410 45679 & వెలవలపల్లి సుబ్బారావు, సెలె నెం : 98496 89703 సంప్రదించగలరు.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 16 kms. దూరాన కూళ్ళ (Kulla) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం పూర్వాషాడ నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి.
వల్లీ దేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి ఆలయం కూడ కలదు. అంతరాలయంలో గణపతి కొలువై యున్నారు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ సోమేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. సుబ్రహ్మణ్య షష్ఠి, శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు కూడా వైభవోపేతంగా నిర్వహించబడతాయి. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం నుంచి వాకతిప్ప బస్సులు (వయా) పసలపూడి వంతెన, చెల్లూరు, కూళ్ళ మీదగా ఉంటాయి.

* కాకినాడ - కోరుమిల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె. గంగవరం, పామర్రు, టేకీ మీదగా ఉంటాయి.

* పామర్రు నుంచి కూళ్ళ గ్రామం ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 5 Kms.

* కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, కె.గంగవరం, పామర్రు, అంగర, వెదురుమూడి, కొత్తూరు సెంటర్, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువుగా ఉంటాయి. పామర్రు నుంచి కూళ్ళ గ్రామం ఆటోలు ఏర్పాట్లు

చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 5 Kms.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె. గంగవరం మీదగా ఉంటాయి.

* కాకినాడ - కోటిపల్లి మార్గములో కె.గంగవరం ఉంటుంది.

* కె.గంగవరం నుంచి పామర్రు మీదగా అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. పామర్రు నుంచి కూళ్ళ గ్రామం ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 5 Kms.

* కోటిపల్లి రేవు నుంచి కూళ్ళ గ్రామం (గోదావరి గట్టు మీదగా) ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 6.5 Kms.

* కోటిపల్లి రేవు నుంచి రావులపాలెం కు షేరింగ్ ఆటోలు (Via) కోరుమిల్లి, కూళ్ళ (శ్రీ దుర్గా ఆలయం), కపిలేశ్వరపురం (గోదావరి గట్టు) మీదగా ఉంటాయి.

* కూళ్ళ (శ్రీ దుర్గా ఆలయం) నుంచి కూళ్ళ గ్రామం దూరం సుమారు 500 meters only.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు





శ్రీ ఉమా సమేత రామలింగేశ్వర స్వామి

ధనుస్సు రాశి, పూర్వాషాడ నక్షత్రం (4 వ పాదం)

వాకతిప్ప గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి శ్రీ బాలసుబ్రహ్మణ్య శర్మ, సెల్ నెం : 94410 45679.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 19 kms. దూరాన వాకతిప్ప (Vaakatippa) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ రామలింగేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ ఉమా సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం పూర్వాషాడ నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ రామలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ ఉమా సమేత రామలింగేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయంలో గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి కొలువై యున్నారు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ రామలింగేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ ఉమా సమేత రామలింగేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. సుబ్రహ్మణ్య షష్ఠి,
శరన్నవ రాత్రులు, గణపతి నవరాత్రులు కూడా వైభవోపేతంగా నిర్వహించబడతాయి. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** రామచంద్రపురం నుంచి వాకతిప్ప బస్సులు (వయా) పసలపూడి వంతెన, చెల్లూరు, కూళ్ళ మీదగా ఉంటాయి.

* కాకినాడ - కోరుమిల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె. గంగవరం, పామర్రు, టేకీ మీదగా ఉంటాయి.

* పామర్రు నుంచి వాకతిప్ప గ్రామం ఆటోలు ఏర్పాట్టు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 7 Kms. * కాకినాడ - కత్తుంగ బస్సులు (via) ద్రాక్షారామం, కె.గంగవరం, పామర్రు, అంగర, వెదురుమూడి, కొత్తూరు సెంటర్, రావులపాలెం మీదగా ఉంటాయి. ఇవి చాల తక్కువుగా ఉంటాయి. పామర్రు నుంచి వాకతిప్ప గ్రామం ఆటోలు ఏర్పాట్టు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 7 Kms.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె. గంగవరం మీదగా ఉంటాయి.

* కాకినాడ - కోటిపల్లి మార్గములో కె.గంగవరం ఉంటుంది.

* కె.గంగవరం నుంచి పామర్రు మీదగా అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. పామర్రు నుంచి వాకతిప్ప గ్రామం ఆటోలు ఏర్పాట్టు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 7 Kms.

* కోటిపల్లి రేవు నుంచి వాకతిప్ప గ్రామం (గోదావరి గట్టు మీదగా) ఆటోలు ఏర్పాట్టు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 8.5 Kms.

* కోటిపల్లి రేవు నుంచి రావులపాలెం కు షేరింగ్ ఆటోలు (Via) కోరుమిల్లి, కూళ్ళ (శ్రీ దుర్గా ఆలయం), కపిలేశ్వరపురం (గోదావరి గట్టు) మీదగా ఉంటాయి.

* కూళ్ళ (శ్రీ దుర్గా ఆలయం) నుంచి వాకతిప్ప గ్రామం దూరం సుమారు 2.5 Kms. only.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి

ధనుస్సు రాశి, ఉత్తరాషాడ నక్షత్రం (1 వ పాదం)

తాతపూడి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ మాగాపు మాచరరావు, సెల్ నెం : 83676 24988.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 30 kms. దూరాన తాతపూడి (Tatapudi) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ మల్లేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి వారి ఆలయం ఉత్తరాషాడ నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మల్లేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత శ్రీ మల్లేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. దనుస్సు రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** మండపేట - రావులపాలెం బస్సులు / ఆటోలు కొత్తూరు సెంటర్ మీదగా ఉంటాయి.

* కొత్తూరు సెంటర్ నుంచి తాతపూడి కు (వయా) చింతలూరు మీదగా ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. కొత్తూరు సెంటర్ నుంచి తాతపూడి దూరం సుమారు 5.5 కీ.మ

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె. గంగవరం మీదగా ఉంటాయి. * కోటిపల్లి రేవు నుంచి వాకతిప్ప గ్రామం (వయా) వాకతిప్ప బ్రిడ్జి (గోదావరి గట్టు) మీదగా ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 19 Kms.

* కోటిపల్లి రేవు నుంచి రావులపాలెం కు షేరింగ్ ఆటోలు (Via) కోరుమిల్లి, కూళ్ళ (శ్రీ దుర్గా ఆలయం), కపిలేశ్వరపురం, వాకతిప్ప బ్రిడ్జి (గోదావరి గట్టు) మీదగా ఉంటాయి.

* వాకతిప్ప బ్రిడ్జి (గోదావరి గట్టు) నుంచి వాకతిప్ప గ్రామం దూరం సుమారు 500 meters only.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు






రాశి చక్రంలో మకర రాశి పదవ రాశి

ఈ రాశి సరి రాశిగాను, శుభ రాశి గాను, స్త్రీరాశిగాను, చర రాశిగానూ వ్యవహరిస్తారు

ఈ రాశికి అధిపతి శని

మకర రాశి 9 ఆలయాలు ఉంటాయి

ఉత్తరాషాడ నక్షత్రంలోని 2, 3, 4 పాదములు

శ్రావణం నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు

మరియు ధనిష్ట నక్షత్రంలోని1, 2 పాదములు

9 ఆలయాలు కలిసి మకర రాశి గా వ్యవహరిస్తారు

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ ఉమా పార్వతీ సమేత శ్రీ రాజలింగేశ్వర స్వామి

మకర రాశి, ఉత్తరాషాడ నక్షత్రం (2 వ పాదం)

మాచర గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కాలధరి శ్రీవృష్ణ జగవాన్, సెల్ నెం : 9491648530. 89851 62698.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 25 kms. దూరాన మాచర (Machara) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ రాజలింగేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ రాజలింగేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ ఉమా పార్వతీ సమేత శ్రీ రాజలింగేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. పంచవటీ తీర్థమైన ఈ గ్రామంలో పూర్వము ఋషులు, మునీశ్వరులు తపస్సు చేసిన ప్రదేశం కావడం విశేషం. పూర్వం విక్రమార్క చక్రవర్తి నవజనార్ధనక్షేత్ర సందర్శనం తరువాత పంచవటీ ప్రాంతంలో ఒక శివలింగ ప్రతిష్ట చేసినట్లు పూర్వగాధ. రాజుచే ప్రతిష్టింపబడ్డ కారణం వల్ల ఈ స్వామికి రాజలింగేశ్వర నామము కలిగినట్లు తెలియుచున్నది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, ద్వారపాలకులు, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ రాజలింగేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ ఉమా పార్వతీ సమేత శ్రీ రాజలింగేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు మాఘ శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** మాచర గ్రామం నకు సమీప రైల్వే స్టేషన్ రాజమండ్రి. ఇది హౌరా - చెన్నై రైలు మార్గములో ఉంటుంది. ఇక్కడ అన్ని రైలు సర్వీసులు ఆగుతాయి. రాజమండ్రి లోని కోటిపల్లి బస్ స్టాండ్ నుంచి రాజమండ్రి - రావులపాలెం బస్సులు బయలుదేరుతాయి. రావులపాలెం బస్సులు రాజమండ్రి రైల్వే స్టేషన్ మీదగా ఉంటాయి. ప్రయాణికులు రాజమండ్రి రైల్వే స్టేషన్ కూడ ప్రయాణం చేయవచ్చును. రావులపాలెం బస్ స్టాండ్ నుంచి మాచర గ్రామం నకు ఆటోలు దొరుకుతాయి. వీటి మద్య దూరం సుమారు 22 Kms. ఉంటుంది. రావులపాలెం బ్రిడ్జి దాటిన తర్వాత గోదావరి నదీ తీరాన గల గోదావరి గట్టు పైన (Via) కపిలేశ్వరపురం, కోరుమిల్లి, కోటిపల్లి గోదావరి గట్టు మీదగా యానాం వరకు రోడ్డు మార్గం ఉంది. షేరింగ్ ఆటోలు చాల తక్కువుగా ఉంటాయి. కోరుమిల్లి గోదావరి గట్టు నుంచి మాచర దూరం సుమారు 02 Kms. గా ఉంటుంది.

* రావులపాలెం నుంచి కాకినాడ కు (Via) ఆలమూరు, అంగర, టేకి, కె.గంగవరం, ద్రాక్షారామం, గొల్లపాలెం మీదగా బస్సులు పరిమితంగా ఉంటాయి.

* టేకి నుంచి కోరుమిల్లి కు (Via) మాచర మీదగా ఆటోలు ఉంటాయి. అంగర నుంచి ఎక్కువ ఆటోలు దొరుకుతాయి.
* కాకినాడ నుంచి కోరుమిల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం, టేకి మీదగా బస్సులు ఉంటాయి.

* కాకినాడ నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.

* కాకినాడ నుంచి కోటిపల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా బస్సులు ప్రతి అరగంటకు ఉంటాయి.

* కె.గంగవరం నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు (Via) పామర్రు, టేకి మీదగా ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి రావులపాలెం కు షేరింగ్ ఆటోలు (Via) కోరుమిల్లి, కపిలేశ్వరపురం మీదగా ఉంటాయి.

* కోరుమిల్లి గోదావరి గట్టు నుంచి మాచర దూరం సుమారు 02 Kms. మాత్రమే. మాచర బస్ స్టాప్ కు తూర్పు దిశగా సుమారు 300 meters దూరాన (లోపలకి) మాచర గ్రామం ఉంటుంది.

* రావులపాలెం నుంచి కాకినాడ కు (Via) ఆలమూరు, మండపేట, రామచంద్రపురం మీదగా బస్సులు ఎక్కువగా ఉంటాయి.

* మండపేట నుంచి కోరుమిల్లి కి (Via) అంగర, టేకి, మాచర మీదగా బస్సులు ఉంటాయి. మండపేట నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి. వీటితో పాటు మండపేట నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. అంగర నుంచి మాచరకు ఎక్కువ ఆటోలు దొరుకుతాయి.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు





శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి

మకర రాశి, ఉత్తరాషాడ నక్షత్రం (3 వ పాదం)

సత్యవాడ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ రామేశ్వరపు వెంకటేశ్వరరావు, సెల్ నెం : 94920 74141.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 10 kms. దూరాన సత్యవాడ (Satyawada) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి వారి ఆలయం ఉత్తరాషాడ నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయంలో గణపతి, సుబ్రహ్మణ్యేశ్వరుడు కొలువై ఉన్నారు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ సోమేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత శ్రీ సోమేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** కాకినాడ నుంచి కోరుమిల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం, సత్యవాడ, టేకి మీదగా బస్సులు ఉంటాయి.

* కాకినాడ నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.

* కాకినాడ నుంచి కోటిపల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా బస్సులు ప్రతి అరగంటకు ఉంటాయి.

* కె.గంగవరం నుంచి అంగర కు షేరింగ్ ఆటోలు (Via) సత్యవాడ, పామర్రు, టేకి మీదగా ఉంటాయి. కె.గంగవరం నుంచి సత్యవాడ దూరం సుమారు 3 Kms.

* రావులపాలెం నుంచి కాకినాడ కు (Via) ఆలమూరు, అంగర, టేకి, సత్యవాడ, కె.గంగవరం, ద్రాక్షారామం, గొల్లపాలెం మీదగా బస్సులు పరిమితంగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



## శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి

## మకర రాశి, ఉత్తరాషాడ నక్షత్రం (4 వ పాదం)

## సుందరపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ నాగాభట్ల నూకేశ్వర సత్యవరప్రసాదు, మరియు శ్రీ నాగాభట్ల కృష్ణ సందీప్,
సెల్ నెం : 94937 47484 & 87127 474484 (Whats app) .



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 14 kms. దూరాన సుందరపల్లి (Sundarapalli) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి వారి ఆలయం ఉత్తరాషాడ నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయంలో గణపతి కొలువై ఉన్నారు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ సోమేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ ఉమా సమేత శ్రీ సోమేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి నుంచి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు విశేషంగా నిర్వ హించబడతాయి. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** రామచంద్రపురం నుంచి సుందరపల్లి గ్రామం నకు (Via) ద్రాక్షారామం, కె.గంగవరం.మీదగా బస్సులు ఉంటాయి.
* రామచంద్రపురం నుండి ప్రతిరోజూ నాలుగు ట్రిప్పులు బస్సు సర్వీసు అందుబాటులో ఉన్నాయి.

* కాకినాడ నుంచి కోటిపల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా బస్సులు ప్రతి అరగంటకు ఉంటాయి.
* కె.గంగవరం నుంచి సుందరపల్లి కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి.

* కాకినాడ నుంచి కోటిపల్లి గ్రామం నకు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా బస్సులు ప్రతి అరగంటకు ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి సుందరపల్లి గ్రామం (గోదావరి గట్టు మీదగా) ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. వీటి మధ్య దూరం సుమారు 5 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



శ్రీ పార్వతీ బాలాత్రిపుర సుందరీ సమేత శ్రీ వైద్యనాథేశ్వర స్వామి

మకర రాశి, శ్రవణం నక్షత్రం (1 వ పాదం)

వానపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి వెంకట సుబ్రహ్మణ్యశర్మ, సెల్ నెం : 95507 28875.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 26 kms. దూరాన వానపల్లి (Vanapalli) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ వైద్యనాథేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ బాలాత్రిపుర సుందరీ సమేత శ్రీ వైద్యనాథేశ్వర స్వామి వారి ఆలయం శ్రవణం నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ వైద్యనాథేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ బాలాత్రిపుర సుందరీ సమేత శ్రీ వైద్యనాథేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్తంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ మంటపంలో వీరభద్రేశ్వరుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు, కాశీ అన్నపూర్ణేశ్వరి, కాలభైరవుడు, బృంగీశ్వరుడు మరియు పార్వతీదేవి మూర్తులు కలరు. అంతరాలయంలో గణపతి కొలువై ఉన్నారు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ వైద్యనాథేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ బాలాత్రిపుర సుందరీ సమేత శ్రీ వైద్యనాథేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ దశమి రోజున పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు విశేషంగా నిర్వ హించబడతాయి. శివరాత్రి తీర్థం అతి విశేషంగా నిర్వహించబడుతుంది. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు (Via) వానపల్లి, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - వానపల్లి మధ్య దూరం సుమారు 18 Kms.

* రావులపాలెం & కొత్తపేట నుంచి బయలు దేరిన అయినవిల్లి షేరింగ్ ఆటోలు (Via) వానపల్లి మీదగా ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం నుంచి వానపల్లి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 10 Kms.

* వానపల్లి శివాలయం బస్ స్టాప్ కు సుమారు 200 meters (కొంత లోపలకి) శివాలయం ఉంటుంది.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



శ్రీ పార్వతీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి

మకర రాశి, శ్రవణం నక్షత్రం (2 వ పాదం)

మడిపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెల్లపల్లి వ్యాఘ్రేశ్వర శర్మ, సెల్ నెం : 99490 51852.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 22 kms. దూరాన మడిపల్లి (Madipalli) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ ముక్తేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత శ్రీ ముక్తేశ్వరస్వామి వారి ఆలయం శ్రవణం నక్షత్రం (2 వ పాదం) చెందినది. శ్రీ ముక్తేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయంలో గణపతి కొలువై ఉన్నారు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ ముక్తేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు విశేషంగా నిర్వ హించబడతాయి. కనుమ రోజున ప్రభల ఉత్సవం నిర్వహించబడుతుంది. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు (Via) మడిపల్లి, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - మడిపల్లి మధ్య దూరం సుమారు 22 Kms.

* రావులపాలెం & కొత్తపేట నుంచి బయలు దేరిన అయినవిల్లి షేరింగ్ ఆటోలు (Via) మడిపల్లి మీదగా ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం నుంచి మడిపల్లి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 6 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



శ్రీ ఉమా మాణిక్యాంబ సమేత శ్రీ వీరేశ్వర స్వామి

మకర రాశి, శ్రవణం నక్షత్రం (3 వ పాదం)

వాడపాలెం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ దెందులూరి వెంకట సూర్యసుబ్బారావు (శ్రీను) , సెల్ నెం : 81869 61115.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 18 kms. దూరాన వాడపాలెం (Vadapalem) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ వీరేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ ఉమా మాణిక్యాంబ సమేత శ్రీ వీరేశ్వర స్వామి వారి ఆలయం శ్రవణం నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ ముక్తేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ ఉమా మాణిక్యాంబ సమేత శ్రీ వీరేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. స్థానికలు సుబ్బరాయుడు గుడిగా పిలుస్తారు. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. శివాలయంతో పాటు విఘ్నేశ్వరాలయం, వల్లీ దేవసేన సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి (సుబ్బరాయుడు) వారి ఆలయం, మాణిక్యాంబా ఆలయం, శ్రీరమా సమేత సత్యనారాయణ స్వామివారి ఆలయం కలవు. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి స్వయంభువు మూర్తి. స్వామికి విశేష ప్రాముఖ్యత ఉంది. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ వీరేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ ఉమా మాణిక్యాంబ సమేత శ్రీ వీరేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు మాఘ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. మార్గశిర శుద్ధ షష్ఠి నాడు సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి కళ్యాణము నిర్వహించబడతుంది. వైశాఖ శుద్ధ ఏకాదశి రోజున సత్యనారాయణ స్వామివారి కళ్యాణము జరుగును. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు విశేషంగా నిర్వ హించబడతాయి. ధనుర్మాస ఉత్సవములు జరుగుతాయి. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు (Via) వాడపాలెం, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - వాడపాలెం మధ్య దూరం సుమారు 13 Kms.

* రావులపాలెం & కొత్తపేట నుంచి బయలు దేరిన అయినవిల్లి షేరింగ్ ఆటోలు (Via) వాడపాలెం మీదగా ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం నుంచి వాడపాలెం కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 15 Kms.

* వాడపాలెం శివాలయం బస్ స్టాప్ కు సుమారు 200 meters (కొంత లోపలకి) శివాలయం ఉంటుంది.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



శ్రీ భద్రకాళీ సమేత వీరేశ్వర స్వామి

మకర రాశి, శ్రవణం నక్షత్రం (4 వ పాదం)

వీరవల్లిపాలెం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వి.కామేశ్వర , సెల్ నెం : 99488 45269.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 16 kms. దూరాన వీరవల్లిపాలెం (Veeravallipalem) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ వీరేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ భద్రకాళీ సమేత శ్రీ వీరేశ్వర స్వామి వారి ఆలయం శ్రవణం నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ భద్రకాళీ సమేత శ్రీ వీరేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, గణపతి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ వీరేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ భద్రకాళీ సమేత శ్రీ వీరేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు జ్యేష్ఠ బహుళ చవితి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు నిర్వ హించబడతాయి. సుబ్రహ్మణ్యషష్ఠి తీర్ధం ప్రత్యేకం జరుగుతాయి. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**స్థల పురాణం:** పవిత్ర గోదావరి నదికి ఉత్తర తీరం నందు కోటిపల్లి క్షేత్రం మరియు దక్షిణ తీరం నందు వీరవల్లిపాలెం ఉన్నాయి. త్రేతాయుగములో శ్రీ రామచంద్ర మూర్తి తన పరివారముతో పుష్పక విమానంలో తీర్థ యాత్రలకు బయలు దేరుతాడు. కోటిపల్లి క్షేత్రం దర్శనం పిమ్మట తిరుగు ప్రయాణములో ఒక ప్రాంతము నందు పుష్పక విమానం ఆగిపోతుంది. వానర వీరులు శోధించగా ఒక మట్టి పుట్ట నుంచి దివ్య కాంతి కనబడుతుంది. ఆ పుట్టలో ఒక శివాలయం ఉంటుంది. అదే శ్రీ క్షణ ముక్తేశ్వర శివాలయం. శ్రీ రామచంద్ర మూర్తి తన పరివారముతో శ్రీ క్షణ ముక్తేశ్వర స్వామిని సేవించుతారు. వానర వీరులు విడిది చేసిన ఆ ప్రాంతము వీరవల్లిపాలెం గా ఖ్యాతి పొందినది.

**రవాణ సౌకర్యములు:** వీరవల్లిపాలెం నకు దక్షిణ దిశగా సుమారు 15 Kms. దూరాన అమలాపురం ఉంది. ఇది కోనసీమ జిల్లా కేంద్రం. అమలాపురం నుంచి వీరవల్లిపాలెం నకు ప్రతి 2 గంటలకు బస్సులు (Via) ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.
* రావులపాలెం - అద్దంకి వారి లంక కు బస్సులు (Via) వాడపాలెం, ముక్తేశ్వరం, వీరవల్లిపాలెం మీదగా రోజుకు 2 బస్సులు ఉంటాయి.

* రావులపాలెం - వీరవల్లిపాలెం మధ్య దూరం సుమారు 26 Kms.

* ముక్తేశ్వరం నుంచి వీరవల్లిపాలెం షేరింగ్ ఆటోలు (Via) శ్రీ క్షణ ముక్తేశ్వర శివాలయం మీదగా ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం నుంచి వీరవల్లిపాలెం కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 6 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు





శ్రీ మహిషాసురమర్ధని సమేత రాజరాజనరేంద్ర స్వామి

మకర రాశి, ధనిష్ఠ నక్షత్రం (1 వ పాదం)

వెలవలపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి శంభేశ్వరరావు, సెల్ నెం : 98484 61968 .




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 20 kms. దూరాన వెలవలపల్లి (Velavapalli) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ రాజరాజనరేంద్ర లింగమును దర్శించగలము. శ్రీ మహిషాసురమర్ధని సమేత రాజరాజనరేంద్ర స్వామి వారి ఆలయం ధనిష్ఠ నక్షత్రం (1 వ పాదం) చెందినది.
శ్రీ రాజరాజనరేంద్ర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ మహిషాసురమర్ధని సమేత రాజరాజనరేంద్ర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయం నందు గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి మరియు వీరభద్రుడుకొలువై యున్నారు. నవగ్రహ మంటపం కూడ కలదు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ రాజరాజనరేంద్ర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ మహిషాసురమర్ధని సమేత రాజరాజనరేంద్ర స్వామి వారి కళ్యాణోత్సవములు జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు, సుబ్రహ్మణ్యషష్ఠి నిర్వ హించబడతాయి. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు (Via) వాడపాలెం, వెలవలపల్లి, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - వెలవలపల్లి మధ్య దూరం సుమారు 24 Kms.

* రావులపాలెం & కొత్తపేట నుంచి బయలు దేరిన అయినవిల్లి షేరింగ్ ఆటోలు (Via) వెలవలపల్లి మీదగా ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం నుంచి వెలవలపల్లి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వేశ్వర స్వామి

మకర రాశి, ధనిష్ఠ నక్షత్రం (2 వ పాదం)

అయినవిల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ అయినవిల్లి సత్తిబాబు శర్మగారు, సెల్ నెం : 94936 54137 & 94903 56448 (whatsup No.) శ్రీ అయినవిల్లి శివరామక్రిష్ణ, శ్రీ అల్లవరపు బాలసుబ్రమణ్యం & అల్లవరపు అన్నప్పసోమయాజులు గారు సెల్ నెం. 94903 56445 ఇతర అర్చకస్వాములు.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 18 kms. దూరాన అయినవిల్లి (Ainavalli) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ విశ్వేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వేశ్వర స్వామి వారి ఆలయం ధనిష్ఠ నక్షత్రం (2 వ పాదం) చెందినది. శ్రీ విశ్వేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** అయినవిల్లి క్షేత్రము జగత్ప్రసిద్ధి చెందిన విఘ్నేశ్వర క్షేత్రం. విఘ్నేశ్వర స్వామి స్వయంభూ మూర్తి. విఘ్నేశ్వర స్వామి దక్షిణాభి ముఖంగా ఉంటాడు. విఘ్నేశ్వరాలయం నందు శ్రీ అన్నపూర్ణా దేవి (శక్తి), శ్రీ కేశవ స్వామి ( విష్ణు రూపాం), శ్రీ విఘ్నేశ్వర స్వామి (గణపతి), శ్రీ విశ్వేశ్వర స్వామి (శివ లింగము) మరియు శ్రీ కాల భైరవ స్వామి అను అయిదు దేవతలు కొలువుదీరినారు. ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. శ్రీ విశ్వేశ్వర స్వామికి ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. శ్రీ విశ్వేశ్వర స్వామి తూర్పు అభిముఖంగా దర్శమిస్తాడు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ విశ్వేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు నిర్వహించ బడతాయి. కనుమ రోజు ప్రభల తీర్థం ఉంటుంది. మకర రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు  (Via) వాడపాలెం, వెలవలపల్లి, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 25 Kms.

* ముక్తేశ్వరం నుంచి అయినవిల్లి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 2 Kms.

* రావులపాలెం & కొత్తపేట నుంచి అయినవిల్లి కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

* అమలాపురం - వీరవల్లిపాలెం బస్సులు (Via) ముక్తేశ్వరం మీదగా ఉంటాయి. అమలాపురం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 10 Kms. అమలాపురం నుంచి ముక్తేశ్వరం కు షేరింగ్ ఆటోలు కూడ ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం నుంచి అయినవిల్లి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 2 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు








కుంభ రాశి జాతకచక్రంలో పదకొండవ స్థానంలో ఉంది

ఈ రాశ్యధిపతి **శని భగవానుడు**

**కుంభ రాశి 9 ఆలయాలు ఉంటాయి.**

**ధనిష్ట నక్షత్రంలోని 3, 4 పాదములు**

**శతభిషం నక్షత్రంలోని 1, 2, 3, 4 పాదములు**

**మరియు పూర్వభాద్ర నక్షత్రంలోని 1, 2, 3 పాదములు**

**9 ఆలయాలు** కలిసి **కుంభ రాశి** గా వ్యవహరిస్తారు

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ పార్వతీ భ్రమరాంబా సమేత మల్లీశ్వర స్వామి

కుంభ రాశి, ధనిష్ఠ నక్షత్రం (3 వ పాదం)

మసకపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ S.V.N. మూర్తి గారు సెల్ నెం.8179070179



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా సుమారు 13 kms. దూరాన, గోదావరి నదీ తీరం నందు మసకపల్లి (Masakapalli) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ మల్లీశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ భ్రమరాంబా సమేత మల్లీశ్వర స్వామి వారి ఆలయం ధనిష్ఠ నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ మల్లీశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ భ్రమరాంబా సమేత మల్లీశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. మసకపల్లి గ్రామం రెండు సార్లు గోదావరిలో మునిగిపోయినది. ఇప్పటి ఆలయం మూడవ సారి నిర్మించారు. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, గణపతి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, భ్రమరాంబదేవి, నవగ్రహ మండపం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మల్లీశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ భ్రమరాంబా సమేత మల్లీశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ బహుళ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్య షష్ఠి నిర్వ హించబడతాయి. కుంభ రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ప్రస్తుతం శివాలయంకు అర్చకస్వామి లేరు. మసకపల్లి గ్రామం నందు శ్రీదేవి, భూదేవి సమేత కేశవస్వామి వారి ఆలయం ఉంది. ప్రస్తుతం వైష్ణవ అర్చకస్వామి శ్రీ S.V.N. మూర్తి గారు Cell No.8179070179 శివాలయం కూడ చూసుచున్నారు. వీరిని సంప్రదించగలరు.

**స్థల పురాణం:** పవిత్ర గోదావరి నదికి ఉత్తర తీరం నందు మసకపల్లి క్షేత్రం ఉంది. క్షేత్రానికి సమీపం లో త్రివేణి సంగమం కలదు. పూర్వము మసకపల్లి గ్రామాన్ని "మస్కరపురి" అనే నామంతో వ్యవహరించేవారు. మస్కరులు అనగా మునీశ్వరులు. మునులు తపస్సుచేసిన ప్రాంతం కాబట్టి మస్కరపురి నామం వచ్చినట్లు కథనం. మల్లీశ్వర లింగమును పార్థప్రహార శివలింగంగా చెబుతారు. పూర్వము కిరాతార్జునీయ ఘట్టంలో పార్థునకు పరమశివునకు యుద్ధం జరిగిన సంధర్భంలో పార్థుడు తన గాండీవముతో శివయ్య శిరస్సుపై మోదినట్లు కథ ఉంది. స్వామి శిరస్సుపై పడిన గాయం తాలూకు రక్తపు మరక శివలింగంపై ఎరుపు రంగులో దర్శనమిస్తుంది అని స్థానికులు చెప్పుచుంటారు.

**రవాణా సమాచారం:** రామచంద్రాపురం నుంచి మసకపల్లి గ్రామం నకు (Via) ద్రాక్షారామం మీదగా బస్సులు పరిమితంగా ఉన్నాయి.

* ద్రాక్షారామం నకు సుమారు 21 kms. దూరాన యానాం అను పట్టణం ఉంది. రాజమండ్రి నుంచి యానాం పోవు బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కోలంక బస్ స్టాప్, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కోలంక మరియు ఇంజరం నుంచి మసకపల్లి గ్రామం నకు రోడ్డు మార్గములున్నాయి.

* యానాం నుంచి మసకపల్లి గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 12 kms. యానాం బైపాస్ రోడ్ (Sri Ravi Junior & Degree College, Near Yanam Bi Pass road, Sunkarapalem, Andhra Pradesh) నుంచి మసకపల్లి గ్రామం నకు గోదావరి గట్టు మీదగా ఆటోలు ఉంటాయి. షేరింగ్ ఆటోలు చాల తక్కువుగా ఉంటాయి. ఆటో రాను - పోను ఏర్పాట్లు చేసుకోవాలి.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ఉంటాయి.

కె.గంగవరం నుంచి మసకపల్లి గ్రామం కు (Via)
దంగేరు, భట్లపాలిక మీదగా షేరింగ్ ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 12 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు





శ్రీ భ్రమరాంబా సమేత మల్లేశ్వర స్వామి

కుంభ రాశి, ధనిష్ఠ నక్షత్రం (4 వ పాదం)

కుందూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ మద్దిరాల భాస్కర వాసు రామచంద్ర సత్యనారాయణ (రాంబాబు), Cell No. 96032 96104 సంప్రదించగలరు



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి దక్షిణ దిశగా సుమారు 5 kms. దూరాన కుందూరు (KUNDURU) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ మల్లేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ భ్రమరాంబా సమేత మల్లేశ్వర స్వామి వారి ఆలయం ధనిష్ఠ నక్షత్రం (4 వ పాదం) చెందినది. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ భ్రమరాంబా సమేత మల్లేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయంలో గణపతి దర్శనమిస్తాడు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మల్లేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ భ్రమరాంబా సమేత మల్లేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు నిర్వ హించబడతాయి. కుంభ రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం - కోటిపల్లి రోడ్డు మార్గములో కుందూరు బస్ స్టాప్, కె. గంగవరం మొదలగునవి ఉంటాయి.

* కుందూరు బస్ స్టాప్ కు కొంత లోపలకి, అనగా సుమారు 750 meters దూరాన శివాలయం ఉంటుంది.

* రాజమండ్రి - కోటిపల్లి & కాకినాడ - కోటిపల్లి బస్సులు కుందూరు బస్ స్టాప్ మీదగా ఉంటాయి.

* ద్రాక్షారామం నుంచి కె. గంగవరం వరకు షేరింగ్ ఆటోలు కలవు.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



శ్రీ రాజరాజేశ్వరీ సమేత ఛాయ సోమేశ్వర స్వామి

కుంభ రాశి, శతభిషం నక్షత్రం (1 వ పాదం)

కోటిపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** వంశపారంపర్య అర్చక స్వామి. శ్రీ శివకోటి బాల సుబ్రహ్మణ్యం (బాలు) సెల్: 94903 51195.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి దక్షిణ దిశగా, సుమారు 11 kms. దూరాన, కోటిపల్లి (Kotipalli) గ్రామం కలదు. పావన గౌతమీ నదీ తీరాన శ్రీ రాజరాజేశ్వరీ సమేత ఛాయ సోమేశ్వర స్వామి ఆలయం ఉంది. ఇది అష్ట సోమేశ్వరాలయాలలో దక్షిణ క్షేత్రంగా ప్రతీతి. భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా పేర్కొనారు. కోటిపల్లి క్షేత్రం లోని ఒకే ఆలయ ప్రాంగణములో శ్రీ ఛాయ సోమేశ్వర లింగము, శ్రీ కోటేశ్వర లింగము మరియు శ్రీ సిద్ధి జనార్ధన స్వామి దర్శనం లభ్యమవుతుంది.

**స్థల పురాణం:** కోటిపల్లి క్షేత్రం నందలి పవిత్ర స్నానం, దైవ దర్శనం, పితృ కర్మలు, తీర్థ దానాలు వలన కోటి రెట్లు ఫలం లభ్యమవుతుంది అని శాస్త్రములు తెల్పుచున్నావి. కోటి కన్యాదానాల ఫలం, నూరు అశ్వమేధయాగాల ఫలం, కోటి శివలింగాలు ప్రతిష్ఠ చేసిన పుణ్యఫలాన్ని ఇస్తుంది అని మన ఆర్యులు చెప్పుచుంటారు. శ్రీమన్నారాయణుడు ఆజ్ఞ అనుసరించి చంద్రుడు (సోముడు) తన శాపవిమోచన కోసం ఒక శివలింగాన్ని ప్రతిష్టించి, ఆరాదించినాడు. ఆ శివ లింగము ఛాయ సోమేశ్వర లింగముగా పిలువబడుచున్నాది.

**ఆలయం:** శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వరాలయం తూర్పు అభిముఖముగా ఉంటుంది. ప్రధానాలయం నందు శ్రీ ఛాయ సోమేశ్వర లింగము, శ్రీ రాజరాజేశ్వరీ అమ్మ వారు, శ్రీ సిద్ధి జనార్ధన స్వామి, శ్రీ కోటేశ్వర లింగము మరియు నందీశ్వరుడు ఉంటారు. ఆలయ సమూహం విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో నవగ్రహములు, శ్రీ చంద్రమౌళేశ్వర స్వామి, ఆది శంకరాచార్యులు, కాలభైరవ స్వామి, పార్వతీ దేవి, మృత్యుంజయ మూర్తిని దర్శించగలము. ఆలయ ప్రవేశ ద్వారము, ఆలయ శిఖరం, ధ్వజస్థంభము కేవలం ఒకటి మాత్రమే ఉంటుంది. ఆలయ శిఖరం పైన పూర్ణ కలశం ఉంటుంది. ఉత్సవాలు కూడ శివ-కేశవులకు కలసి ఒకటిగానే ఉంటాయి. మహాశివరాత్రికి అంగరంగ వైభవముగా ఉత్సవాలు జరుగుతాయి. వైశాఖ శుద్ధ ద్వాదశి (క్షీరాబ్ధి ద్వాదశి) నాడు ఆలయ పుష్కరిణిలో (సోమ తీర్థం) ఒకే వేదికపై తెప్పోత్సవం నిర్వహించుతారు. భక్తులు పావన గోదావరి పుణ్యతీర్థంలో స్నానమాచరించి, ఆలయ ప్రదక్షిణ తర్వాత కోటేశ్వర స్వామిని, తదుపరి శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వర స్వామిని, అనంతరం శ్రీ దేవి - భూదేవి సమేత సిద్ధి జనార్ధన స్వామిని దర్శించుకుని పిమ్మట శ్రీ రాజరాజేశ్వరీ అమ్మవారిని దర్శించుకోవడం ఆలయ ఆచారంగా వస్తోంది. ప్రధానాలయం నందు అంతరాలయాలు, గర్భాలయాలు వేరు వేరుగా ఉంటాయి. శ్రీ ఛాయ సోమేశ్వర స్వామికి ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు జరుగుతాయి. వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు శివ-కేశవులకు ఏక కాలములో కళ్యాణ ఉత్సవాలు నిర్వహించుతారు. మహా శివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు జరుగుతాయి. సాయంత్ర కోటి దీపోత్సవం ఉంటుంది. ఆలయం నందు కార్తీక

మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు విశేషముగా ఉంటుయి. ఆలయ సేవలు కోసం అర్చక స్వామి గారిని సంప్రదించగలరు. శ్రీ సోమేశ్వర లింగము, శతభిషం (1 వ పాదం) లింగము చెందినది. శతభిషం (1 వ పాదం) నందు జన్మంచిన శిశువు దోషం నకు ఉపశమనం (ఊరట) కొరకు అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కాకినాడ నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* కాకినాడ పాత బస్ స్టాండ్ మరియు కాకినాడ జగన్నాధపురం బ్రిడ్జి నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* ద్రాక్షారామం నుంచి కోటిపల్లి కు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ఉంటాయి.





శ్రీ పార్వతీ సమేత కోటేశ్వర స్వామి

కుంభ రాశి, శతభిషం నక్షత్రం (2 వ పాదం)

కోటిపల్లి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** వంశపారంపర్య అర్చక స్వామి. శ్రీ శివకోటి బాలసుబ్రహ్మణ్యం (బాలు) సెల్: 94903 51195.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి దక్షిణ దిశగా, సుమారు 11 kms. దూరాన, కోటిపల్లి (Kotipalli) గ్రామం కలదు. పావన గౌతమీ నదీ తీరాన శ్రీ ఛాయ సోమేశ్వర స్వామి ఆలయం ఉంది. ఆలయ ప్రాంగణములో శ్రీ పార్వతీ సమేత కోటేశ్వర స్వామికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. భీమసభ నందలి 108 శివ లింగాలలో కోటేశ్వర లింగము ఒకటిగా పేర్కొనారు.

**స్థల పురాణం:** కోటిపల్లి క్షేత్రం నందలి పవిత్ర స్నానం, దైవ దర్శనం, పితృ కర్మలు, తీర్థ దానాలు వలన కోటి రెట్లు ఫలం లభ్యమవుతుంది అని శాస్త్రములు తెల్పుచున్నావి. కోటి కన్యాదానాల ఫలం, నూరు అశ్వమేధయాగాల ఫలం, కోటి శివలింగాలు ప్రతిష్ఠ చేసిన పుణ్యఫలాన్ని ఇస్తుంది అని మన ఆర్యులు చెప్పుచుంటారు.

**శ్రీ కోటేశ్వర లింగ వృత్తాంతము:** అహల్య భర్తయైన గౌతముడు ఉదయాన్నే నదీ స్నానానికి వెళ్ళగా ఆమె మీద కోరికతో దేవేంద్రుడు ఆమె భర్త రూపంలో వచ్చి కోరిక తీర్చమని అడుగుతాడు. ఇంద్రుడి మోసం తెలియక అహల్య అందుకు అంగీకరిస్తుంది. అదే సమయానికి గౌతముడు తిరిగివచ్చి, ఆమెని శపిస్తాడు. " ఇహవర్ష సహస్రాణి బాహూని నిసిశ్వసి.వాయు భక్ష్యా నిరాహారా తప్యాని భస్మశాయినీ. అదృశ్య సర్వ భూతానాంఆశ్రమే అస్మిన్ నివసిష్యసి". అని శాపం ఇస్తాడు. బహు సంవత్సరాలు నీవు గాలిని భక్షిస్తూ ఆహారము లేక తపస్సు చేసుకుందువు. నీపైన పరాగము(బూడిద) కప్పబడుతుంది. నీవెవరికీ కనబడవు. అదృశ్య రూపమున ఇక్కడనే తపస్సు చేసికొనుము అని అర్థం.
త్రేతా యుగంలో మహా విష్ణువు రాముని అవతారమెత్తి ఆయన పాదధూళిచే నీకు శాపవిమోచనం అవుతుందని తెలియబరుస్తాడు. ఇంద్రుణ్ణి తన శరీరమంతా స్త్రీ జననేంద్రియాలతో నిండిపోయేలాగా శపిస్తాడు. వృషణాలు నేలరాలి పోయేటట్లు చేస్తాడు. కానీ ఇంద్రుడు ఇతర దేవతల సాయంతో ఒక జీవాన్ని బలి ఇచ్చి దాని వృషణాలను అతికించేటట్లు చేస్తాడు. అమ్మవారిని గురించి తపస్సు చేసి తన శరీరంపై ఉన్న స్త్రీ జననేంద్రియాలను కన్నులులాగా కనిపించేటట్లు వరం పొందుతాడు. అందుకనే ఆయన్ను సహస్రాక్షుడు అని కూడా వ్యవహరిస్తారు. ఇంద్రుడు తన పాప ప్రక్షాళన కోసం కోటేశ్వర లింగాన్ని ప్రతిష్టించి, కోటి నదీ ధారలతో అభిషేకించి శాప విముక్తి పొందినాడు. ఆ లింగము శ్రీ కోటేశ్వర లింగముగా ప్రసిద్ధి చెందినది.

**ఆలయం:** శ్రీ రాజరాజేశ్వరీ సమేత సోమేశ్వరాలయం తూర్పు అభిముఖముగా ఉంటుంది. ప్రధానాలయం నందు శ్రీ ఛాయ సోమేశ్వర లింగము, శ్రీ రాజరాజేశ్వరీ అమ్మ వారు, శ్రీ సిద్ధి జనార్ధన స్వామి, శ్రీ కోటేశ్వర లింగము మరియు నందీశ్వరుడు ఉంటారు. ఆలయ సమూహం విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో నవగ్రహములు, శ్రీ చంద్రమౌళేశ్వర స్వామి, ఆది శంకరాచార్యులు, కాలభైరవ స్వామి, పార్వతీ దేవి, మృత్యుంజయ మూర్తిని దర్శించగలము. ఆలయ ప్రవేశ ద్వారము,

ఆలయ శిఖరం, ధ్వజస్ధంభము కేవలం ఒకటి మాత్రమే ఉంటుంది. ఆలయ శిఖరం పైన పూర్ణ కలశం ఉంటుంది. ఉత్సవాలు కూడ శివ-కేశవులకు కలసి ఒకటిగానే ఉంటాయి. మహాశివరాత్రికి అంగరంగ వైభవముగా ఉత్సవాలు జరుగుతాయి. వైశాఖ శుద్ధ ద్వాదశి (క్షీరాబ్ధి ద్వాదశి) నాడు ఆలయ పుష్కరిణిలో (సోమ తీర్ధం) ఒకే వేదికపై తెప్పోత్సవం నిర్వహించుతారు.

భక్తులు పావన గోదావరి పుణ్యతీర్ధంలో స్నానమాచరించి, ఆలయ ప్రదక్షిణ తర్వాత కోటేశ్వర స్వామిని, తదుపరి శ్రీ సోమేశ్వర స్వామిని, అనంతరం శ్రీ దేవి - భూదేవి సమేత సిద్ధి జనార్దన స్వామిని దర్శించుకుని పిమ్మట శ్రీ రాజరాజేశ్వరీ అమ్మవారిని దర్శించుకోవడం ఆలయ ఆచారంగా వస్తోంది. ప్రధానాలయం నందు అంతరాలయాలు, గర్భాలయాలు వేరు వేరుగా ఉంటాయి. శ్రీ కోటేశ్వర లింగము ప్రధానాలయం వెనుక వైపున ఉంటుంది. ఇది కూడ ప్రధానాలయంలో ఒక భాగము. అమ్మవారిని పార్వతీ దేవిగా కొలుస్తారు.

శ్రీ పార్వతీ సమేత కోటేశ్వర స్వామికి ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు జరుగుతాయి. వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు శివ-కేశవులకు ఏక కాలములో కళ్యాణ ఉత్సవాలు నిర్వహించుతారు. మహా శివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు జరుగుతాయి. సాయంత్ర కోటి దీపోత్సవం ఉంటుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు విశేషముగా ఉంటుయి. ఆలయ సేవలు కోసం అర్చక స్వామి గారిని సంప్రదించగలరు.

శ్రీ కోటేశ్వర లింగము, శతభిషం (2 వ పాదం) లింగము చెందినది. శతభిషం (2 వ పాదం) నందు జన్మంచిన శిశువు దోషం నకు ఉపశమనం (ఊరట) కొరకు అభిషేక శాంతులు నిర్వహించుతారు.

**రవాణా సమాచారం:** కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కాకినాడ నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* కాకినాడ పాత బస్ స్టాండ్ మరియు కాకినాడ జగన్నాధపురం బ్రిడ్జి నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* ద్రాక్షారామం నుంచి కోటిపల్లి కు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* ప్రయాణికుల అభ్యర్ధన బట్టి బస్సులు ఆలయం కోనేరు వద్ద ఆగుతాయి. ఆలయం నకు సుమారు 200 meters దూరంలో కోటిపల్లి రేవు ఉంటుంది. కోటిపల్లి రేవుకు ఒక వైపు Boat సౌకర్యం మరో వైపు స్ధానిక బస్ స్టాండ్ & ఆటో స్టాండు ఉంటాయి.



శ్రీ భ్రమరాంబా సమేత మూలేశ్వర స్వామి

కుంభ రాశి, శతభిషం నక్షత్రం (3 వ పాదం)

తొత్తరమూడి గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** అర్చకస్వామి శ్రీ చంద్రమౌళి సత్యసాయి బాబ శర్మ, సెల్: 98669 94636. ఇతర అర్చక స్వాములు శ్రీ చంద్రమౌళి నరసింహశర్మ - 99497 29396 & 70957 81744, శ్రీ కంఠం భానోదయ రాజేశ్వరి శర్మ - 94401 19443 & శ్రీ కంఠం చక్రవర్తి - 98669 46365.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 18 kms. దూరాన తొత్తరమూడి (Tottaramudi) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ మూలేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ భ్రమరాంబా సమేత మూలేశ్వర స్వామి వారి ఆలయం శతభిషం నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ మూలేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ భ్రమరాంబా సమేత మూలేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ఆంజనేయ స్వామి, గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, పార్వతీదేవి మరియు అయ్యప్ప సన్నిధిలు మరియు ప్రధానాలయం, ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మూలేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ భ్రమరాంబా సమేత మూలేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు, సుబ్రహ్మణ్యేశ్వర షష్టి, హనుమ జయింతి, హను మద్వ్రతము, ప్రభల తీర్ధం (కనుమ నాడు) నిర్వహించబడతాయి. కుంభ రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**స్థల పురాణం:** త్రేతాయుగంలో శ్రీ రామచంద్రమూర్తి ముక్తేశ్వర క్షేత్రం సందర్శించినపుడు శ్రీరాముడితో పాటు వచ్చిన తత్వవేత్తలు, వేదకోవిదులే తొత్తరమూడి గ్రామంలోనే విడిది చేసినారు. దాని వలన ఈ ప్రాంతము "తత్వపురి" గా ఖ్యాతి పొందినది. కొంత కాలము తర్వాత తొత్తరమూడి గా మార్పు చెందినట్లు తెలియుచున్నది. ఈ ప్రాంతం పూర్వం ముని ఖండంగా వుండేదని, మృ ఖండ మహర్షి ఒక శివలింగం ప్రతిష్టించినట్లు చెప్పుచుంటారు.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు (Via) వాడపాలెం, వెలవలపల్లి, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 25 Kms.

* ముక్తేశ్వరం నుంచి తొత్తరమూడి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 2 Kms.

* అమలాపురం - వీరవల్లిపాలెం బస్సులు (Via) ముక్తేశ్వరం మీదగా ఉంటాయి. అమలాపురం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 10 Kms. అమలాపురం నుంచి ముక్తేశ్వరం కు షేరింగ్ ఆటోలు కూడ ఉంటాయి.

* ముక్తేశ్వరం నుంచి తొత్తరమూడి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 2 Kms.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం నుంచి తొత్తరమూడి కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 2 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు.





శ్రీ లోప ముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి

కుంభ రాశి, శతభిషం నక్షత్రం (4 వ పాదం)

పాతకోట గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక దత్తాత్రేయ, సెల్ నెం. 9491755744.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి దక్షిణ దిశగా, సుమారు 10 kms. దూరాన, పాతకోట (Patakota) అను గ్రామం కలదు. (Google Map లో కోట గ్రామంగా చూపుతుంది). సుందర గోదావరి నదీ తీరప్రాంతములో పాతకోట గ్రామం ఉంటుంది. గోదావరి సోగసులు యాత్రికులకు నేత్రానందము పంచుతాయి. పాతకోట గ్రామంలో శ్రీ లోప ముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ అగస్త్యేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైది. ఆలయ ప్రాంగణము చాల విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రవేశం తూర్పు ముఖద్వారం నుంచి జరుగుతుంది. ప్రధానాలయం కూడ తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయంతో పాటు ధ్వజస్తంభం, నంది, నాగ బంధం (వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి), చండీశ్వరుడు మొదలగునవి ఉంటాయి. ముఖమండపం నందు గణపతి మరియు శ్రీ లోప ముద్రా దేవికి ప్రత్యేక సన్నిధిలున్నాయి. గణపతి (ఉత్తరాభి ముఖం), శ్రీ లోప ముద్రా దేవి (దక్షిణాభి ముఖం) కొలువుదీరినారు. అంతరాలయం నందు చిన్న నంది విగ్రహం ఉంది. గర్భాలయంలో శ్రీ అగస్త్యేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామి వామ భాగం నందు శ్రీ లోప ముద్రా దేవి కొలువుదీరింది. స్వామిని సేవించిన వారు విశేష ఫలాలను పొందగలరు అని భక్తుల విశ్వాసం. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. కార్తీక పౌర్ణమి నాడు జ్వాలా తోరణము జరుపుతారు. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. శాంతి కళ్యాణం, హోమం, జరుగుతాయి. రాత్రికి భజన కార్యక్రమాలు ఉంటాయి. శరన్నవరాత్రులు సందర్భంగా తొమ్మిది రోజులు పాటు విశేష అర్చనలు వైభవంగా జరుగుతాయి. సుబ్రహ్మణ్య షష్టి ఘనంగా నిర్వహించుతారు. పంచమి నాడు వల్లీదేవసేన సమేత సుబ్రహ్మణ్య స్వామి కళ్యాణం జరుగుతుంది. సంక్రాంతి, దీపావళీ మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా ఉంటాయి.నక్షత్ర శాంతి కోసం ఆలయ అర్చక స్వామి: శ్రీ కొత్తలంక దత్తాత్రేయ, సెల్ నెం. 9491755744 సంప్రదించగలరు.

**రవాణా సమాచారం:** కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కే. గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రపురం, ద్రాక్షారామం, కే. గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* కోటిపల్లి నుంచి పాతకోట గ్రామం నకు (వయా) కోటిపల్లి - యానాం గోదావరి గట్టు మీదగా ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 04 Kms,

* ద్రాక్షారామం మరియు కే. గంగవరం నుంచి పాతకోట గ్రామం నకు (వయా) పాత కోట సెంటర్ మీదగా పాత కోట కు రోడ్డు మార్గం కలదు. కే. గంగవరం - కోటిపల్లి రోడ్డు మార్గములో పాత కోట సెంటర్ ఉంటుంది.

* పాత కోట సెంటర్ నుంచి పాత కోట గ్రామం మధ్య దూరం సుమారు 02 Kms.

° ద్రాక్షారామం - కే. గంగవరం - పాత కోట సెంటర్ - పాత కోట గ్రామం మధ్య దూరం సుమారు 10 Kms.

* కే. గంగవరం - పాత కోట సెంటర్ - పాత కోట గ్రామం మధ్య దూరం సుమారు 04 Kms.

* ద్రాక్షారామం - కే. గంగవరం మధ్య షేరింగ్ ఆటోలు ఉంటాయి. కే. గంగవరం నుంచి పాత కోట గ్రామం కు ఆటోలు రాను-పోను ఏర్పాట్లు చేసుకోవాలి.

ఆలయ సమాచారం & Photos అందించిన పాత కోట - శ్రీ లోప ముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి వారి ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కొత్తలంక దత్తాత్రేయ, సెల్ నెం. 9491755744 గార్కి నా నమసుమాంజలి.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు



శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి

కుంభ రాశి, పూర్వాభాద్ర నక్షత్రం (1 వ పాదం)

ముక్తీశ్వరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** అర్చకస్వామి శ్రీ కంఠం చక్రవర్తి, సెల్: 98669 46365 & 98491 11479 (Whats).ఇతర అర్చక స్వాములు శ్రీ చంద్రమౌళి నరసింహశర్మ - 99497 29396 & 70957 81744, శ్రీ కంఠం భానోదయ రాజేశ్వరి శర్మ - 94401 19443 & శ్రీ చంద్రమౌళి సత్యసాయి బాబ శర్మ - 98669 94636.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి నైఋతి దిశగా సుమారు 16 kms. దూరాన ముక్తీశ్వరం (Muktheswaram) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ ముక్తేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి వారి ఆలయం పూర్వాభాద్ర నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ ముక్తేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో వల్లభ గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, రాజరాజేశ్వరీ, కాల భైరవుడు, సీతారాములు సన్నిధిలు మరియు ప్రధానాలయం, ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ ముక్తేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ దశమి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు, సుబ్రహ్మణ్యేశ్వర కళ్యాణం (పంచమి నాడు) సుబ్బారాయుడు షష్టి, కార్తీక పూజలు, మహాశివరాత్రి, శ్రీ రామనవమి, ప్రభల తీర్థం (కనుమ నాడు) నిర్వహించబడతాయి. కుంభ రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ముక్తేశ్వరం బస్ స్టాప్ కు సుమారు 500 meters దూరాన (ముక్తేశ్వరం రేవు వైపు) శ్రీ ముక్తికాంత సమేత శ్రీ క్షణముక్తీశ్వరాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఇది లోక ప్రసిద్ధి చెందిన శివాలయం. భక్తులు క్షణకాలం శివుడుని ఆరాధించిన ముక్తిని పొందగలరు అని నమ్మకం కలదు. ముక్తీశ్వరుడు కొలువుదీరిన క్షేత్రం ముక్తేశ్వరంగా ఖ్యాతి పొందింది. క్షణముక్తీశ్వరాలయం నకు ఎదురుగా శ్రీ రాజరాజేశ్వరీ సమేత శ్రీ ముక్తేశ్వర స్వామి ఆలయం పశ్చిమాభి ముఖంగా ఉంటుంది. ఇది భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**స్థల పురాణం:** త్రేతాయుగంలో శ్రీ రామచంద్రమూర్తి ముక్తేశ్వర క్షేత్రం నందలి శ్రీ క్షణముక్తీశ్వర స్వామిని సేవించినట్లు బ్రహ్మాండ పరాణం నందలి గౌతమి మహాత్యంలో ఉంది. శ్రీరాముడు ఒక యోగినికి (శ్రావణి) శాప విమోచన కోసం శివుడును ప్రార్ధించుతాడు. శివుడు ప్రత్యక్షమై ఒక క్షణంలో ఆమెకు మోక్షం (ముక్తి) ప్రసాధించుతాడు. యోగిని ఆరాధించిన శివలింగము క్షణ ముక్తీశ్వరుడుగా ప్రసిద్ధి గాంచినాడు. పార్వతీ దేవిని ముక్తికాంత అని పిలుస్తారు.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు (Via) వాడపాలెం, వెలవలపల్లి, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 25 Kms.

* అమలాపురం - వీరవల్లిపాలెం బస్సులు (Via) ముక్తేశ్వరం మీదగా ఉంటాయి. అమలాపురం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 10 Kms. అమలాపురం నుంచి ముక్తేశ్వరం కు షేరింగ్ ఆటోలు కూడ ఉంటాయి.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ఆటోలు శ్రీ ముక్తికాంత సమేత శ్రీ క్షణముక్తీశ్వరాలయం మీదగా ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు





శ్రీ భ్రమరాంబికా సమేత చౌడేశ్వర స్వామి

కుంభ రాశి, పూర్వాభాద్ర నక్షత్రం (2 వ పాదం)

శానపల్లిలంక గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ మద్దిరాల వీరవెంకట నాగ శ్రీహరి, సెల్ నెం : 94930 94154.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి దక్షిణ దిశగా సుమారు 20 kms. దూరాన శానపల్లిలంక (Sanapallilanka) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ చౌడేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ భ్రమరాంబికా సమేత చౌడేశ్వర స్వామి వారి ఆలయం పూర్వాభాద్ర నక్షత్రం (2 వ పాదం) చెందినది. శ్రీ చౌడేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలస్వామివారి ఆలయం మరియు శ్రీ భ్రమరాంబికా సమేత చౌడేశ్వర స్వామి ఆలయం ఒకే ప్రాంగణములో ఉంటాయి. శ్రీ భ్రమరాంబికా సమేత చౌడేశ్వర వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. శివాలయం నందు ధ్వజస్తంభం, చండీశ్వరాలయం, భ్రమరాంబికా, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. అంతరాలయం లో మహాగణపతి దర్శనమిస్తాడు. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ చౌడేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ భ్రమరాంబికా సమేత చౌడేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు నిర్వ హించబడతాయి. కుంభ రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**స్థల పురాణం:** పవిత్ర గోదావరి నదికి ఉత్తర తీరం నందు కోటిపల్లి క్షేత్రం మరియు దక్షిణ తీరం నందు శానపల్లిలంక ఉన్నాయి. త్రేతాయుగములో శ్రీ రామచంద్ర మూర్తి తన పరివారముతో పుష్పక విమానంలో తీర్థ యాత్రలకు బయలు దేరుతాడు. కోటిపల్లి క్షేత్రం దర్శనం పిమ్మట తిరుగు ప్రయాణములో ఒక ప్రాంతము నందు పుష్పక విమానం ఆగిపోతుంది. వానర వీరులు శోధించగా ఒక మట్టి పుట్ట నుంచి దివ్య కాంతి కనబడుతుంది. ఆ పుట్టలో ఒక శివాలయం ఉంటుంది. అదే శ్రీ క్షణ ముక్తేశ్వర శివాలయం. శ్రీ రామచంద్ర మూర్తి తన పరివారముతో శ్రీ క్షణ ముక్తేశ్వర స్వామిని సేవించుతారు. అయోధ్య సేనలు విడిది చేసిన ఆ ప్రాంతము సేనపల్లి గా ఖ్యాతి పొందినది. కాలక్రమంలో శానపల్లి లంకగా రూపాంతరం చెందినట్లు కథనం.

**రవాణ సౌకర్యములు:** రావులపాలెం - మురమళ్ళ బస్సులు (Via) వాడపాలెం, వెలవలపల్లి, ముక్తేశ్వరం మీదగా ఉంటాయి.

* రావులపాలెం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 25 Kms.

* ముక్తేశ్వరం నుంచి శానపల్లిలంక కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

2) అమలాపురం - వీరవల్లిపాలెం బస్సులు (Via) ముక్తేశ్వరం మీదగా ఉంటాయి. అమలాపురం - ముక్తేశ్వరం మధ్య దూరం సుమారు 10 Kms. అమలాపురం నుంచి ముక్తేశ్వరం కు షేరింగ్ ఆటోలు కూడ ఉంటాయి.

* ముక్తేశ్వరం నుంచి శానపల్లిలంక కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

* కోటిపల్లి రేవు నుంచి ముక్తేశ్వరం రేవుకు Boat సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ముక్తేశ్వరం కు రవాణ సౌకర్యములు ఉంటాయి. ముక్తేశ్వరం రేవు నుంచి ఆటోలు శ్రీ ముక్తికాంత సమేత శ్రీ క్షణముక్తీశ్వరాలయం మీదగా ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

* ముక్తేశ్వరం నుంచి శానపల్లిలంక కి ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చకస్వామిని సంప్రదించగలరు





శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి

కుంభ రాశి, పూర్వాభాద్ర నక్షత్రం (3 వ పాదం)

తాణేలంక గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ వెలవలపల్లి విశ్వనాథ శాస్త్రి, సెల్ నెం : 94921 83497 & 75698 60653 సంప్రదించగలరు. ఇతర అర్చక స్వాములు శ్రీ వెలవలపల్లి సత్యనారాయణ మూర్తి - 94907 98239, శ్రీ వెలవలపల్లి కిరణ్ కుమార్ - 94937 80060, శ్రీ వెంకట రామసోమయాజులు - 95502 81128.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా సుమారు 36Kms. దూరాన తాణేలంక (Thanelanka) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ సోమేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి ఆలయం పూర్వాభాద్ర నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ సోమేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ భ్రమరాంబికా సమేత చౌడేశ్వర వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, గణపతి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, ఆంజనేయస్వామి, ముఖమండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ సోమేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు మాఘ శుద్ధ దశమి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్యేశ్వరుని కళ్యాణము మరియు సుబ్బారాయుడు షష్టి నిర్వ హించబడతాయి. కుంభ రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

ఆలయం నందు తిరుగుడు నంది ఉంది. పూర్వం గ్రామంలో నిండు చూలాలు ప్రసవమునకు ఇబ్బంది పడుతున్న సమయంలో ఆమె భర్త యొక్క కోరికపై అర్చకులు తిరుగుడు నందిని ఆ స్త్రీ వున్న గృ హం వైపునకు త్రిప్పిన యెడల సుఖ ప్రసవము అయ్యేదట!

**రవాణ సౌకర్యములు:** అమలాపురం - కాకినాడ బస్సులు (Via) ముమ్మిడివరం, మురమళ్ళ, యానాం మీదగా ఉంటాయి.

అమలాపురం - ముమ్మిడివరం మధ్య దూరం సుమారు 14 Kms.

* ముమ్మిడివరం నకు వాయువ్యం దిశగా సుమారు 3 Kms. దూరాన తాణేలంక గ్రామం ఉంది. ఇక్కడ శ్రీ పార్వతీ సమేత సోమేశ్వర స్వామి ఆలయం కలదు. ముమ్మిడివరం నుంచి తాణేలంక గ్రామం కు ఆటోలు ఉంటాయి.

* ముక్తేశ్వరం నుంచి ముమ్మిడివరం కు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 11Kms. ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి.

* ముక్తేశ్వరం నుంచి కొండలమ్మ చింత జంక్షన్ వరకు షేరింగ్ ఆటోలు ఉంటాయి. అమలాపురం - ముమ్మిడివరం రోడ్డు మార్గములో కొండలమ్మ చింత జంక్షన్ ఉంటుంది. కొండలమ్మ చింత జంక్షన్ నుంచి ముమ్మిడివరం కు షేరింగ్ ఆటోలు ఉంటాయి.

* ద్రాక్షారామం - యానాం మరియు యానాం - ముమ్మిడివరం మధ్య బస్సులు కలవు.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.








మీన రాశి జాతక చక్రంలో **ఆఖరుది (12 వ)**

ఈ రాశికి **అధిపతి గురువు**

ఈ రాశి సరి రాశి, ద్విశ్వభావ రాశి, స్త్రీ రాశి, శుభ రాశిగా వ్యవహరిస్తారు

మీన రాశి **9 ఆలయాలు** ఉంటాయి

**పూర్వాబాధ్ర** నక్షత్రంలోని **4** వ పాదము

**ఉత్తరాబాధ్ర** నక్షత్రంలోని **1,2,3,4** పాదములు

**మరియు రేవతి** నక్షత్రంలోని **1,2,3,4** పాదములు

**9 ఆలయాలు** కలిసి మీన రాశి గా వ్యవహరిస్తారు

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.

శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి

మీన రాశి, పూర్వాభాద్ర నక్షత్రం (4 వ పాదం)

ఎర్రపోతవరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ ఉండి వెంకట సూర్య సుబ్రహ్మణ్య శాస్త్రి, సెల్: 94946 63363.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా సుమారు 4.5 Kms. దూరాన ఎర్రపోతవరం (Yerrapothavaram) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ మల్లేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి వారి ఆలయం పూర్వాభాద్ర నక్షత్రం (3 వ పాదం) చెందినది. ఆలయ ప్రాకారము నందు శ్రీ రుక్మిణి సత్యభామా సమేత వేణుగోపాలస్వామివారి ఆలయం కూడ కలదు. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరాలయం, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మల్లేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ దశమి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు నిర్వహించబడతాయి. మీన రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 4 Kms. దూరంలో ఎర్ర పోతవరం బస్ స్టాప్ ఉంటుంది. ఇక్కడ నుంచి ఎర్రపోతవరం గ్రామం కు రోడ్డు మార్గము కలదు.

* ఎర్ర పోతవరం బ్రిడ్జి దిగువ నుంచి శ్రీ పార్వతీ సమేత మల్లేశ్వర స్వామి ఆలయ దూరం సుమారు 100 meters. రామాలయం దగ్గరలో శివాలయం ఉంటుంది.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ ఉమా సమేత సోమేశ్వర స్వామి

మీన రాశి, ఉత్తరాబాధ్ర నక్షత్రం (1 వ పాదం)

దంగేరు గ్రామం

అష్ట సోమేశ్వరాలయాలు (ఆగ్నేయం క్షేత్రం)

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ ఉండి అక్కయ్య శర్మ, సెల్: 99513 20347.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 11 kms. దూరాన, దంగేరు (Dangeru) గ్రామం కలదు. ఇచ్చట శ్రీ ఉమా సమేత సోమేశ్వర స్వామి ఆలయం ఉంది. కశ్యప మహర్షి ప్రథమ పూజ గావించినాడు. ఆలయం చాల ప్రాచీనమైనది. పూర్వం ఆలయం భూమి ఉపరితలము నకు సుమారు నాలుగు అడుగుల లోతులో ఉండేది. మెట్లు సహాయంతో ఆలయం లోనికి ప్రవేశించేవారు. 2011 సంవత్సరములో ఆలయం పునర్నిర్మాణం గావించి, పునః ప్రతిష్ఠ చేసారు. ఇది అష్ట సోమేశ్వరాలయాలలో ఆగ్నేయం క్షేత్రంగా ప్రతితీ. భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా పేర్కొనారు. దక్షిణ కాశీగా పిలువబడే ద్రాక్షారామ క్షేత్రం నందలి శ్రీ భీమేశ్వర లింగము సూర్య యంత్ర ప్రతిష్ఠ. ఆ రుద్రమూర్తిని శాంతపరచేందుకు ద్రాక్షారామ క్షేత్రం చుట్టూ ఎనిమిది చంద్ర యంత్ర ప్రతిష్ఠలు జరిగాయి. ఈ శివాలయాలను అష్ట సోమేశ్వరాలయాలు అని అంటారు. ఇవి ద్రాక్షారామం పరిసరాల్లోనే ఉంటాయి. ద్రాక్షారామ క్షేత్రం నకు ఆగ్నేయం దిశలో దంగేరు క్షేత్రం ఉంది. ఇచ్చట శ్రీ ఉమా సమేత సోమేశ్వరాలయం దర్శించగలము.

**ఆలయం:** శ్రీ ఉమా సమేత సోమేశ్వరాలయం తూర్పు అభిముఖముగా ఉంటుంది. ప్రధానాలయం నందు శ్రీ సోమేశ్వర లింగము, శ్రీ ఉమా దేవి అమ్మ వారు దర్శనమిస్తారు. ఆలయ విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ధ్వజసంభం, నవగ్రహములు, శ్రీ చండేశ్వర స్వామి, నాగమ్మ తల్లిని దర్శించగలము. ప్రధానాలయం చుట్టూ (గోడ గూటిలో) నాట్యా గణపతి, మేథా దక్షిణ మూర్తి, లింగోద్భవం, బ్రహ్మ, పార్వతి మూర్తులు ఉంటారు. ముఖ మండపం నందు నందీశ్వరుడు, అంతరాలయం నందు గణపతి, కుమారస్వామి, గర్భాలయం లో 18 అంగుళాలు ఎత్తు గల పాన వట్టం పైన శ్రీ సోమేశ్వర లింగము, స్వామి వామ భాగం నందు శ్రీ ఉమా దేవి దర్శనమిస్తారు. శ్రీ సోమేశ్వర స్వామికి ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు జరుగుతాయి. వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు కళ్యాణ ఉత్సవాలు నిర్వహించుతారు. మహా శివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు జరుగుతాయి. రాత్రి లింగోద్భవం సమయం లో విశేష అభిషేకాలు ఉంటాయి. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు విశేషముగా ఉంటాయి. సంక్రాంతి సందర్భముగా కనుమ నాడు ప్రభల తీర్ధం జరుగుతుంది. దంగేరు చుట్టు ప్రక్కల గ్రామాలు నుంచి భక్తులు ప్రభలతో ఊరేగింపుగా, దంగేరు గ్రామ దేవత శ్రీ పాపలమ్మ తోటకు చేరుకొంటారు. అక్కడ కన్నులు విందుగా తీర్ధం జరుగుతుంది.

**రవాణా సమాచారం:** కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. కాకినాడ నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి. కాకినాడ పాత బస్ స్టాండ్ మరియు కాకినాడ జగన్నాథపురం బ్రిడ్జి నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* ద్రాక్షారామం నుంచి కోటిపల్లి కు కె.గంగవరం మీదగా షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ఉంటాయి.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని

సంప్రదించగలరు.





శ్రీ బాలాత్రిపురసుందరి సమేత నీలకంఠేశ్వర స్వామి

మీన రాశి, ఉత్తరాబాద్ర నక్షత్రం (2 వ పాదం)

కుడుపూరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** నాగమణి సెల్: 95050 34302 & 91775 83409 . ఇతర అర్చకులు శ్రీ విళ్ళూరి వెంకట సత్య సుబ్రహ్మణ్యం శర్మ, సెల్ నెం: 89788 05829.




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా సుమారు 14 Kms. దూరాన కుడుపూరు (Kudupuru) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ నీలకంఠేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ బాలాత్రిపురసుందరి సమేత నీలకంఠేశ్వర స్వామి వారి ఆలయం ఉత్తరాబాద్ర నక్షత్రం (2 వ పాదం) చెందినది. శ్రీ మల్లేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ బాలాత్రిపురసుందరి సమేత నీలకంఠేశ్వర వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, గణపతి, కుమారస్వామి, చండీశ్వరుడు, నవగ్రహములు, నాగేంద్రస్వామి, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ నీలకంఠేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ బాలాత్రిపురసుందరి సమేత నీలకంఠేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ దశమి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు, సుబ్రహ్మణ్య షష్ఠి నిర్వ హించబడతాయి. మీన రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము. ఆలయ అర్చకస్వామి కీర్తి శేషులు విళ్ళూరి సాంబశివరావు గారి భార్య శ్రీమతి వెంకట లక్ష్మీ నాగమణి గారి ఆధ్వర్యంలో బ్రాహ్మణులచే అర్చన కార్యక్రామాలు జరుగుచున్నాయి.

**రవాణా సమాచారం:** కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. కాకినాడ నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి. కాకినాడ పాత బస్ స్టాండ్ మరియు కాకినాడ జగన్నాధపురం బ్రిడ్జి నుంచి ద్రాక్షారామం నకు షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* ద్రాక్షారామం నుంచి కోటిపల్లి కు కె.గంగవరం మీదగా షేరింగ్ ఆటోలు దొరుకుతాయి.

* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ఉంటాయి.

* కె.గంగవరం నుంచి కుడుపూరు కు షేరింగ్ ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 8 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ పార్వతీ సమేత మార్కండేయ స్వామి

మీన రాశి, ఉత్తరాబాద్ర నక్షత్రం (3 వ పాదం)

గుడిగళ్ళభాగ గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కాళ్ళకూరి శివరామకృష్ణ ప్రసాద్ శర్మ, 95536 45066. ఇతర అర్చకులు శ్రీ కాళ్ళకూరి చంద్రమౌళి శర్మ - 90105 36030 & శ్రీ కాళ్ళకూరి సర్వేశ్వర రావు, సెల్ నెం: 95537 53735.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా సుమారు 9 Kms. దూరాన గుడిగళ్ళభాగ (Gudigalla Bhaga) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ మార్కండేయ లింగమును దర్శించగలము. శ్రీ పార్వతీ సమేత మార్కండేయ స్వామి వారి ఆలయం ఉత్తరాబాద్ర నక్షత్రం (3 వ పాదం) చెందినది. శ్రీ మార్కండేయ లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ పార్వతీ సమేత మార్కండేయ వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, గణపతి, కుమారస్వామి, చండీశ్వరుడు, నవగ్రహములు, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ మార్కండేయ లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ పార్వతీ సమేత మార్కండేయ స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ దశమి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు నిర్వ హించబడతాయి. మీన రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 4 Kms. దూరంలో ఎర్ర పోతవరం బస్ స్టాప్ ఉంటుంది. ఎర్ర పోతవరం బ్రిడ్జి దిగువ నుంచి గుడిగళ్ళభాగ గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 4 Kms.

* బాలాంతరము నుంచి గుడిగళ్ళభాగ గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 3 Kms.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత నీలకంఠ త్రిపురాంతక స్వామి

మీన రాశి, ఉత్తరాబాధ్ర నక్షత్రం (4 వ పాదం)

శివల గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కాళ్ళకూరి సర్వేశ్వర రావు, సెల్ నెం: 95537 53735. ఇతర అర్చకులు శ్రీ కాళ్ళకూరి శివరామకృష్ణ ప్రసాద్ శర్మ, 95536 45066 & శ్రీ కాళ్ళకూరి చంద్రమౌళి శర్మ - 90105 36030.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా సుమారు 6 Kms. దూరాన శివల (Sivala) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ నీలకంఠ త్రిపురాంతక లింగమును దర్శించగలము. శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత నీలకంఠ త్రిపురాంతకస్వామి వారి ఆలయం ఉత్తరాబాధ్ర నక్షత్రం (4 వ పాదం) చెందినది.
శ్రీ నీలకంఠ త్రిపురాంతక లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత నీలకంఠ త్రిపురాంతక వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, చండీశ్వరుడు, నవగ్రహములు, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ నీలకంఠ త్రిపురాంతక లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత నీలకంఠ త్రిపురాంతక స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు నిర్వ హించబడతాయి. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి కళ్యాణము మరియు షష్ఠి ఉత్సవములు జరుగుతాయి. కనుమ రోజున ప్రభల ఉత్సవము అత్యంత వైభవంగా జరుగుతుంది. మీన రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 4 Kms. దూరంలో ఎర్ర పోతవరం బస్ స్టాప్ ఉంటుంది.

* ఎర్ర పోతవరం బ్రిడ్జి దిగువ నుంచి శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత నీలకంఠ త్రిపురాంతక స్వామి ఆలయ దూరం సుమారు 2 Kms, ఉంటుంది. ఆటోలు ఉంటాయి.

NOTE: ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



## శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి
## మీన రాశి, రేవతి నక్షత్రం (1 వ పాదం)
## భట్లపాలిక గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కొత్తలంక సూర్యనారాయణ, సెల్ నెం: 91337 71257.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా సుమారు 12 Kms. దూరాన భట్లపాలిక (Bhatlapalika) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ అగస్త్యేశ్వర లింగమును దర్శించగలము. శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి వారి ఆలయం రేవతి నక్షత్రం (1 వ పాదం) చెందినది. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి వారి ఆలయం గౌతమీ (గోదావరి) నది తీరమున ఉన్నది. ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరుడు, విజయదుర్గ, సూర్యనారాయణ స్వామి, ఆంజనేయ స్వామి, గణపతి, కుమారస్వామి మరియు ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ అగస్త్యేశ్వర లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు ఫాల్గుణ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు నిర్వ హించబడతాయి. మీన రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 7 Kms. దూరంలో బాలాంత్రం బస్ స్టాప్ ఉంటుంది. ఇక్కడ నుంచి భట్లపాలిక గ్రామం నకు రోడ్డు ఉంది. వీటి మధ్మ దూరం సుమారు 6 Kms. గా ఉంటుంది. ఆటోలు ఉండవు. స్వంత వాహనములు కలిగిన వారికి బాగుంటుంది.

* ద్రాక్షారామం నకు సుమారు 21 kms. దూరాన యానాం అను పట్టణం ఉంది. రాజమండ్రి నుంచి యానాం పోవు బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, బాలాంత్రం, కోలంక, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. యానాం నుంచి భట్లపాలిక గ్రామం నకు ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 10 kms. యానాం బైపాస్ రోడ్ నుంచి భట్లపాలిక గ్రామం నకు గోదావరి గట్టు మీదగా ఆటోలు ఉంటాయి. షేరింగ్ ఆటోలు చాల తక్కువగా ఉంటాయి. ఆటో రాను - పోను ఏర్పాట్లు చేసుకోవాలి.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.
* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ఉంటాయి.

* కె.గంగవరం నుంచి మసకపల్లి గ్రామం కు (Via)
దంగేరు, భట్లపాలిక మీదగా షేరింగ్ ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 12 Kms.

* ద్రాక్షారామం నుంచి మసకపల్లి గ్రామం నకు బస్సులు (Via) కె.గంగవరం, దంగేరు, భట్లపాలిక మీదగా ఉంటాయి.
బస్సులు చాల తక్కువగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.





శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి

మీన రాశి, రేవతి నక్షత్రం (2 వ పాదం)

కాపులపాలెం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ కంఠం శేషగిరి రావు. సెల్ నెం. 6301324677




**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 17 kms. దూరాన, కాపులపాలెం (Kapulapalem) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం ఉంది. పూర్వం శ్రీ వీరభద్రేశ్వర స్వామి ఆలయంగా పిలిచేవారు. కాలక్రమంలో శ్రీ వీరేశ్వర స్వామి ఆలయంగా వాడకలోనికి వచ్చింది. శ్రీ వీరేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయం చాల ప్రాచీనమైది. కాల క్రమములో గ్రామస్తుల సహాయంతో శివాలయం పునర్నార్మించారు. ఆలయ ప్రాంగణము చాల విశాలముగా ఉంటుంది. ఆలయ ప్రవేశం ఉత్తర ద్వారం నుంచి జరుగుతుంది. ప్రధానాలయం తూర్పు అభిముఖంగా ఉంటుంది. ఆలయ ప్రాంగణములో ప్రధానాలయంతో పాటు ధ్వజస్తంభం, కాలభైరవుడు, నవగ్రహ మండపం, హోమగుండం, చండీశ్వరుడు, భారీ శివాకృతి మొదలగునవి ఉంటాయి. ముఖమండపం నందు నందీశ్వరుడు, గణపతి, భద్రకాళి దేవి సన్నిధిలు, ద్వారపాలకులు ఉంటారు. అంతరాలయం నందు చిన్న నంది విగ్రహం ఉంది. గర్భాలయంలో శ్రీ వీరేశ్వర లింగము దర్శనమిస్తుంది. స్వామిని సేవించిన వారు విశేష ఫలాలను పొందగలరు అని భక్తుల విశ్వాసం. ఆలయం నందు ప్రతి నిత్యం అర్చనలు, అభిషేకాలు, శాంతులు నిర్వహించుతారు. స్వామి వారి కళ్యాణం వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు జరుగుతుంది. ఆలయం నందు కార్తీక మాసంలో విశేష పూజలు జరుగుతాయి. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు జరుగుతాయి. మహాశివరాత్రి సందర్భముగా విశేష అభిషేకాలు ఉంటాయి. సంక్రాంతి, దీపావళీ మొదలగు పర్వదినాలు సందర్భముగా పూజలు విశేషంగా ఉంటాయి.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం - యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, కుయ్యేరు, ఇంజరం, కాపులపాలెం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* ద్రాక్షారామం - యానాం రోడ్డు మార్గములో కాపులపాలెం ఉంది. యానాం రోడ్డు ఆనుకుని, కనకలపేట రోడ్ కు సమీపంలోనే శివాలయం ఉంటుంది.

* కాకినాడ నుంచి యానాం కు బస్సులు (Via) చొల్లంగి, తాళ్ళరేవు, నీలపల్లి మీదగా ప్రతి గంటకు ఉంటాయి.

* యానాం బైపాస్ రోడ్ (Sri Ravi Junior & Degree College, Near Yanam Bi Pass Sunkarapalem, Andhra Pradesh) నుంచి కాపులపాలెం గ్రామం నకు బస్సులు, ఆటోలు దొరుకుతాయి. వీటి మధ్య దూరం సుమారు 01 kms.

* ఆలయ సమాచారం & Photos అందించిన కాపులపాలెం - శ్రీ భద్రకాళి సమేత శ్రీ వీరేశ్వర స్వామి ఆలయ అర్చక స్వామి అయిన శ్రీ కంఠం శేషగిరి రావు. సెల్ నెం. 6301324677 గార్కి నా నమసుమాంజలి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి

మీన రాశి, రేవతి నక్షత్రం (3 వ పాదం)

పేకేరు గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ ఉండి శ్రీనివాస రావు, సెల్ నెం: 89788 05843.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 9 kms. దూరాన, పేకేరు (Pekeru) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ అగస్త్యేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరుడు, ముఖమండపం, లోపాముద్రా దేవి, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. శ్రీ నీలకంఠ త్రిపురాంతక లింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ లోపాముద్రా సమేత అగస్త్యేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు చైత్ర శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు నిర్వ హించబడతాయి. మీన రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 7 Kms. దూరంలో బాలాంత్రం బస్ స్టాప్ ఉంటుంది. ఇక్కడ నుంచి పేకేరు గ్రామం నకు రోడ్డు ఉంది. వీటి మధ్య completedc దూరం సుమారు 3.5 Kms. గా ఉంటుంది. ఆటోలు ఉండవు. స్వంత వాహనములు కలిగిన వారికి బాగుంటుంది. ద్రాక్షారామం నుంచి పేకేరు కు ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. ఇది సౌక్యం.

* కాకినాడ - కోటిపల్లి బస్సులు (Via) గొల్లపాలెం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి.
* రాజమండ్రి - కోటిపల్లి బస్సులు (Via) రామచంద్రాపురం, ద్రాక్షారామం, కె.గంగవరం మీదగా ఉంటాయి.
* కె.గంగవరం నుంచి పేకేరు గ్రామం కు (Via) దంగేరు, మీదగా ఆటోలు ఉంటాయి. వీటి మధ్య దూరం సుమారు 9.5 Kms. ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి.
* ద్రాక్షారామం నుంచి మసకపల్లి గ్రామం నకు బస్సులు (Via) కె.గంగవరం, దంగేరు, పేకేరు, భట్లపాలిక మీదగా ఉంటాయి. బస్సులు చాల తక్కువగా ఉంటాయి.

NOTE:- ఆలయ దర్శనం కోసం యాత్రికులు ముందుగా కనీసం ఒక రోజు ముందుగా ఆలయ అర్చక స్వామిని సంప్రదించగలరు.



శ్రీ రాజరాజేశ్వరి సమేత అగస్త్వేశ్వర ర స్వామి

మీన రాశి, రేవతి నక్షత్రం (4 వ పాదం)

బాలాంతరం గ్రామం

**ఆలయ అర్చక స్వామి:** శ్రీ దొంతికుర్తి కామరాజు శర్మ , సెల్ నెం: 99890 75537.



**పాద శివలింగ స్థానం:** చాళుక్యుల భీమ మండలం నందలి ద్రాక్షారామ క్షేత్రానికి ఆగ్నేయం దిశగా, సుమారు 6.5 kms. దూరాన, బాలాంతరం (Balantram) అను గ్రామం కలదు. ఇచ్చట శ్రీ రాజరాజేశ్వరి సమేత అగస్త్వేశ్వర స్వామి ఆలయం ఉంది. శ్రీ అగస్త్వేశ్వర లింగము భీమసభ నందలి 108 శివ లింగాలలో ఒకటిగా ప్రతీతి.

**ఆలయం:** శ్రీ రాజరాజేశ్వరి సమేత అగస్త్వేశ్వర స్వామి వారి ఆలయం చాల ప్రాచీనమైనది. కాల క్రమములో ఆలయం పునర్నిర్మాణము జరిగింది. ఆలయ ప్రాంగణములో ధ్వజస్థంభం, చండీశ్వరుడు, ముఖమండపం, గర్భాలయం ఉంటాయి. ఆలయ గోపుర శిఖరము నందు దేవతా మూర్తులు కలరు. ఆలయ ప్రాంగణ ప్రవేశ ద్వారం వద్ద ద్వారపాలకులు, పైన శివమూర్తిని దర్శించగలము. శ్రీ అగస్త్వేశ్వరలింగం కి నిత్య అర్చనలు జరుగుతాయి. శ్రీ రాజరాజేశ్వరి సమేత అగస్త్వేశ్వర స్వామి వారి కళ్యాణోత్సవములు వైశాఖ శుద్ధ ఏకాదశి నుండి పాంచాహ్నికంగా జరుగుతుంది. శరన్నవరాత్రులు, గణపతి నవరాత్రులు నిర్వ హించబడతాయి. మీన రాశి జాతకులు, క్షేత్రం లోని శివాలయంలో అర్చన, అభిషేకములు భక్తితో నిర్వర్తించిన యెడల విశేష ఫలితములు పొందగలరని భక్తజనుల విశ్వాసము.

**రవాణా సమాచారం:** ద్రాక్షారామం నుంచి యానాం బస్సులు (Via) ఎర్ర పోతవరం, బాలాంత్రం, ఇంజరం మీదగా ప్రతి గంటకు ఉంటాయి. ద్రాక్షారామం నకు సుమారు 6 Kms. దూరంలో బాలాంత్రం బస్ స్టాప్ ఉంటుంది. ఇక్కడ నుంచి శ్రీ రాజరాజేశ్వరి సమేత అగస్త్వేశ్వర ర స్వామి మధ్య దూరం సుమారు 500 meters గా ఉంటుంది. ఆటోలు ఉండవు. స్వంత వాహనములు కలిగిన వారికి బాగుంటుంది.

* ద్రాక్షారామం నుంచి బాలాంత్ర గుడికి ఆటోలు ఏర్పాట్లు చేసుకోవాలి. ఇది సౌక్యం.

సర్వేజనా సుఖినోభవంతు లోకా సమస్తా సుఖినోభవంతు

ॐ ॐ ॐ ॐ ॐ

# ద్రాక్షారామం వసతులు

శ్రీ మాణిక్యాంబా సమేత శ్రీ భీమేశ్వర స్వామి వారి ఆలయం లోపల వాయువ్యం దిక్కులో సోమవారం మండపం కలదు. ఇచ్చుట యాత్రికులకు నిత్యాన్నదానం జరుగుతుంది. భక్తులు ముందుగా అన్నప్రాసాదం coupons తీసుకోవాలి. ఉత్తర ముఖద్వారం వద్ద శివశ్రీ తాళ్ళ సాంబశివ గారి శ్రీ రాజ రాజేశ్వరి పీఠం, నిత్యాన్నదానం సత్రం కలదు. దూర ప్రాంతములు నుంచి ఆలయాలు సందర్శనకు వచ్చిన యాత్రికులకు ఉచ్చిత అన్న ప్రసాదములు వితరణ జరుగును. భక్తులు ముందుగా అన్నప్రాసాదం కోసం ఫోనులో సంప్రాదించాలి. వీరి Cell 83320 29544.

ద్రాక్షారామం నందు మంచి రవాణా సౌకర్యములు దొరుకుతాయి. శ్రీ అడ్డాల సతీష్ కుమార్ (Auto & Taxi Owner) కి 108 శివాలయాలు గురించి మంచి అనుభవం ఉంది. ఇతడు మంచి వ్యక్తి. వీరి Cell No. 99084 24926. మీకు అవసరం ఉంటే సంప్రదించగలరు.



సర్వేజనా సుఖినోభవంతు లోకా సమస్తా సుఖినోభవంతు

☬ ☬ ☬ ☬ ☬










సర్వేజనా సుఖినోభవంతు లోకా సమస్తా సుఖినోభవంతు

🔱 🔱 🔱 🔱 🔱